ప్రభ' సచిత్ర వారపత్రిక
ఉగాది నవలల పోటీలో
మతి పొందిన



# వెలుగూ వెన్నెలా గోదారీ

పూర్తిగా జానపద శైలిలో
వెలువడిన తొలి
తెలుగు నవల

పోరంకి
దక్షిణామూర్తి

# వెలుగూ
# వెన్నెలా
# గోదారీ

నవభారత్
ప్రచురణలు

శ్రీ
దేవులపల్లి
కృష్ణశాస్త్రిగారికి



ఇంత చిరుగీతి
ఎద వేగిరించునేని
పాడుకొనును
తాండవ నృత్యా మాడుకొనును

యిత

# తర రచనలు

నివేదన

చిత్రలత

అరవింద

నీడలూ, జాడలూ

యింకా మరికొన్ని ....



ముద్రణ:

ఆంధ్రాప్రింటర్సు లిమిటెడ్, విజయవాడ-2.

# వెలుగూ వెన్నెలా గోదారీ

"అయ్యా, అయ్యా! రండయ్యా! నే నిస్తాను కొనం డయ్యా! పచ్చట్లో ఏసుగుంటే కరిగిపోవాల. సారులో యిదిపితే సానా రుసొస్తాది. బంగారంలాంటి కొత్తిమీరి. కొనండయ్యా!"

"కానీ కెన్ని కట్ట లిస్తావ్ ?"

"అందరికీ నాలుగు. తవఁరి కయిదిత్తానయ్యా!"

"అహఁ! అందరికీ యిలాగే చెప్తావా?"

"తవఁరి పాదాలసాచ్చి! అబద్దాలాడ్డం మా కులంలోనే లేదయ్యా!"

"అబ్బో! మాటలు నేర్చిన పిల్లవే! నీ కెల్లాటి మొగు డొస్తాడో ఏమో!"

"పోండయ్యా! నా పెళ్ళివూసు మీ కెందుకో?" మొగం తిప్పుకున్నాది.

"శృంగార నాయికవు కాదగినదానవే!" అనుకున్నాడు య్యగారు.

సావంచాయని మించి లేకపోయినా, కారునలుపు మొట్టుకున్న కాదు. పడుసుతనం సొగసంతా ఒళ్ళిరుసుకోక పోయినా, దాన్లో నిదరోయినట్లూ లేదు. ముదర పసూపురంగు పరికినీ కట్టుకుని, ఎర్రటి కండువా పయి సేసుకున్నాది. నీలంరంగు రయిక కొట్టొచ్చినట్టున్నాది. కొత్తిమీరి కాడల బంగారం చేతులికి పులువుఁకున్నాది. ఎండ ఏడికి మొగం కందిపోయింది. ముత్తాల్లాటి సెవఁటబొట్లు తలుక్కుమంటున్నాయి. గుండ్రపాటి మొకవుఁమీదున్న అర్ధరూపాయి కాసంత కుంకుంబొట్టూ కొంచెం కొంచెం కరిగి, ఒయ్యారంగా ముక్కుదూలం మీదకి జారతన్నాది.

అలానే సూత్తా నిలుసుండిపోయాడు బాలయ్యగారు.

అవదాన్లుగారి ఆవుదూడిల్ని పాకెంపుకి తోలుకెల్తావున్న రవణయ్యగాడు—రాజుగారితోటలో తను మాయిడిపింది లేరు కుంటావుంటే—ఆయేల, సందేల మాయిమబ్బులు కమ్మ కొత్తావుంటే—తోట కట్టబడి ఆడు దాపుకొత్తావున్నా లెక్క సేయకపోతే—పిల్లికూనలా సల్లగా ఒచ్చి ఆడు కొంగట్టుకు లాగినప్పుడు—

బాలయ్యగారు తనెంపు సూత్తంటే, అదంతా మల్లా గురుతుకొచ్చి ఒళ్లంతా సిగ్గొచ్చి సుట్టేసినాది రావుఁలమ్మకి.

తను అందిచ్చిన కొత్తిమీరి కట్టలు సేత్తోనే పట్టుకోని, తనెంపే గుచ్చిగుచ్చి సూత్తన్న బాలయ్యగారి సూపుల్లో లోనకే గుచ్చుకు పోవడంతో—

"మొగోల్లందరూ తన్నిలా సూత్తారేవోఁ ?" కున్నాది.

బాలయ్యగారు అక్కన్నిం చెల్లిపొయ్యారు.

"ఆరికి కోపం ఒచ్చిందేవోఁ?" అనుకున్నాది, రాఘ్రు లమ్మ.

పెదాలు బిగబట్టి నాలిక్కొరుక్కున్నాది.

తడితడిగా ఉన్న సేతులెత్తి సిగ గోక్కున్నాది.

మనసులోనే తను లెంప లేసుగున్నాది.

సెరాల్ని లెగిసి నిల్చుని, గుడ్డ దులుపుకున్నాది. గంప నెత్తినెట్టుకొని గుడిసికేసెల్లిపోయింది.

సందేలయింది కాని, పాలకాయిల్కింకా యిల్లకి రావటం లేదు.

సింతసెట్టుమీంచి దూకి, సిగురెత్తిపోత్తంటే, వున్న పలాన్ని వూడిపడ్డాడు రవణయ్య.

దాని సిగ తడివిఁ నవ్వాడు.

అది మల్లా నవ్వలేను సరిగందా, ఆణ్ణి యిదిలించుకున్నాది.

కళ్ళింతచేసి తేరిపార సూత్తన్నా—

సీకట్లో సెంతకొచ్చి సేరినా—

గడ్డిమోపెత్తుత్తా పరాసకంగా ఒంటిమీద సెయ్యేసినా—

రవణయ్య మావమీద దాని కేం కోపఁ వొచ్చేది కాదు. పైపెచ్చు మంచి సద్దాగా వుండేది. మాటా మాటా కలిపేది.

"మాటాడితేనే ముత్తాలు రాల్తాయేంటే పిల్లా?"

"ముత్తాలుకావు మావా, నీ మూతి పళ్ళు రాల్తాయి."

"ఓరబ్బో! సరసంలో నువ్వూ తగిందానవే! ఎఁయ్యేఁ!"

కొంగుంగట్టిన సింతసిగురు మూటట్టుకోబోయాడు. రావుఁలమ్మ అంకలేదు.

"ఇప్పుడయితే తప్పించుగుంటన్నావు కానీ, రేపు లగ్గం కానీ నీ పని సెబుతా!"

"సిస్సీ! నీతో పెళ్లా? పసువున్న ఆడదెవుత్తీ సత్తే నీ దరికి రాదు."

"ఓసోస్!" నవ్వాడాడు.

"సిగ్గుండద్దో?"

"ఏఁ వేం?"

"ఆయేల, శావనపున్నంనాటి రేతిరి—నే కల్లారా సూళ్లే దనుకున్నావా?"

అదిప్పటికీ కళ్ళకట్టినట్టున్నాది—

గంగన్నగాడి పెళ్లాన్ని ఆడు తాటితోపులోకి తీసికెడతా వుంటే—

కొత్తగా కాపరాని కొచ్చింది గందా, దానికి యీడితో ఏం పనుందో?

బుద్ధుండద్దో?

సీ్స!

అప్పన్నించీ, రవఁణయ్య పేరు సెబితే రావుఁలమ్మ సివాఁలెత్తేత్తాది.

ఈ అదున్లో ఆడు గబుక్కుని పట్టబోయాడు. సర్రుని లగెత్తింది రావుఁలమ్మ.

ఎనకాతలే తరువుఁదారంటే, వుంతకాడే బాలయ్యగా రున్నారయ్యో! ఉసూరుమని ఎనక్కి తిరిగాడు రవణయ్య.

సెట్లపైకి సేరి పిట్టలు గోల సేత్తన్నాయి. తాడిసెట్ల క్కట్టిన కుండలు మసకమసగ్గా కనిపిత్తా వున్నాయి.

ఇరిగిన తాటివోసంమీద కాళ్లు సాసుకూకున్న బాలయ్య దొరగారి దావుకెళ్ళి—

"దండాలయ్యగారూ!" అన్నాది.

ఉలిక్కిపడ్డా డాయన. తల తిప్పి చూశాడు. నవ్వి—

"క్రొత్తిమీరి తెచ్చేవేమిటే?" అంటూ అడిగాడు.

"కాదండయ్యా! సింతసిగురు కోసుగొత్తన్నా!"

బోది మలుపులో ఒంపుత్తిరిగి పడతన్న నీలల్లా గలగలా నవ్వింది రావుఁలమ్మ.

ఆ సందె ఎలుగులో బంగారుబొమ్మలా నవ్వినాది.

"నోరు జారి అనేశాను. కోపం సెయకండయ్యా!"

"క్రోప వెందుకే?"

"నోటికొచ్చినట్టు మాటాడాను. మన్నించండయ్యా!"

"ఓస్! అదా? ఏం ఫరవాలేదులే!"

అప్పుడు రావుఁలమ్మ చూసిన సూపు, మరింత ఎల్తురుంటే బాలయ్యగారి కన్నిపిచ్చేదే!

నల్లని ఆ సందేల, రావుఁలమ్మ సూడ ముచ్చటగా వున్నాది.

"నీకు పెళ్ళెప్పుడే రావిఁ?"

"లగ్గంనాడు రేత్తిరండయ్యా!"

"చమత్కారివే!"

నవ్వుకున్నాది.

"నీకో మాంఛి మొగుణ్ణి చూపిస్తాను. చేసుకుంటావుటే?"

సిగ్గులో ఒంకర్లోయినాది.

"రవఁణయ్యగా డెలా వుంటాడే?"

"స్సీ!"

"నువ్వంటే పడి ఛస్తాడే!"

"సత్తే పీడే యిరగడవుద్ది!"

"వాడికేంవేఁ? నిక్షేపంలాంటివాడు. కోరమీసవూఁ, ఒంపులు తిరిగిన కండలూ, నిడివైన ఛాతీ! ఏనుగులాటి మనిషి కాదుటే!"

"ఆకి! వూసెత్తకండయ్యా! తేల్లూ జెర్రిలూ పాకి నట్టుంటాది నాకు."

"ఆహాఁ! నీ కోసం సీమదొర దిగివస్తాడా యేం?"

"ఎవ్వత్తికి తగ్గోడు దానికి దొరుకుతాడులెండి! ఆ రవఁణయ్యగాణ్ణి మట్టుక్కెవరూ సత్తే సేసుకోరు. ఆడి గొనవేఁ సెడ్డ గొనం. సిగ్గుమాలినోడు."

నవ్వుకున్నాడు బాలయ్యగారు. దాని తిట్లు ఆరికి యిన సొంపుగా వున్నాయి.

గేదెల్ని తోలుకొచ్చి గట్రాటలికి కట్టేశాడు ఎంకన్న. కుసిన్ని గడ్డిపరకలు పెరుక్కొచ్చి ఆటి ముందు ఏశాడు. ఆరిపోయిన సుట్టపీకి దూరంగా యిసిరేసి దిమ్మకాడి కొచ్చాడు. ఒళ్లిరుసుకొని, సేతులు కట్టుకొని బాలయ్యగా రెనకాతలే నిలుసున్నాడు.

రావులమ్మకేసి తేరిపార సూత్తన్నాడు.

ఆ కల్లల్లో సొగసయిన కోరికి—

సేతి యిరుపుల్లో ఏదో గట్టి నమ్మకం—

మనుసయిన వూసేదో లోన ముసురుకొచ్చి ఒల్లంతా సిగ్గు పులువుకున్నాది రావులమ్మకి.

ఉన్నట్టుండి సీకటి కమ్ముకొచ్చింది. బాలయ్యగారక్కన్నించి లెగిశారు.

"ఒరేయ్ వెంకన్నా!"

ఉలిక్కిపడి అయ్యగారి కాళ్ళకాడి కొచ్చాడు.

"నే వెళ్ళిపోతున్నాను కానీ, పుంతమ్మట పాములు తిరుగుతూ వుంటాయి. పాలు పితికేశాక, దీన్ని తీసుకెళ్ళి వాళ్ళింటి దగ్గర దిగబెట్టు."

పెళ్ళికాని కన్నిపిల్ల—ఆడితో సీకట్లో పుంత దాడ్డవే?

"మనసులో ఆలోసన్లు అయ్యగారి కంత సప్పు నెల్లా తెలిసినాయో?"

'అమ్మో!'అనుకున్నాది రావి. ఉలకాలేదు, పలకాలేదు.

"ఫరవాలేదే! మీ అయ్యతో మాట్లాడి చైత్ర మాసంలో లగ్నం పెట్టిస్తాలే!"

"సిన్న బాబుగారు మాదొడ్డదొర!"అనుకున్నాడు ఎంకన్న

"మా మంచోరు!" అనుకున్నాది రావి.

మాయిడితోటనీ, నీల్లబోదినీ, కాల వవతలమూల పొలాన్నీ, సీకట్లో ఆల్లిద్దర్నీ యిదిలేసి—సెరసెరా నడిసెల్లిపోయారు బాలయ్యగారు.

ఆ వూరంతా కలిసి ఎయ్యి గడప కూడా వుండదు. ఆటిలో యానవండోరి లోగిల్ని మించింది అసలే లేదు. పెద్ద దివానంలాంటి యిల్లు. పురుసోత్తవుఁగారు సెవటోడిసి గడించిన సొత్తు; మొగపిల్లల్లేరని సెప్పి పెద్దల్లుడుగార్ని యింటికాడే వుంచుకున్నారు. సత్తెన్నారాయినగారు మామని మించిన దొడ్డాయిన. ఆరి పెద్దకొడుకు బాలయ్యగారు. పెద్ద సదుగులు సదూకున్నా, యింటిని కనిపెట్టుకునుండి, పైనించి ఎగసాయి పన్లు సూత్తావుండేవోరు. తండ్రిగారితో సెప్పి, ఎంకన్నని ఆరే పాలేరుతనానికి కుదిరిశారు. అప్పన్నించీ ఆడు ఆ యిల్లే కని పెట్టుగునున్నాడు.

## 2

ఇద్దరినించి అద్దరిదాకా ఒళ్లు తాసుకు పోతావున్న గోదార్ని సూసి సవుద్రదేవోనని బయిపడి, సెందురుడు మబ్బు వెనకాతల దాగున్నాడు.

బూవిఁ సుట్టూతా తాడులేని బొంగరంలా తిరిగేవోడి కూ్కాడా బయమెందుకో ?

మబ్బులంచుల్నించి జారి పడతన్న ఎన్నెల గోదారి సీల్ల మీంద పాలొలకబోసినట్లున్నాది. తలతలా మెరిసిపోతన్నాది.

ఆ ఎన్నెట్లో—

"ఈ ఏల పడవ మా జోరుగా సాగుతాది!" అను కున్నాడు సరంగోడు.

"సుక్కాని పట్టాపోయినా, రేలుబండిలా నడుత్తన్నాది" అన్నాడు అవతలోడు.

ఆ ఎన్నిట్లో గోపాలకిట్టమ్మే పిల్లంగోవి వూదుతా మైక మెత్తిస్తా వున్నా డనుకున్నాడు మూలగా కూసున్న ముసలోడు.

పచ్చరంగు జరీసీరలో కొత్త పెళ్ళికూతుర్లా కనిపిత్తా వున్న ఓ సిన్నది, అల్లంత దూరంలో ఆసిగా సూత్తన్న 'పడు సోణ్ణి' ఓరకళ్ళతో కనిపెట్టి సిగ్గుపడిపోయినాది.

దాని మెళ్ళో వున్న జిగినీ గొలుసు మీద ఆలో సనపోగా పక్కకి తిరిగి సిటికేశాడు, గళ్ళ లుంగీ గరానా మనిషి.

ఆడి పక్కవోళ్ళంతా చెవులు కొరుక్కున్నారు. పడ వంతా పూటుగా ఉన్నాది. లోన సావాను శానా వుందని, కొంతమంది జనం గూడెక్కి కూకున్నారు.

పామీ్మద పడుకున్న యిస్ణుమూర్తివోరిలాగ కాళ్ళు నిగడదన్ని పడుకున్నారు కొందరు.

ఆళ్ళనేం అండానికి దమ్ముల్లేనోళ్ళు ముడిసిపెట్టు కుక్కున్నారు.

గలగల్లాడతా గోదారి పడవ అంచుల్ని ముద్దెట్టుగుంటు న్నాది.

మబ్బులు గుట్టోంచి సెందురుడు జారిపడ్డాడు.

దాంతో దూరాన్ని కనిపిచ్చే సెట్లూ, సేవలూ బొమ్మలపటంలా గున్నాయి.

ఆ రేతిరి అంతా పాలనోన కురుస్తున్నట్టున్నాది.

అవతలున్న సుక్కానోడికి వుసా రందుకున్నాది. కూని రాగం వోటి లంకించుగున్నాడు.

ఆడి పక్కనే వున్న ఆడకూతురూ వో పదవందుకున్నాది. గాలి యిసురుకి తెరసాప లాడినట్టు ఆ పడవలోవోళ్ళందరూ పాటకి వూగిసలాడిపోయారు.

గోదారి గంగలో కలిసి సెందరలోకానికే ఎడతన్నట్టు తేలిపోయారు. పాట ఒదుగులిమీద పైకే పాకిపోయారు. ఆ మైకంలో ఆళ్ళ వాళ్ళు ఆళ్ళే మరిసిపోయారు.

కుళ్ళు మనసు గలోళ్ళకి కూడా ఆ పాట గుండిలు కడిగేసినాది. అందరూ కలిసి ఒక్క గొంతుకుతో పాడారు. పుస పుసా పొంగుతా ఎగిరి గంతేశారు. ఆ పదం నడకల్లో, ఎన్నెల ఎలుగుల్లో, గోదారి పరుగుల్లో మురిసిపోయారు.

మంచు గడ్డని పొర కప్పినాది. పడవలో జనవందరూ సొమ్మసిలిపోయి, గుండిల్లో మోకాళ్ళు దాసుకొని కునికిపాట్లు పడతావున్నారు. అప్పుడప్పుడా ముసలోడు రావుణ్ణి పిల్లవోc, ఒకోడు ఆవులించటవోc, కొత్త సీర సినదాన్ని సేతిగాజులు గలగల్లాడవోc—దూరాన కూసున్న పడుసోడి కళ్లు మెరుత్తా వుండడవోc, దా న్నానుకూకున్న అమ్మ కాల్లకున్న అందిలూ, కడేలూ సప్పుడవడవోc, సుక్కానోడు ఉండుండి రాగం తీడవోc ఆడి పక్కనున్న ఆడకూతురు ఉస్సురండవోc తప్ప, ఆ పడవంతా నిద్దర పట్టో మునిగినట్టే ఉన్నాది.

సలేసింది కాబోసు సందమామ మబ్బుల దుప్పటి కప్పుకుతొంగున్నాడు. సీకటి కూడా పడవలో పరుసుకు పడుకున్నాది.

సరసరా పడవ—

గలగలా నీళ్ళు—

ఇంకేం సప్పుడు లేదు.

పిల్లిలా నడుసుకొచ్చాడాడు.

పండులాంటి పిల్ల మెళ్ళో సెయ్యెట్టి తడివాఁడు.

ఆడికాఁవల్సింది దాని మెళ్ళో వున్న మెత్తదనం కాదు.

జిగినీ గొలుసు !

ఆడి కళ్ళు జిగేలు మన్నాయి.

ఆ పిల్ల మెడకి మొగోడి సేతులు తగల్డం అదే కొత్తేమోఁ మగత జారిపోయి మెనుకూ వొచ్చినాది.

కెవ్వుని కూసినాది.

ఆడి సేతిలో కత్తి మెరిసినాది.

ఆ కత్తి యిదిపిన మెరుపు ఒంకర్లు తిరిగినాది.

ఆ పిల్ల బెదిరిపోయింది.

ఇంతట్లోకే, ముసలోడి సేతిలో వున్న కర్ర ఎగిరొచ్చి బలంగా యీడి సేతిమీద పడింది.

ఆ పిల్లదాన్ని యిడిసేసి యీడు ముసలోడిమీదికి యిరుసుకు పడ్డాడు.

ఆ సిన్నది తల్లి వొళ్ళో మొగం దాసుకున్నాది. ఒల్లంతా ఒనికిపోతన్నాది.

ముసలోడెగిరి ముందుకొచ్చి స్సెల్లుని యీడి దవడమీద వ్రాసిపుచ్చుకొట్టాడు.

ఎనకనించి నాలుగు కర్రలు ముసలోడిమీదికి లెగసినాయి.

దీంతో రెండెంపుల్నించీ జనం సొచ్చుకొచ్చారు. పెద్ద గలాటా అయింది. గొంతులు సించుకుంటా అరుపులూ, కర్రలూ బరబరలాడిత్తా సప్పుడూ!

ఈ గొడవ సెందురుడేం పట్టించుకోలేదు.

ఆడెంపు కొంతమందీ, యీడెంపు కొంతమందీ సేరి పెద్ద యుద్దవేఁ చేశారు. అసలోళ్ళిద్దరూ దూరాన్నిలుసున్నారు.

కలతనిద్దరయి మెనుకూ ఒచ్చిందేవో సెందురుడు మబ్బుల్లోంచి ఎలపలికొచ్చి సూసీతలికి ఆ పడవ అక్కడ లేదు.

'ఏమయింది సెప్మా?' అనుకున్నాడు.

ఇంకేవఁవుతాది?

నట్టనడేట్లో ఆ పడివ మునిగిపోయినాది! దాంతో జనవూఁ అరీ మన్నారు.

ఆళ్ళల్లో రెండు పేనాలు నిలిశాయి.

ఆడూ, సిన్నదీ!

ఆడికి యిరిగిన తెప్పోటి దొరికింది. ఈత కూడా ఒచ్చు. సొమ్మసిలిపడ్డ సినదాని కడుపులో గోదారినీళ్ళన్నీ దాక్కున్నాయి. దాన్ని ఆడు తెప్పమీద కెక్కించి యీదుకొచ్చాడు. గోదాల్లో అక్కడక్కడ యిసక మేటేసుకు పోయున్నాది. కొంతసేవట్లో ఆడికో యిసకతిప్ప కనిపించినాది.

ఆ సిన్నదాన్ని నెమ్మలంగా తీసుకుపోయి అక్కడ పడుకో బెట్టాడు.

కడుపులో నీళ్ళు కక్కించి, సేతులు యిటూ అటూ ఆడిచ్చాడు. దాంతో అదింక సావదనినమ్మకం కలిగినాది.

ఇంకా దానికి తెలివి రాలేదు.

ఆ ఎన్నెల ఎలుగులో—

ఓనలో తడిసిన మల్లిపువ్వులా గున్నాదా చిన్నది !

అల్లాగే దాని మొగంలోకి సూత్తా కూసున్నాడాడు.

ఇంతమంది ఆడోళ్ళని చూశాడు కాని, దీన్లో ఉన్న సొగసు ఏ ఒకత్తికీ లేదు.

నిడివయిన కళ్లూ, సన్నటి ముక్కూ, బుల్లి నోరూ, పలాసటి గెడ్డం, మెత్తగా ఉంటూ దనిపించే మెడా !

తలకి బారిడు జుట్టు, యింకా నల్లగానే వున్నాది.

ఆనాటి రేతిరి, చల్లనిసోట, ఆ సిన్నదాని దరిని కూకు నుంటే ఆడి గుండి గురగుర లాడినాది.

దాని మెళ్లో జిగినీ గొలుసు మెరిసిపోతన్నాది.

గొలుసు తీసేసుకునీదాకా మనుసాగలేదు.

మెల్లో సెయ్యెట్టాడు. సోగ్గానే ముట్టుకున్నాడు.

అది కొంచెం కదిల్నాది.

ఆ కదల్డంలో మబ్బుల నీడలో కన్నెతాసు కదిల్నట్టే వున్నాది.

ఆడి కళ్ళు పక్కకొరిగి ఏదో ఆలోసించుకున్నాయి.

ఆ పిల్లే తనకొ అంకినప్పుడు, పిల్ల మెళ్లో గొలు సెక్కడికి పోతాదిలే !

అది తన్ని ఒల్ల కాదంటే ?

మొల్లో కత్తి సేతికి తగిల్నాది.

సీ ! సచ్చు మొగోడు !

దాని మెడను నునుపు ఏళ్ళతో తడివి సూడాలని మను సయినాది.

మల్లా చెయ్యేశాడు.

అది కళ్ళు తెరిసి సూసింది.

ఆడు మొగం పక్కకి తిప్పుకున్నాడు.

"ఎవరు నువ్వు?"

ఆడు మాటాల్లేదు.

"మా పడవేదీ? మా యమ్మేదీ? నన్నిడి కెందుకు తెచ్చావ్?"

ఆడు నవ్వాడు.

"ఎర్రిదానా! మీ యమ్మా, నీ పడవా అన్ని గోదాల్లో కొట్టుకుపోయినాయి. బతికినోళ్ళం నువ్వూ, నేనే!"

"కాదు. నే న్నమ్మను. నువ్వబద్దం సెబుతన్నావు. ఆళ్ళ నందర్నీ మాయిచేసి నన్నెత్తుకొచ్చావు" దాని కేడుపే వొచ్చింది.

ఆడు మళ్ళీ నవ్వాడు.

"నిజవుఁ సెపితే ఎవరూ నమ్మరు మరి! పోనీ, అబద్దం సెప్పమంటావా?"

అది ఆడెంపు సూణ్ణే లేదు.

"మీ యమ్మ నిన్ను నా కప్పసెప్పింది!"

"స్సీ! దున్నపోతా! మా యమ్మ నీకు సచ్చినా యియ్యదు. ఆళ్ళ నేం చేశావో సెప్పు!"

మాటాడకండా ఆడు గోదాట్లోకి చూశాడు.

ఏడుపు పొల్లుకొచ్చినాది. నోట్లో ఏళ్లు కుక్కుకుని గుండెలు పిండుకున్నాది.

"అమ్మో! అమ్మో!!" అంటా గొంతుకు సించుకు పిల్చినాది.

గోదాట్లోంచి మాటలు పైకి రాలేదు.

సిన్నసిన్న కెరటాలు. ఆరిందాల్లా ఒచ్చి యిసకమీద పడి యిరిగిపోతన్నాయి.

సేతులెత్తి మొత్తుకున్నాది.

పెదాలు కొరుక్కున్నాది.

జుత్తు పీక్కున్నాది.

ఏడిసీ సత్తూ కూడా లేక కుప్పలాగా కూలిపోయింది.

ఆడు దాపుకొచ్చాడు.

కాళ్లెడంగా పెట్టి నిలుసుని, సేతులెనక్కి కట్టుకుని, సిన్నగా నవ్వుతున్నట్టు పెదాలు కదిలిచ్చి, కళ్ళు సగం వాల్చి దాన్ని సూత్తా వుండిపోయాడు.

రెండు సిటికెలల్లాగే వున్నాడు.

ఉస్సూరుమనీ అన్నాడు.

దాంతో అది బుస్సుమని లెగిసినాది.

ఆడి మొగంమీద వూసింది.

"పో, ఎదవా! పో! ఈ గొలుసుకోసం మా యమ్మని సంపావు. 'ఆణ్ణి' కూడా ముంచావు. పడవలోవోళ్ళందర్నీ పొట్ట నెట్టుకున్నావు. ఎదవ సచ్చినోడా! నీకు అమ్మ లేదు—"

ఆడు నవ్వుకున్నాడు.

"—అప్పా సెల్లిళ్ళు లేవు. బంగారం కంటడితే పేనాలు కూడా తీత్తావు. పో, పో! యీ గొలుసు తీసుకోని నన్నిడిసిపో. నా దార్ని నన్ను పోనియ్యి! అమ్మా!" అంటా గట్టిగా అరిసింది. మెళ్లో గొలుసుతీసి యిసికిలో యిసిరేసింది. ఇసయిసా నడిసి గోదార్లోకి లగెత్తింది.

గోదారి ఉలకలేదు.

ఆడెల్లి దాన్ని ఆపేశాడు.

మోకాలు లోతులో నిలేశాడు.

'అమ్మా!' అంటా మల్లా అరిసి, ఆడి కాళ్ళకాడే వాలిపోయినాది.

దాని బుజాలు సేత్తో మెత్తగా పట్టుకోని యిసకలోకి యీడుసు కొచ్చాడు.

సెందురుడు శానాదూరం నడిసి నడిసి అలసిపోయాడు.

సాలిసిపోడంతో ఎలుగూ నీర్సపడ్డాది.

దాని పక్కన ఆడు అల్లాగే కూకుండిపోయాడు.

ఏయేవో ఆసలు పొడుసు కొచ్చినాయి.

మొగతనవు సురసురమన్నాది.

పాపం, దానొళ్ళు దానికే తెలీలేదు!

అయినా ఆడు మనసాపుకోలేకపోయాడు.

అల్లా వుండగానే—

మసక ఎల్తురులో దూరాన్నించి తెరసాపోటి కనిపించినాది. పడవ దరికి రాగానే ఆపి, దాన్ని బుజంమీద ఆన్చుకుని లోన కెక్కించాడు.

రాయవంద్రం సేరుకునే ఏలకి తెల తెలవోరతా వున్నాది.

ఆళ్ళందరితోటీ, ఎనకటి ముసలోడు కూడా దిగడంతో ఆడికి శానా యిద్దూర మయినాది.

గట్టు సేరుకుని, దాన్నో రాయిసెట్టుకాడ పడుకో బెట్టాడు.

ముసలోడు కూడా ఎనకాతలే వొచ్చాడు. దాని మొకంలోకి చూశాడు. ఒళ్ళు సెవట్లోసినాయి.

ముంతతో గోదారినీళ్ళు తెచ్చి దాని మొకంమీద సల్లాడు. ఆ సిన్నది కదల్లేదు.

దాన్ని రెండు సేతుల్లోకి తీసుకోని కళ్ళదగ్గిరిగా పెట్టు కున్నాడు.

"అమ్మా!" పిలిసాడు ముసలోడు.

ఆ పిలుపు గుండి లోతుకంటా యెల్లి ఎయ్యిసాళ్లు మారుమోగింది.

దాన్లో మిగిలున్న కొనసేన వేదో ఆ పిలుపుకి లోన కద లాడినాది.

మల్లా పిలిసాడు.

అది కళ్ళిప్పినాది.

ముసలయ్యని చూసి ఎక్కెక్కి ఏడిసినాది.

"నీ కేం బయ్యం లేదు తల్లీ! నే నున్నాగా!"

ఒక్క సిటికి ముసలోడి కళ్ళల్లోకి రెప్పవెయ్యకుండా సూసినాది.

ఆ సూపుకి నీళ్ళపొరలు అడ్డబడ్డాయి.

"అమ్మ సచ్చిపోయింది తాతా" ! ఎక్కెక్కి ఏడ్సినాది. ఆ ఏడుపులో సుళ్ళు తిరిగినాది. ఆడి సేతుల్లోంచి కిందికి జారి పోయినాది.

ముసలోడు ఆ దొంగోడెంపు సురసురా చూశాడు..

ఆడు మొకం తిప్పేసుకున్నాడు.

ముసలోడి రగతం సలసల కాగింది. మొగం కందగడ్డయి నాది. ఆణ్ణి చూసి తుపుక్కున వూశాడు.

కొబ్బరికాయిల బత్తాల కానుకుని ఆడు గోదారొంక సూత్తా నిలుసున్నాడు.

"ఆ ఎంపు తిరిగి ఏం సోద్దెం సూత్తన్నావురా ? నా సిట్టి తల్లి పొట్ట అప్పడవులా గయిపోయినాది. ఊళ్లోకెల్లి తిండాని కేదేనా తీసుకురా !"

మారు మాట్టాడకండా ఆ డెల్లిపోయాడు.

ముసలోడు సిన్నదాన్ని గుండె కొత్తుకున్నాడు. ఆడికీ కళ్ళు సెమ్మగిల్లాయి.

"మా యమ్మేది తాతా !"

ఆడు మాట్లాడకుండా అల్లాగే సూత్తన్నాడు.

"సెప్పవూ ?

బాద పొల్లుకు రాడంతో మొగం దాసుకోడానికి గోదా రెంపుకి తిరిగాడు. ఏం సెబుతాడు?

"తాతా! మాయమ్మ నిజంగా సచ్చిపోయిందా?"

"లేదమ్మా! లేదు. మీయమ్మ బతికే వున్నాది!"

"ఏది? ఎక్కడున్నాది?"

"..............."

"గోదాల్లో వుందా?" నోట్లో సేతులు కుక్కుకున్నాది.

"లేదమ్మా గట్టుమీదే వున్నాది. నీదరినే వున్నాది."

"ఏది తాతా? ఏది?" అంటూ ఇటూ అటూ సూసింది ఏం కనిపిచ్చలేదు. అమ్మ, అమ్మలాటి మనిసి, అమ్మని మరిపిచ్చీ మనిసి, యిక్కడా, అక్కడా ఎక్కడాలేదు. ఏదీలేదు. అమ్మ గోదాల్లో మునిగిపోయింది. గోదారే అమ్మని పొట్టనెట్టుకుంది. తనకింకెవరున్నారు?

"అమ్మా! నేను మీ యమ్మని కానా సెప్పు!" అంటూ గుచ్చి గుచ్చి దాని కళ్లల్లోకి చూశాడు ముసలయ్య.

తాత గుండిలిమీద వోలి ఆ సిన్నది గొల్లుని ఏడిసింది. సల్లగా దాని తల నివురుతా ఆకాసె వొంక సూశాడు. జాయిగా పైకిలేస్తువున్న లేతెండలాగే, ముసలోడి గెడ్డంలో దాగున్న పెదాలు కదిల్నాయి.

గలగలా గోదారి గజ్జి లోయిస్తా వున్నాది. చెల్లెక్కి పిట్టలు పిల్లల్ని పలకరిస్తా వున్నాయి. అద్దరినున్న చెట్లనించి సూరీడు ఎనక్కి వోలిపోతావున్నాడు.

గట్టుమీద కూసుని కాళ్లు గోదాట్లో పెట్టుకొని నీళ్ళు సెదర గొడతావున్న సీతమ్మకి ఉన్నట్టుండి గుండె అదిరినాది. కాళ్లెనక్కితీసుకుని దోసిడితో నీళ్లుపట్టుకుని కళ్ళింతచేసి సూసింది. ఇదిలేసింది, మల్లా మల్లా యిదిలేసింది. ఆటిలో దానికేం కని పించలేదు. అమ్మ మొగానికి బదులు, తన్నేతను పదిసార్లు సూసుకున్నాది.

పొద్దంతా అక్కడే కూసున్నట్టు కూసుంది. నీళ్ళు పైకి తీస్తా, ఒలక బోస్తానే వున్నాది.

దానివోటం సూసి, 'పిచ్చిదేమో' అనుకున్నాడు బద్రయ్య.

జాలిగా కళ్ళల్లో నీళ్లెట్టుగున్నాడు ముసలయ్య.

ఇవేయీ సీతమ్మ పట్టించుకోకండా గోదారి కెరటాల మీదే మనసు నిలిపి, కన్ను ముయ్యకండా సూత్తా నిలుసున్నాది.

తెగించి అన్నాడు బద్రయ్య: "దీనికి గోదారి పిచ్చి పట్టి నట్టుందే!"

కళ్ళతో మింగేసీలా సూశాడు ముసలయ్య. తేలిగ్గా నవ్వాడు బద్రయ్య. సొగసుగా మీసం దువ్వుకున్నాడు.

ముసలయ్య సరసరా నడిసెల్లి సీతమ్మ బుజంమీద సెయ్యేశాడు.

" రా అమ్మా! మనవెల్లిపోదారి. ఈడి దగ్గిరుంటే పరువు దక్కదు. పట్నవంతా తిరిగి ముట్టెత్తి నీకు వోణ్ణిం పెడతా!"

"సీరావఁ నవ మెవ్వుడు తాతా?"

"శానా రోజులుందమ్మా ఇంకా!"

"మనం బద్రాసెల వెఁడదారా?"

ఆ మాటనేతలికి సీరావుఁడు ఆడి మనసులో మెదిలి ఒళ్ళు మరిపిచ్చేశాడు. కొండమీద ఆ గుడిలో రావుఁలోరి కాళ్ళకాడ వోలిపోయినట్టే తలుసుకున్నాడు.

బద్రాద్రి రావుఁడు తన ఎదటకొచ్చాడు. తనలోనే కలిసిపోయాడు. ఆడే రావుఁడయి పోయాడు!

ఆ సిన్నదాని మొగంలో సీతమ్మ కనిపిచ్చినాది. గుడి తలుపులు తెరిసెట్టి కొండ దిగొచ్చినాది!

ముసిలి రావయ్యకి సీతమ్మతల్లి కన్నతల్లి!

"నువ్వెక్కడుంటే అక్కడికే ఆయినొత్తాడమ్మా! మన ముంగట నిల్సుని దరిసెన విత్తాడు, ఏరే బద్రాసెలం ఎల్లక్కల్లేదు. ఊళ్ళోకెళ్ళి కుసింత గెంజి అడుక్కుందారా!"

బద్రయ్య ఎదురొచ్చి నిలబడ్డాడు.

"ఎక్కడికి పెయ్యానం?"

"ఏట్లోకి!"

"ఆ ఎంపుకామ యీ ఎంపున్నాది!"

"అచ్చే నీ మొగంలో ఉన్నాది."

నవ్వాడాడు. "నాతోరి పరాసకవెందుకు ముసలయ్యా? నువ్వా ముసలోడివి; కాలిరిగినోడివి. దీన్నిప్పుడెక్కడికి తీసికెల్ల గలవు సెప్పు! మీరిద్దరూ నాకాడే వుండండి. మీ యిద్దరికీ నే కూడెడతా!"

"నీ సేతి కూడా? స్సీ! మేమేం గతి లేనోళ్ళం కాం!"

"పోనీ మీ కూడు నాకూక్కడా పెట్టండి!"

ముసలయ్య సీతమ్మ ఎంపు సూశాడు.

"ఉహూం! ఈల్లేదు!" అన్నాడు.

బద్రయ్య బతిమాలుకున్నాడు "నాకూడు మీరూతినొద్దు, మీది నేను తిన్ను. ఈ సిన్నదాని మెళ్ళో గొలుసు నాకిచ్చేత్తే సాలు! అది బజార్లో అమ్మేసి డబ్బు తెత్తా. ఈ గోదారి గట్టునే సిన్న పాకేసుకొని వొటేలు పెట్టుకుందారి. పడవాల రేవులోకొచ్చే వోళ్ళందరూ మనకాడికొత్తారు. యాపారం జోరుగా సాగుతాది. సీతమ్మ గొలుసిత్తేసాలు బిగినీసులో లచ్చలు గడిత్తా! సొమ్ము దాందీ, కట్టవు నాదీ! ఏవంటాం?"

ముసలోడు మళ్లా సీతమ్మోంపు సూశాడు.

మెల్లోంచి గొలుసుతీసి సీతమ్మ ఆడిసేతిలో పెట్టింది.

బద్రయ్య సటుక్కు నందుకున్నాడు. గిరుక్కుని ఎనక్కి తిరిగి ఎల్లిపోతావుంటే గుబుక్కుని ముసలయ్య నిలేశాడు.

"ఏం ?"

"గొలుసు చేతులో పడ్డాదని ఒయికుంటం ఒలికిందను కుంటున్నావేవోఁ! జాగర్త! నాకన్ను కప్పేవో, నీ పేనాలు తోడేత్తా! తెలిసిందా?"

డబ్బు మైకంలో ఆడు ఒళ్లే మరిశాడు.

"నీ మీదొట్టు ముసలయ్యా! దాని మనసుకి నేను కట్టం కలిగిత్తానా సెప్పు. అమ్మ తోడు కాదో?"

ఇసయిసా నడిసి ఎల్లిపోయాడాడు.

ఎల్లాగన్నా దానిగొలుసు చేతికి సిక్కింది గందా, ఆదేసు కుని మెడ్రాస్సెక్కేద్దారను కున్నాడు బద్రయ్య.

బజార్లో కాటా ఏయిత్తే రొండొంద లిత్తావన్నారు. అయిసరబొజ్జా అనుకున్నాడు.

ఎన్నకోపాలిల్లాగే బెమ్మన్న మనవరాల్తో మెద్రాసు లెగిసి పోయాడు. గుమ్ముమంటా యిద్దరూ తెగ తిరుగారు. ఓనాడు, సందేల కావోలు, తన సేతులు నిండుకోడం చూసి ఓ నాయు డోరి బుల్లోడితో ఏదో పనుండి ఎల్లిపోయిందది. అంతే మళ్లా కనిపిత్తే ఒట్టు ! ఆడదన్నా, డబ్బన్నా అంతేగా బాబూ! పట్టొ దిత్తే సెయ్యి మారినట్టే లెక్క. అల్లాటప్పుడు సెన్నాపట్నంలో మట్టుక్కి పాంకునీ దేంటంట?

పోనీ, మల్లా కోనసీవ కేపోతే?

అయ్యబాబూ! సింవం నోట్లో తలదూరిసినట్టు కాదో?

ఓపాలి మిక్కిల్నేని మీసాలయ్య కూతుర్ని అల్లరెట్టా వని దాని తరపోళ్ళు కర్రలేసు గొచ్చారు. బండి గుర్రవ్నీ యిడిసేసి చిటికిలో తప్పించు కొచ్చాడు. గానీ, నాసావిఁరంగా పడవలో వోళ్ళకంటే ముందరే ఆడు సొరగలోకం సేరుకోవల్సి నోడు. ఏం పున్నెం సేసుకున్నాడోగాని యీ ఎల్టికి బూమ్మీద నూకలు మిగిలాయి!

రెక్కలొచ్చిన పిట్ట దేసెవంతా అడిదే.

తెలివైనోడు యాపారం సేత్తాడు. బురద గొడ్డోడు నౌకరీ సేత్తాడు. ఎనకటికి ఆడి తాత అనీవోట్ట. అల్లాగని సత్తెన్నగాడు సెప్పాడు. సత్తిగోడి యాపారం వేఁటంటే యానం దేసెవ్వుఁనుంచి సిలుకు బట్టలూ, సేతి వోచీలు, యింకా సొగసు సావాన్లన్నీ దొంగతనంగా చేరేసి లాబాని కమ్ము కుంటా వుండీవోడు. అందుకు ఆడు పట్టిందల్లా బంగారవఁయినాది. ఆడివల్లే ఎక్సయిజోళ్ళు కూడా జేబుల్నింపు కున్నారు. అందు కని చెప్పేసి సత్తిగాండితో యీడు కూడా జత పడదావఁను కున్నాడు.

అయితే యీ రెండొందలూ పట్టుకొని తను పారిపోయి న్నాడు, ఆ కుంటోడు, సిన్నదీ ఏవఁయిపోతారు?

ఈ దీదికీ తిరిగి అడుక్కుంటారు. కులాయి కాడ కుసిన్ని నీళ్ళుతాగి ఏసందు మలుపులోనో తొంగుంటారు. ముస లోడికి మగత నిద్దర రాడం చూసి, ఏ కుర్రనాయాలో దాన్ని లెగదీసుకు పోతాడు!

ఓరబ్బో! ఆవ్వూసు తలుసుకుంటేనే ఆడికి గుండిలో గున పాలు.

చక్కనిసుక్క యీదినిబడితే దానిసొగసంతా ఏవఁయి పోవాలి?

సీతమ్మమీద జాలీ కలిగినాది!

పాపం దానికింకెవరూ లేరు. తనకీ లేరు?

'ఇద్దరమూ కలిసిపోదాం గదనే స్సైల్ మోహానరంగీ!'

ఈ పదం అడెమరుగా పాడితే ఒళ్ళు సిట్లు బొడుత్తాడు.

సిసలైన కోనసీవఁ కుర్రదది! వా! వరె వా!! పెదాలు సప్పరించుగున్నాడు. తనబలవూఁ పెగ్గి చూసి ఏనాటికైనా ఒల్లక పోతాదేంటిలే!

'దాని మనసు మల్లిత్తే నూరు ముదర కొబ్బరికాయలు నీ కాళ్ళకాడ కొడతా సిన్నాంజి నేయస్సామీ' అంటా మొక్కున్నాడు.

సీతమ్మ గొలుసు బజార్లో యిచ్చేసి, యింటికి కావల సిన సరకులన్నీ కొని తెచ్చి ముసలోడి ముంగట పారేశాడు.

"ఆ డబ్బు తీసుకొని పారిపోయావనుకున్నా బద్రయ్యా!" అన్నాడు ముసలోడు.

ఓరకన్నుతో సీతమ్మేంపు సూత్తా 'అరనవ్వు' నవ్వాడు బద్రయ్య. బుజాలిరుసుకుని, నరాలు కదిల్చాడు. సీతమ్మ నడ కలో ఒయ్యారం సూత్తా అలానే వుండిపోయాడు.

గోదారి తెచ్చిచ్చిన సీ మాలచ్చి కాదో అది?

ఆడు కిట్టమూర్తి వోరయిపోడో? కిట్టుడి తనవఁన్నది తెచ్చుకుంటే వొచ్చేదా?

మిగిలిన డబ్బుతో గోదారొడ్డుని రొండుపాక లేయిం చాడు బద్రయ్య. వోటి వొంటేలికి. యింకోటి ఆళ్ళకీ!

ఒటేలు తెరిశాడు. "సీతాలచ్చిం ఒటేలు" అనిపేరెట్టాడు.

సీతమ్మ ససేమిరా అన్నది. తాతదగ్గర ఏడిసింది. తన్ని నలుగురు నోళ్ళల్లోనూ పడేస్తన్నా డన్నాది.

"తాతుండగా నీకు బయవేంటి తల్లీ?" అన్నా డాడు.

ఆ పిల్ల కళ్ళల్లో ముత్తాలు మెరిశాయి. తాతకాళ్ళకి మొక్కుకున్నాది.

"గోదారమ్మ నిన్నెప్పుడూ కనిపిట్టే వుంటాది తల్లీ!"

కొబ్బరికాయల ఏపారం మా జోరుగా సాగుతున్నా దేవోఁ కొసనీమనించొచ్చే పడవలికి ఎడతెరపిలేదు. సీతమ్మ ఒటేలుసూచి, పడవలోళ్ళు సెరసెరా లోసకొచ్చేవోళ్లు. తియ్యటి కబుర్లుచెప్పి సల్లగా తినిపిచ్చి దమ్మిడీకాడినించీ పేలేసి వాసూలు సేసుకునివోడు బద్రయ్య. కానీలికి అణాల్లెక్కని లాబాలు గుంజుకుంటున్నాడు. మొకాలు మచ్చికయ్యాక సిన్నసిన్న అరువులిచ్చి 'కాతాబొక్కు' తెరిశాడు. అరువులు అప్పులయినాయి. అప్పులు కాయితాల్లోకూడా ఎక్కిన యున్నాయి.

డబ్బు గడించడవుఁలో ఆడు వోళ్ళే మరిసి పోయాడు. ఒటేలు యాపారానికి పనోళ్ళ నెట్టుకుని కొబ్బరికాయలమీద అంటిగెల్లమీదా, జీడిపప్పుమీదా, మాయిడిపళ్ళమీదా కమీష నేపారం చేసేవోడు. సరుకోడిదీ, కొనీవో డింకోడూ, మద్దిలో మాట్టాడి పెట్టినందుకు కమీష నీడిదీ! ఈడికి తెలీకుండా ఆడిదగ్గరా, ఆడికి తెలీకుండా యీడిదగ్గరా తలో కూంతా తీసు కుని జేబు నింపుకుంటాడు.

ఆ వుసారులో ఎగిరి గంతేసీవోడు. 'నేపట్టినయ్యి పైడి ముక్కలాయెనే!' అంటా పాటే లంకించుకునీవోడు.

సేవన సుక్కురారం సంజేల, గోదారిగట్టు మీద సతికిల
పడి కూకుని, దూరాన్నించొచ్చే పడవల తెరసాపలు సూత్తా
వున్నాడు ముసలయ్య.

ఎన్ని యేల ఏళ్ళనించి పారుతున్నాదో గోదారి! ఎన్ని
యేల పడవలు నడుత్తా వున్నాయో?

ఎన్ని తెరసాపలు గాలికి రెపరెప లాడాయో?

ఒకో మనిసిని, దేవుఁడు తన్లో కలుపుగునీ లోగా ఎన్ని
ఏల పుట్టుక లిస్తాడో ?

ఒచ్చే పడవలూ,పోయీ పడవలూ !

సవుంద్రంలా గోదారీ!

పొగలంతా సూరీడు--

రేతిర్లు సెందురుడు!

ఇద్దరూ మారలేదు. గోదారీ మారలేదు.

పడవలు మారినాయి. పడవల్లో మనుసులు మారారు.
మనుసుల మనసులు మారినాయి!

పెయ్యానవయ్యాక లంగ రేస్తారు.

కదిలీ ముందు తీత్తారు. సుక్కాని తిప్పుతారు.

కొండమీంచి సుక్క పొడుచుకొస్తాది. పురిటిగదిలో పాప
కేరు మంటాది.

మల్లా, మల్లా అలాగే !

ఆ పడవా, ఈ పడవా నడిసేది ఒకే గోదాట్లో !

దానికీ దీనికీ నడవల నీలాల నీళ్ళు !

మనుసుల సుట్టూ కొండలు !

మనిసికీ, మనిసికీ నడాన్న కొండలు.

ఆ కొండల్ని ఆళ్ళు కరగించలేరు.

మామూలు కొండలికి పైపైన సిగుళ్ళు.

ఈటన్నిటికీ పునాదులే పయిన !

కొండలులేపోతే మనుసులు నిలవలేరు. మనసులు నిలి సేయాకావు.

ఏంటో సిత్రవంతా?

సల్లటి సెయ్యొచ్చి ముసలోడి బుజాలికి మెత్తగా తగిల్నాది.

ఆడు ఎనక్కి తిరిగాడు.

"ఏం సూత్తన్నావు తాతా?"

"మనిసికీ మనిసికీ మనసులో కొండలు,

మొగుడికి పెళ్ళానికి మద్దిలో కొండలు!"

పిచ్చోళ్ళడు తాతయ్య!

"నీకూడా పెళ్ళి అయిందా తాతా?"

"నాకాదమ్మా ! జగ్గన్నకయినాది!"

సీతమ్మ నవ్వింది.

"పిల్లలా?"

"ఉన్నారమ్మా ! ఇద్దరు. కాదు అయిదుగురు!"

"ఆళ్ళేరి మరి?"

"కొండల్లో ఉన్నారు."

"ఏ కొండలు? పాపికొండలా?"

"దానికి నాకూ నడవ నిలుసున్న కొండలు!"

"సిత్రంగా వుంది తాతా! ముసలమ్మా, పిల్లలూ సచ్చి పోయారా?"

"రావఁరావఁ! నిండు పేనాలు తల్లి! ఇంతమందిని మోసీ బూదేవమ్మకి ఆళ్ళు బరువవుతారా అమ్మా!"

"నీ మాటలేం తెల్టంలేదు. నీకతంతా నాకు సెప్పవూ?" ముసలయ్య నవ్వాడు.

# 3

ఆనాటి మాట నిన్నటి కతలా కనిపిస్తాది రావుఁలమ్మకి. ఇన్నేళ్ళబట్టి కాపరవుఁ సేత్తన్నా ఆడిమీద మనుసు తీరేలేదు. పొగలూ రేత్రిరీ ఆడి కాళ్ళకాడే పడున్నా ఎల్లకాలం అల్లాగే ఉండాలనిపిస్తాది. ఏంటో ఆ మవఁకారం. జనవఁ జనవాఁలికి ఆడే తన మొగడవ్వాలని కోరుకుంటాది. తన సీరకొంగుకట్టుకొని సితంగా సూసి నవ్వుకుందారనిపిస్తాది! ఒరబ్బో! ఆడు మనిసా? దేవుడే!

'అదంతా అయ్యగారి సలవ!' అనుకున్నాది రావిఁ. 'ఎన్నలాటిగుండి! అందరికీ తన్లాగే నచ్చినోడూ, మనసిచ్చినోడూ, దొరుకుతాడేంటి? ఉసారు ముంచెత్తుకొత్తే ఆడెదటి కొండలు మట్టుక్కీ ఆగ్గలవా? ముమ్మరవఁయిన గోదారి వొరద లాంటోడు నావోడు!' అనీ అనుకున్నాది.

పెళ్ళయిన తొలిరోజుల్లో ఎలాగుండేంది తను? ఆడెక్కడుంటే అక్కడ లేదో? పొలవెఁడితే పొలవేఁ. కూలిపని కెడితే ఆడెనకే! ఎండబడి తిరిగొస్తే సల్లటి గెంజిలో ఉప్పు నలిపి తాగిచ్చేది. ఒనలో తడిసొత్తే సెంగుతో తలతుడిసేది. 'సాంబ రానీ పొగకూడా ఏత్తావేంటే?' అనీవోడు పరాసకంగా. ఎదురెదురుగా కూకుంటే ఏవేఁవో ఆలోసన్లు పొడుసుకొత్తాయి. ఆడికేదో అనాలనిపిస్తాది. దానికేని! ఏదో సెయ్యాలనిపిస్తాది.

అలాటప్పుడు ఆడు సూసీ చూపుకి తట్టుకోలేక స్తిత్తయిపోయి వోలిపోతాది. ఆడు దానికళ్ళముందు నించి కదల్లేక పోతాడు. ఓ ఆటతోను, ఓ పాటతోను, ఏరే తోటలోనో అల్లా అల్లా ఒ సినెవాలో అడతన్నట్టు రోజులు గడిపేసీవోరు.

ఎనవండోరి లోగిలి ఎంతో మారినాది. పురుషోత్తవుం గారు పోయాక ఇంట్లో కరుసు శానా పెరిగి పోయింది. ఆరి తోడ ల్లుడుగారి సంతానవంతా యీరింటిమీద పడి మేసీవోరు. పెళ్ళాం బిడ్డల్తో వచ్చి యిందు బోజినాలు మెక్కీవోరు. అల్లా గని యిసిగోవసువుం వున్నవోళ్ళా? అదీలేదు. తిన్నింటివోసాలే లెక్కెట్టీవోళ్ళు! అత్తగారూ, బారియా బాదపడతా రేవోని, సత్తి న్నాయనగారు కూడా ఏం అనీవోరుకారు. పైగా, సెనిగొట్టు దివానం ఓటి కొండవూ, ఆ సావాన్తో లోన గాదికొట్లు ఏయించ డవూం జరిగింది. దానా దీనా పదెకరాల బూవిఁ నట్టాన కమ్మె యడం అయింది. కొబ్బరితోట దూబాసోరు, నడిందొడ్డోది తోటసత్తెవూం, మిగిలింది యేరోవోళ్ళు కొన్నుకున్నారు. దాంతో ఆరి సంసారం దెబ్బతిన్నాది. ఎంకన్నని కూడా పాలేరు పన్లోంచి మానిపించేశారు. తల్లి నిడిసిపెడతన్న లేగ దూడలా గిల గిలాడాడు పాపం! దానికి ఆరు మట్టుకు ఏం సేత్తారు? పెట్టా పోయినా పెట్టే అమ్మని సూబించమన్నట్టు నరిసిం దేవరోరితో మాటాడి ఎంకన్నకి ఆరికాడ నవుకిరీ యిప్పించారు. సత్తెన్నా యినగారు. ఆపాటి వుపకారానికే ఆరికి ఎయ్యిదణ్ణాలెట్టు కున్నాడు ఎంకన్న.

ఇయేయియీ పట్టించుకోలేదు రావుఁలమ్మ. మంచి పొం కంలో వుందేవోఁ, దానికి ఆడు ఎదట కూసుంటే సాలు

యింకేయీ అక్కర్లేదు. "అత్త లేదు, మావ లేదు, ఆడబోడుసు పోరు అసలే లేదు. ఎంతదురట్టం!" అనుకుంది రావి.

ఎన్నో యిసయాలు ఆడికి తెలిసినట్టు ఎవురికి తెలవ్వు. పెద్దోల్ల నెందరోన్ని దగ్గిర్నించే సూశాడు. అందరితోటీ కలిసి ఆడుకూడా కలకటేరుగోరి కారుతో సేడంట! కద్దరు టోపీల్లో ళ్ళతో సానామందితో మాటాడోడంట. పట్నంలో రోజుకి ఎన్ని బయిస్కోపు లాడతాయో కూడా ఆడికి తెలుసు నంట. ఏ టాక్లు ఏ ఆట ఆడతన్నారో బొమ్మలు సూసి చెప్పగలడంట. ఆడు సయ్యంటే సాలు పట్నంలో పదిమంది పని యిస్తావన్నా రంట! కానెందుకో ఎల్లలేదు.

అబ్బో ఎంత గొప్పోడు తనవోడు!

మూడుపూట్లా వొణ్ణంపెట్టి సాలుకి రెండు కాయిళ్ళ గింజలిస్తా రాడికి. కావందు పొలంలో పండిన అంటిగెల్లు బండి మీదేసుకుని రాయివంద్రంలో బేరవిచ్చొచ్చేవోడు. ఆపని ఆడికి దరిజా అనిపించింది. తను కూడాబెట్టుకున్న సొమ్ముతో సవగ్గా ఊళ్లో అంటిగెల్లు కొని సొంతంగా కూడా ఏసుగెల్లే వోడు.

ఓపాలి పట్న వెల్లినప్పుడేం జరిగిందంటే—

ఓసోస్! ఆపాటి సంగతి కళ్ళగట్టినట్టు సెప్పలేదో?—

సలిది ముంత కట్టిచ్చి, పయిన కుసింత ఉప్పూ, ఫ్మార గాయి పచ్చడి యేసిచ్చింది రావి. రొండోజావుం రేతిరికి లెగిసి బండి కట్టాడు. ఆడి డ్రైరివింగేరోం తుపాను నేలుకంటే బేగి నడిసీది బండి!

సద్దికూడేలకి రాయవంద్రం సేరుకున్నాడు. ఎడ్లనిప్పి కాకి
కిందికి వోల్సి, కులాయికాడ కాళ్ళూ సేతులూ కడుక్కొని
ముంతిప్పుకుని కూకున్నాడు. ఒక్కముద్ద నోట్లో పెట్టుకున్నాడో
లేదో పోలీసాకడు యిట్టే వచ్చాడు.

"ఏరా! ఈ బండెవరిదిరా?"

"నాదేనండయ్యా!"

"అయితే నడు స్టేషనుకి."

"ఏ టేసనికి బాబూ?"

"పోలీసు స్టేషన్ కిరా"

"ఎందుకండయ్యా?"

"ఏవోఁ తెలీదేం? నేను చెప్పాల్రా?"

"మన్నించడయ్యా! ఇంకెప్పుడూ సెయ్యను. ఈ వూరికి
నేనుకొత్త !"

"అందుకని వళ్ళు పొగరెక్కి రోడ్డు కుడిప్రక్కన బండి
యిప్పుతావా ?"

"నాకు తెల్దు అయ్యా! ఇప్పుడే లెగదీసుకు పోతా !"

"ఎక్కడికి పోతావ్ ? ముందు స్టేషనుకి నడు !"

"నీ కాళ్ళట్టుకుంటానయ్యా ! ఈ యాల్టి కొదిలెయ్."

"ఆ వేషాలు నా దగ్గర పనికిరావు. గవర్నమెంటు
పనిలో మన్నిస్తే లాభం లేదు."

"ఒక నివసవేగందా అయ్యింది అయ్యా ! తెలీక సేసా
నంటున్నా. మన్నించండి !"

"అవేం కుదరవ్ ! స్టేషనుకి వచ్చి ముందు ఫైను
చెల్లించాలి. లేపోతే జైలు !"

"అయ్యా బాబో! జై లే! నాక్కాడుకుడితే నీపేరెట్టు కుంటానయ్యా! ఈ ఏల కూరకి వో అంటిగెలకూడా యిచ్చు కుంటాను. నన్నొదిలెయ్ బాబూ!"

పుచ్చుకుకోట్టి తన ముంత పక్కనుంచి వోసనసూత్తా పోడం ఎంకన్న సూశాడు.

ఎంత బతివాలుకున్నా ఆడు యిది త్తేగా!

అప్పు డాడికి మొండి దయిర్నె వేం వొచ్చింది.

ఈ డేసాలు 'నాకాడా?' అని అనుకున్నాడు.

స్పెట్టున్ని కాడి ఎ త్తేసి ఒక్క వూపులో బండిని రోడ్డు కేడంపక్కకి లాక్కొచ్చాడు. ఆపాటి బరువు ఆడికో లెక్కా!

మల్లా ఎల్లి ముంత కూడా తెచ్చుకున్నాడు.

పోలీసు కళ్లు సింతగ్గి అయినాయి.

"వరా! లెమ్మంటే నీకాదూ చెబుతూంట"

"ఎందుకు బాబూ?"

"స్టేషనుకి!"

మళ్ళీ రమ్మండంలో ఆడి వుద్దేసివేంటో? ఒక్క అంటి గెల సాల్దా? "అక్కడ నాకేం పని బాబూ? నువ్వెల్లిరా!"

"ఎంత పొగర్రా నీకు! వస్తావా రావా?"

"నా కీలు సిక్కదయ్యా! అయినా ఎందుకూ అంట? టూం?" కొరుక్కుతినేవోళ్ళా సూశాడాడు.

"బండి కుడివైపు యిప్పలేదుట్రా?"

"ఇప్పు డెడంపక్కే వుందిగా దొరా!"

బిక్క సచ్చాడాడు.

"ఇప్పుడే పోయి నిన్ను అరెస్టు చేయిస్తా నుండు!"

"ఓరబ్బ! ఎవడంట ఆ చేసీ మొనగోడు. ముందు తెలీక తప్పుసే త్తే మన్నించనంటావా? ఇప్పుడు సరిగా పెట్టినా కేసె నికి రమ్మంటావా? ఈ యేల తెల్లారేక నేను తప్ప నీ కింకె వుడూ దొరక లేదా పోలీసయ్యా?"

కోపం పట్టలేక ఆడు కర్రెత్త బోయాడు. కానీ, యీడి వొళ్ళూ, వొంపులు తిరిగిన కండలూ చూసి ఎనక్కి జంకాడు. ఈడు కాని తిరగబడితే, సరకారు కరుసుమీద నెల్లాళ్ళు ఆసప ట్లాల్లో వుండాలి సొస్తాంది!

ఆ అదును కనుపెట్టి యీడూ సొరవ చేశాడు.

"పోలీసు బాబూ! నువ్వూ మంచోడివే, నేనూ మంచోణ్ణే! ఒకల్ల జోలి కొకల్లు రాడం మంచిది కాదు.

ఈ బేడ్డబ్బులూ తీసుకుని వొటేల్లోకుతింత కాపీ తాగి ఎల్లు! ఏం?"

కిక్కురుమనకుండా తీసుకున్నా డాడు.

'కరిసీ కుక్కకి కడడ్డం!' అనుకున్నా డెంకన్న.

"మరి అంటిగెలో?"

"ఇత్తాలే. మల్లీ పాలొచ్చినప్పుడు నీకోసం మంచి అంటిగెల తెచ్చియిత్తాలే."

పోలీసు ఎల్లిపోయాడు. సుట్టూ వున్న వోళ్ళు యిరగ వడి నవ్వారు. ఆళ్ళలోంచే వోడొచ్చి తన బుజమ్మీద సెయ్యేసి, ఆ సొరవ చూసి మా మెచ్చుకున్నాడు.

"మెల్లింగా బతిమాల్తే యింటారా యీళ్లు? అందితే జుట్టు అందకపోతే కాళ్ళూ! నీలాంటోడి ఏలు కదపటానికి యీళ్ళ తాతయ్యలు దిగి రావాల."

ఒక్కొక్కళ్లే ఎల్లిపోయారు. "ఆడు మట్టుక్కి అక్కడే నిల బడ్డాడు. అంటిగెల్లన్నీ ఒక్క సూపుతో ఎంచుతా వున్నాడు.

ముంతలో కూడు మల్లా తినడానికి ఎంకన్న మనుసు పోయిందికాదు. 'పట్నవొచ్చి కూడా గెంజీ కూడూ తిండవేం కరవఁ?' అనుకున్నాడు.

ఒణ్ణవంతా గోడార వొంచేసి కులాయి కాడ ముంత కడుక్కున్నాడు.

"ఆడు అక్కడే వున్నాడింకా."

"ఏవూరు మన్సీ?"

"ఏం?"

"ఏం లేదు తమ్ముడో! వూరికే అడుగుతున్నా!"

"ఆలమూరు!"

"ఓరబ్బో! దూరమే! పేరేంటి?"

"నాదా?"

"ఊఁ!"

"ఎంకన్న."

"అంటిగెల్లు అమ్మకానికి తెచ్చావా?

"మరే."

"రేటెంత?"

"బజారు ధరబట్టి సూత్తా!"

"నా కియ్యరాదో?"

"కొంటావా?"

"కొనిపిస్తాను."

"లాబం?"

"పై వోళ్ళిచ్చి దానికి రొండబ్బులు ఎక్కువే ముట్ట సెబుతా. సరకు నాడించేసి రేటు కాయం సెయడంలో మన్ని మించినోడు యీ పట్నంలోనే లేడు. పెద్ద పెద్ద యాపారస్తులందరికీ బేరాలుసేసి పెట్టడం మనవేఁ! కొంతమంది దొంగెదవలు పల్లిటూళ్ళోళ్ళని మోసం చెయ్యాలని సూత్తారు. ఆళ్ళ కళ్ళల్లో పడ్డావో, నీ నోట్లో మన్నేసువాఁ!"

చూసీ చూడనట్లు ఆడిమాట లింటన్నోడల్లా, సూత్త న్నట్టే అదిరిపడ్డాడు. ఆ పోలకం సూడ్డంతో ఆడికీ దయిర్నె వొఁచ్చినాది.

"సూడు తమ్ముడో! నీ మొగం చూసి నిజం సెబుతన్నా. నువ్వు నా కిచ్చినా యియ్యా పోయినా నాకేం బాద లేదు. అయితే, అమ్మినప్పుడు మాత్రం నలుగుర్నీ వాకబుచేసి మరీ అమ్ము! సరుకంతా పోపాలే ఏసుకెల్లావో, లోకువాసేసి అయినకాడి కేసుగుంటారు. పట్నంవోళ్ళంటే నీకింకా అనబం లేనట్టే వున్నాది. ఏవంటా?"

ఆడి మాటలన్నీ ఎంకన్నకి నచ్చాయి.

పాపం, మంచోళ్ళాగే కనిపిస్తున్నాడు! తన ముక్కూ మొగవూఁ తెలీనోడు గందా, పట్నానికి సరుకేసుకొని యాపారానికి కొత్తగా తను వొచ్చినోడు గందా, యింత సనువుగా మాటాడి వుపకారం సేత్తానన్నవోడు దొరకడం తన అదురుట్టం కాదో! ఆణ్నే నమ్ముకుంటే, పెద్ద పెద్దోళ్ళందరికీ తను తెలుత్తాడు. బిగినీసూ పెరుగుతాది. లచ్చలకి లచ్చలు గడించొచ్చు. అప్పుడు రవణయ్యగాడికి తన్ని సూత్తే కళ్ళు కుడతాయి! తన కోసం దేవుడే యీణ్ణి పంపాడా?

"ముందు కాఫీ తాగొద్దారి! ఆనాక మాటాడు కుందాం" అన్నాడాడు.

"మరి బండో ?"

ఉరువుఁరివినట్టు నవ్వా డాడు.

"ఇంత ఎర్రోడి వేంటి తమ్ముడో! ఇంత పెద్ద పట్నంలో మన బండి చూసీవోడే కరువా ? కోయంటే కోటిమందొ త్తారు !"

మాటంటూండగానే ఆడి జతగాడెవరో ఎనక నించొచ్చాడు. బండి బద్రంగా సూత్తా వుండమని బద్రయ్య ఆడికి సెవులో చెప్పొచ్చాడు.

ఇద్దరూ కలీసి వొటేల్లోకెల్లారు. అక్కడ కాఫీ తాగే టోల్లందరికీ కురిసీ లేస్తారంట! ఇద్దరూ కూకున్నారు. రకరకా లేవో, తీపియీ, కారంయీ తెప్పించి యీడు వొద్దంటన్నా తిని పిచ్చాడాడు. ఎలపల కొచ్చి ముందు, గుమ్మం కాడున్న బల్ల ముందర కూకున్న వోలావుపాటోడి దగ్గరకెల్లి, యిద్దరూ కలిసి తిన్నదానికి డబ్బులన్నీ ఆడే యిచ్చేశాడు.

ఎంత మంచోడు !

తన జేబీలో సిల్లర డబ్బుల్లేనందుకు ఎంతో నొచ్చుకున్నాడు ఎంకన్న. ఎంత కరుసు అయిందో పాపం!

తన డబ్బులు తనిచ్చేస్తే ? అంత తెగింపున్న వోడు తన దగ్గిర పుచ్చుగుంటాడా ? అప్పుడు యీడికే సిన్నదనం కాదో ?

మల్లా బండికాడి కొచ్చేదాకా ఆడు బేరం యిసయమేం మాటాల్లేదు.

"మరి నేనెల్లొత్తా తమ్ముడో! కోనసీవఁనించి నాలుగు పడవల సరుకొత్తన్నాది. అర్జంటుగా ఎల్లి బేరవాఁడాలి. ఈలుంటే మల్లా కలుసుగుందార్లే!"

ఎంకన్న గుండె లోనకి దించుకుపోయినాది. ఆ డెల్లి పోతే తన యాపార వెల్లా! బేర్సారా లాట్టే తెలీనినోడాయె! సరుక్కి కరీదెల్లా కడతారో? బజార్లో సరుకంతా తనికి వోలాగే కనిపించినా దరలో తేడా ఎందుకుంటాది? ఒకడు ఓ రేటు పెడితే మిగిలినోళ్లు యింకో దమ్మిడీ కూడా ఎక్కువ పెట్టరేం? పాతోళ్ళయితే బేరం సెయ్యకుండానే సరు కెల్లా కొంటారో? కొంతమంది యెంటనే డబ్బియ్యరంట. సరుకు అమ్ముడయ్యాక తవఁరి లాభాలు తీసుకుని మద్దెలో పనిచేసే టోళ్ళకి ముడుపు సెల్లించి మిగిలింది యీలున్నప్పుడు యిత్తారంట!

యాపారవంటే రావుఁలమ్మకాడ కవుర్లు సెపినట్టా మరి? బిగినీసు చేసేవోళ్ళ బుర్రలే ఏరంట! ఆళ్ళు మాటాడినాటికి లచ్చ అరదా లుంటాయంట. మనం మాటాడిన దాని కూ్కుడా లచ్చ అరదాలూ తీత్తారంట! మరి యాపారవంటే అల్లాటప్పా యవ్వారవాఁ?

పట్నవోళ్ళు అసలే మాయలోళ్ళు! ఇప్పుడాణ్ణి ఒదులు కుంటే లాభం లేదనుకున్నాడు ఎంకన్న.

"ఎడుదూగాన్లే అన్నా! అంత తొందరేంటి? బండికాడ కూకుని కాసేపు కవుర్లు సెప్పుకుందారి. సుట్ట కాలుత్తావా? మొదటి రకం లంక పొగాకు!"

"సుట్టా?"

ఆ మాటలో యిద్దూర వున్నాది, ఈసడింపూ వున్నాది. సిత్రమయిన మందలింపూ, కుసింత జాలీ, మరింత ఎక్కిరింపూ!

"ఏం సుట్ట కాల్చవా ?"

"ఊహు ! సిగారొట్లు కాలుత్తా !"

ఆడు బీడీలైతే ఎరుగును. రొండు మూడు తడవలు కాలిసీ సూశాడు.

సిగారొట్లు రుసి చూల్లేదు. దగ్గొస్తాదని బయం ! అయి దొరలే కాలుత్తారంట. మనందేశపోళ్ళ వొంటికి పడవంట !

అసలు పొగ తాగడవేఁ పెద్ద జబ్బని బాలయ్యగార సీవోరు. సుట్టముక్క కొనుక్కోవాలంటే డబ్బులిచ్చేవోరుకారు. పకోడీలకోసవంటే పావలా యిచ్చీవోరు !

సిగారొట్లు కరీదెంతుంటాదో ? కలకటేరుగోరు కాలిసీ ఓటి రకం ఒకోటి ముప్పావలా అంట ! అలాగని తన సిన బామ్మరిది సెప్పాడు.

పుట్టి బుద్దెరిగాక సిగారొట్లు ఎరక్కపోతే తనకే సిన్న దనం ! పైగా పట్నవుంలో యాపారం సెయ్యబోతున్నవోడు !

జేబీలోంచి సిల్లర కాన్లుతీసి చూసుకొని కిల్లీకొట్టుకాడికి నడిశాడు.

సిగారొట్లు రొండు కొనేసేసి, ఆడికోటిచ్చి తనోటి అంటించుగున్నాడు.

మా మజాగా వున్నాది !

తెల్లోడి మాయ !

ఆడిలా సెక్రాలు యిద్దుం తనకి సేతకాదు! సుట్ట కాలిసీవోడికి ఆ సిత్రాలేం తెలుసు ?

ఏవయినా ఆడు తనకంటె నిజంగా సాలా గొప్పోడు! ఆణ్ణి పట్టుకునే పని సేయించుకోవాలి!

"అయితే వూళ్లో రేటు ఎల్లాగున్నాదన్నా ?"

"బండి ఏబయి రూపాయలు."

"ఉరవ పెడ్దయితే ?"

"ఇంకో రూపాయెక్కువ."

"మరి అందులో మనకి లాబవేంటంట ?"

అనువాఁనిస్తానే అడిగాడు.

అది యిని ఆడూ నవ్వాడు. ఆ నవ్వు ఎంకన్న కి తెలీలేదు.

పట్నంలో అల్లా గడక్కోడదేవోఁ?

నోరు జారేశాడు. నాలిక్కొరుక్కున్నాడు.

మాట మారిశాడు.

"ఇన్ని సెప్పావుకానీ, నీ పేరు సెప్పలేదు అన్నా !"

"బద్రయ్య."

"బద్రయ్యన్నా ! నా బండి బేరం నీకే కాయం !"

బద్రయ్య ఉలిక్కిపళ్లేదు. ఆడి కళ్ళల్లో మట్టుక్కొత్త ఎలుగొచ్చినాది. బుర్రలో ఏవాఁలోసన దొల్లిందో ఏవోఁ, సటుక్కుని సిటికేశాడు. మీసం తడుంకుని గట్టిగా దమ్ము లాగాడు. ఎంకన్న యీపు తట్టి సొగసుగా నవ్వాడు.

"నవ్వింత మంచోడి వనుకోలేదు తమ్ముడా !"

అప్పుడప్పుడు మొగోడి కూడా సిగ్గేస్తాదని ఎంకన్నకి అప్పుడే తెలిసొచ్చింది.

ఆడంత గొప్పోడు తన సరస కూసోడవేఁ గొప్ప! కూసుని మరియాదగా మాటాడ్డం మరీ గొప్ప !

ఎంకన్నకి ఏనుగ బలం వొచ్చినాది.

ఇంత ఉపకారం చేసివోడికి ఏం ముట్ట సెప్పాపోతే ఏం బాగుంటాది? సల్లకొచ్చి ముంత దాసడ వెందుకో?

"బద్రయ్యా! నేను పట్న వొచ్చినప్పుడల్లా మంచి బేరాలు సూజెట్టావంటే, బండికి పదేసి రూపాయలు బగుమతీ యిత్తా నీకు!"

మాంచి తెలివయినోడిలాగే అన్నాననుకున్నాడు ఎంకన్న. సూటిగా యీడి కళ్ళల్లోకి చూసి మల్లా యీపు సరి వాడు బద్రయ్య. దాంటో అర్దవేంటో?

"యేపారాల్లో తిరిగీవోడికి బగుమతీ ఎందుకు ఎంకన్నా? నీకూ నాకూ మనుసులు కలిసినాయి గందా, నీ దగ్గర నేను డబ్బుచ్చుగుంటానా? కమీసని త్తేసాలు!"

"కమీసనా?"

ఆ మాట యినడం అదే మొదలు.

"అంటే?"

"అదీ వోరకం బగుమతీ యేలే! కొనీవోడికీ, అమ్మీ వోడికీ నడాన పనిచేసి పెట్టినోడికి ముట్టసెప్పేదన్నమాట!"

"ఎంతీమంటావ్?"

"నీ సిత్తం! దానికూడా నీకాడ బేరవా?"

"ఆ కమీస నెల్లా యిస్తారో నాకు తెల్దు! నువ్వే సెప్పు బద్రయ్యా!"

"సెప్పమంటా? కొత్తోడివి కనక నీకాడ వొద్దే తీసుకోడం నాయం కాదు. ఏదోకాడికి నువ్వే తోసిన అంకి సెప్పు!"

"పరాలేదు, చెప్పు బద్రయ్యా ?

"బండికి పదేనిస్తావా ?"

"ఓసోస్!" అనుకున్నాడు ఎంకన్న. "సయ్యేనీ" అన్నాడు!

బద్రయ్య మల్లా జేబిలోంచి యింకో సిగారొట్టు తీసి గబుక్కుని అంటించాడు. ఎంకన్నకీ వోటిచ్చాడు. ఒద్దంటూనే తీసుకున్నాడు.

బద్రయ్య దేవుడే!

"మావోణ్ణి నీ కూడా పంపిచ్చి యవ్వారం పైసలు సేయిత్తా!" అంటూనే ఆడి మనిసేపు ఏలు సాపాడు. అప్పటి డాకా కులాయి గట్టుకాడ నిలుసుని దమ్ము లాగుతావున్న వో సెరబయ్యగాడు, సేతిలో బీడీపీకి యిసిరి పారేసి బద్రయ్యకి ఎదురుంగా నిలబడ్డాడు.

బలమైనవోడే! బద్రయ్య ఎంత సెబితే అంత! మరి దొరోడి దరిజా కాదో ?

"సెరబా! ఎంకన్న కూడా పెద్ద బజారుకెళ్లి, ఈరా సావీకి నా పేరు సెప్పి యీ బండిమీదున్న సరకు లోన వయించుకోవఁను. యీబయికీ పదేను తగ్గించి మిగిలిన రొక్కం తమ్ముడికి కిప్పించెయ్! తెలిసిందా ? ఎంకన్న సాలా మంచోడు! దార్లో యిద్దరూ సింగిలి టీ తాగండి. ఇంక నే నెల్లొత్తా! డబ్బులియ్యనా ఎంకన్నా ?"

"అదేంటి బద్రయ్యా ? ఆపాటి నేనియ్యలేనా ?"

ఆడు నవ్వాడు. కడుపులోంచి నవ్వాడు. బుజా లెగరేశాడు. ఎల్లిపోతా అన్నాడు—

"ఇంకా వుంటావా ?"

"ఈ ఏల్టికుంటాను. ఎప్లో ముందు నిన్ను కలుసు కుంటాలే!"

"ఎక్కడా ?"

ఔను మరి! ఎక్కడా ?

మాటొరస కనేశాడు. కలుసుకోవాలనీ ఉన్నాది!

బద్రయ్య నవ్వాడు.

"గోదారొడ్డు పడవల రేవుకాడ సీతాలచ్చిం వోటే లున్నది. ఆ వోటేలు మందేలే! నీపనయి పోగానే అక్కడికి కొచ్చెయ్యి. మరెల్లొత్తా!"

ఆడు కనుసూపుమేర దాటీదాకా ఎంకన్న అలా సూత్తానే నిలుసున్నాడు. బద్రయ్య ఎల్లిపోయాడు.

పక్కనున్న సెరబయ్య అదోరకంగా నవ్వాడు. ఏంటో తెలీక ఎర్రిగా చూశాడు ఎంకన్న.

"ఆలిస్సెవెందుకూ బెదరూ! బండి లెగెత్తొ, బేగే పోదారి."

మల్లా బీడీ ముట్టించి సోగ్గా నిలబడ్డాడు సెరబయ్య. ఎంకన్న అరిసేతులు పాంకుని కాడెత్తి ఎడ్లని కట్టాడు. సెక్రం మీద కాళ్ళు ఆనిసి సెరబయ్య బండెక్కాడు. కాడిలో గడ్డి సరుదుకొని ఎంకన్న కూడా కూకుని ఎలపటెద్దుని మలేశాడు. బండి యిసయిసా నడిసిపోయింది.

బజార్లో బేరం అయిపోయాక, కాపీ తాగుదారన్నాడు సెరబయ్య. ఇద్దరూ వో వోటేల్లోకి దూరారు.

ఆయే లసలు వొణ్ణం తినలేదేవోం మరీ, పీకిలు ముయ్యా యిడ్డెన్లు తెప్పించుకు తిన్నాడు సెరబయ్య. తినేసి గల్లా బల్ల

దగ్గరి కొచ్చేదాకా ఆడెంత తిన్నదీ ఎంకన్నకి తెలే లేదు.

"అంత ఉపకారం సేసినోడు ఆమాత్రం తింటే మట్టు క్కేలే !" అని సరిపెట్టుకున్నాడు.

రొండు మిఠాయి కిల్లీలూ, రొండు అనాకానీ సిగ రెట్లూ ఆడే దుకానం నోడిని అడిగి పుచ్చుకున్నాడు. ఎంక న్నని డబ్బు లీమన్నాడు. ఆడి మొగం కేసి సూత్తానే యిచ్చాడు ఎంకన్న.

దమ్ము లాగుతా అన్నాడు సెరబయ్య—"నే నెల్లొత్తా బెదరూ! మరి నువ్వెక్కడికె ల్తావ్ ?"

"బద్రయ్య కాడికి."

"ఇక్కడ యీరాస్సామితో కొంచెం మాట్లాడే పను న్నాదీ. నువ్వెల్లిరా !"

సెరబయ్య బుజా లూపుకుంటూ ఎల్లిపోయాడు.

మళ్ళి ఎంకన్న కేసి తిరిగి సూణ్ణే లేదు. జేబు బద్రంగా తడుంకుని ఎంకన్న ఎనక్కి నడిశాడు.

*　　　*　　　*

ఇంటికి తిరిగొచ్చేతలికి బాగా పొద్దోయినాది.

ఆడూ గుమ్మంలో అడుగు పెట్టాడో లేదో, సివాల్నొచ్చి రావులమ్మ ఆణ్ణి సుట్టేసింది.

"పట్నంనించి నాకేంటి తెచ్చావ్ ?"

ఈరుడిలా నవ్వాడాడు. తన గొప్పతన మిప్పుడు తెలి సింది దానికి. పల్లిటూర్లో కూకుని మట్టి పిసుక్కునీ రకమను కున్నాది. హేఁ !

పట్నంలో ఎంతమంది గొప్పోళ్ళతో మాటాడేడనీ! ఎంత మర్యాద చేసేరనీ! ఆడి తెలివి ఏం మెచ్చుకున్నారనీ! ఇయన్నీ రావుఁ లమ్మకేం తెలుత్తాయంట?

ఇన్నేళ్లూ, పుట్టి పేడకడిలో కొంకి పురుగులా బతికాడు. పట్న వెల్లాక తన అదురుట్టవుఁ ఎంత యిదిగా మారిపోయిందో రావుఁలమ్మకేం తెలుసూ? ఎఱ్ఱి మొగం!

దాన్ని దిలించుకునీతలికి ఆడి తాతలు దిగొచ్చారు.

"అంత తొందరేటే? సందేలయింది గందా, కుతంత వాళ్ళు తడుపుకుని ముత్తాబు చేసుకో మరి!"

"నాకేంటి తెచ్చావో సెప్పు మరి!"

"ఇప్పుడే సెప్పేత్తే మజా ఏం ఉంటాదే ఎఱ్ఱిదానా? కూడు తిన్నాక నువ్వే కట్టుగుందూగాని!"

"ఏంటది? సీరా?"

"మరి?"

"నువ్వెంతో—మంచోడివి! సుక్కలసీరా, పువ్వులరయికేనా?"

"సూత్తావు గదంటే!"

"యీల్లేదు! ఇప్పుడే సూపించాలి. లేపోతే నీకు కూడెట్టను. అసలు నీతో వూసే ఆణ్ను!"

"ఓసోస్! కోపవొచ్చినా కూడా నువ్వు శానా అందంగా ఉంటావే రావేఁ!"

"ముందు సూపిచ్చు!"

ఆడు యియ్యలేదు.

సటుక్కుని ఆడిసేతిలో సంచీ లాక్కున్నాది. సీర ఎలప లికి తీసింది.

"ఏంటిదీ ?"

"సీర !"

"స్సీ ! ఇదేం సీరా ?"

"కొత్త పేసను సీరే ఇదీ ! పల్లిటూరు దానివి నీకేం తెలుసులే !"

"ఆడంగులు కట్టుగుంటానికే ?"

"మరి మొగోళ్ళు కట్టుగుంటారేంటే ఎర్రి మొగవాఁ?"

"వళ్ళంతా ఎలపలికి కనుపించదో ?"

"ఓసి రావుఁలమ్మో ! దీన్నే నైలాను సీరంటారు."

"నైలానా ?"

"అవునే ! ఎప్పుడూ యినలేదో ? పట్నవుఁలో ఆడో ళ్ళంతా యివ్యే కట్టుగుంటారు."

"స్సీ ! సిగ్గుమాలినోళ్ళు !"

"పెద్దింటి ఆడకూతుళ్లూ, సదూకున్న వోళ్ళూ అందరికీ యిదే పేసను. ఈ మద్దీ కాలవుఁలో యిలాంటి సరుకు రానే లేదంట !"

ఆఁడెంత నచ్చసెప్పినా దాని బుర్ర కెక్కలేదు. పెది విఁరిసినాది. సీదరించుకునీ చూసింది. ఆడిమనస్సు చివుక్కు మన్నాది.

"ఎంతెట్టి కొన్నావు ?"

"ఎంతయితే నీకెందుకో ? ముచ్చటగా తెచ్చిత్తే కట్టు గోవాలంతే !"

"నాకొద్దు బాబో! వోళ్లంతా సూబించుకునీ సీరలు కట్టుకోడం కన్నా, మామూలు పందలపాక సీర్లే మెరుగు!"

ఆడికి చాలా కట్టం కలిగినాది. అంత మనసుపడి పట్నం నించి దీనికోసం తెత్తే గడ్డిపోసలా తీసిపాకేసింది! గొప్పోళ్ళంతా కట్టుగుంటా ఉన్నప్పుడు దీని కేం వచ్చిదంటా? ఈపాటి సిగ్గు అళ్ళకి మట్టుక్కి లేదో?

అయినా దీని కిలాంటి సీరేంటని? అంత డబ్బు కరుసేసి నందుకు లోన ఎంతో నొచ్చుకున్నాడు. మొదాటిసారిగా పట్న వెల్లి యిలవైన సీర తెచ్చి కట్టుగోవంటే దీని కేం పోయి కాలవోం? తక్కినోళ్ళ పెళ్లాలు యిల్లాగే సేత్తన్నారా? బద్రయ్య పెళ్ళావే అయితే యిల్లా మాటాడత్తాదా?

ఆడి వుసారు సచ్చిపోయింది. కోరికి కరిగి పోయింది! ఆడి మనస్సంతా ఆయిరే అయిపోయింది!

"స్సీ! కట్టుకున్న పెళ్ళాలికి ఎంత చేసినా యిసివోస వుండదు!"

ఆ రేతిరంతా ఆడి గుండి సలసలా కాగింది.

## 4

జగ్గన్నా, సూరీ మేనత్త మేనమావ బిడ్డలు.

సూరమ్మ పుట్టిన్నాడే ఆళ్ళిద్దరికీ పెళ్ళి కాయవయి పోయింది.

రాజియ్య జగ్గన్న సొంత తమ్ముడు. సిన్నప్పన్నించీ ఆలమూళ్ళో మేనమాం దగ్గరే పెరిగాడు. ఏడాది కోపాలి పెద్ద పండక్కని గోదారి దాటి అమ్మనీ, అన్ననీ సూడ్డానికి కొత్త పేళ్లో

వోడు. ఇంటి కెల్లడవంటే ఆడికి సుట్టం సూపుకిందే లెక్క! ఆలమూరే ఆడికి సొంతూరయిపోయింది.

సిన్నతనవుఁ నించీ సూరమ్మ ఆడిజట్టే! ఇద్దరూ కలిసి వూరంతా కలీ తిరిగేవోళ్ళు. దివానంలో కెల్లి దొంగతనంగా మాయిడికాయిలు కోసుకుతినీవోళ్ళు. గరువు సెరువుకెల్లి కడుపు నిండానీళ్లు తాగేవోళ్ళు. ఆడికి యిరేసినాలెల్లి పేనంమీదకొత్తే, అది రావుఁలమ్మోరి గుడికెల్లి దణ్ణాలెట్టేది. మల్లా సయవఁయి పోగానే, ఇద్దరూ కలిసి నాగులు సెరువు కాడికెల్లి నిదరగన్నేరు సెట్టెక్కి కూకునీవోరు. సుబ్బరమన్నేసుడి గుళ్లో గంట యిని పిత్తేసాలు, చెంగుమంటూ లగెత్తుకెల్లి పెసాదం తెచ్చుకు పంచుకునీవోరు. అది సెల్లో కలగపువ్వుకోసం మనుసుపడితే, ఆడు ములుగీత నెల్లి తెచ్చీవోడు. కాడలు చిన్నగా సిదిపి దండకట్టి దాని మెళ్లో ఏసీవోడు. పావుఁలోళ్లా ఆడు నాగస్సరం పాడితే, అది పడగిప్పిన తాసులా ఆడిపోయీది.

రాజియ్యా, సూరమ్మా పేనం పేనం కలిసిపోయి నిదర గన్నేరు సెట్లనీడల్లో నిదరొయ్యేవోరు!

సూరమ్మకి పెదబావతో పెళ్ళయింది. దాంతో కలిసి రాజియ్య కూడా కొత్తపేటొచ్చేశాడు. అన్నయ్య మాటంటే గురే ఆడికి. మొగుడంటే అదులే దానికి!

ఎనకటి సూరిని మరిసేపోయేడాడు. రాజియ్య యిప్పుడు మరిదయ్యాడు దానికి!

దివానంలో మాయిడికాయిలూ, గరువుసెర్లో తియ్యటి నీళ్లూ, నాగుల సెరువుకాడ సుబ్బరమన్నేసుడిగుడీ, మూలపొలం

కాడ గడ్డిమేట్లూ, వూరవతల కాలవా—అయ్యన్నీ యిడి సేసి యిద్దరి కిద్దరూ కొత్త లోకంలో అడుగెట్టారు.

సూరమ్మ కిప్పుడు యిద్దరు పిల్లలు. ఆళ్ళని తెగ ముద్దు సేసీవోడు రాజియ్య. ఆళ్ళకి ఆడికాడే సనువెక్కువ.

జగ్గన్నది మా బారీ వొళ్లు! కత్తిసావూం, కర్రసావూం సేసి కొత్తపేట మొత్తానికే గుండిలు తీసిన బంటనిపించు గున్నాడు.

దేసెవ్వంలో యుద్ధం బయమెక్కువయినాది. బలవంయి నోళ్ళందరినీ మిలిట్రీలోకి తీసుగుంటా వున్నారు.

జగ్గన్నకి దయిర్నెం పలును సెయ్యడవంటే మా చెడ్డ సరదా! ఆడూ ఎల్లి పేరేయించుగున్నాడు. నెల్లాళ్ళ తిరక్కం డానే సేరిపోమన్నారు.

పెరిసియా, యీజిట్టూ, జపానూ—సవుంద్రం మీద శానా దేశాలు తిప్పారీణ్ణి! సదుగంటే తక్కువేంగాని, బుర్రలో సురుక్కి లోటులేదు. బాసంటే కట్టవుంకాని, పనికి లోపంలేదు. తెల్లోళ్ళు చూసి యీణ్ణి మా మెచ్చుకునీవోరు.

యుద్ధం వుసారులో ఆడు సూరమ్మనీ, యింటినీ, పిల్లల్నీ, కొత్తపేటనీ—అన్నీ మరిసిపోయాడు.

ఎన్నేళ్ళకీ ఆడి వూసు చెవిని పడాపోడంతో సూరమ్మ గుండిల్లో గుండురాళ్లు పడ్డాయి.

ఆడు ఏనాటికేనా తిరిగొత్తాడా ?

తన పసుపూ, కుంకం నిలబడతాయా ?

సిట్టీ, సివయ్యా తండిలేనోళ్ళు కారుగందా !

ఏనాటి కానాడే ఉత్తరం ముక్క వొస్తాదేపోనని కళ్లు కాయిలు కాస్సేట్టు సూడ్డవూం సీర సెంగుతో కల్లొత్తుగుంటా కూకోడవూం !

ఎదవ బతుకు !

ఏళ్ళకేళ్ళు దొర్లిపోతున్నాయి.

పిల్లలు పెద్దోళ్ళయి, నాయినేడని అడిగితే ?

తన పాడునోటంట ఏం చెప్పాలిసొత్తాదో ?

పేనం వుసూరుమనిపించింది సూరమ్మకి.

ఒదిన వోలకంసూత్తే రాజియ్య మనసు చివుక్కు మన్నాది.

ఉన్నాడో సచ్చాడో ఉత్తరముక్కైనా రాయిడేపోం ? పెళ్ళావూ పిల్లలూ బతికున్నన్నాళ్లూ ఆడి ఎదాన పడి ఏడవ్వాలిసిందేనా ?

అలాంటోడు పెళ్ళి చేసుకునెందుకు సావాలో ?

ఓనాడు యీాదరుగు కొసాని కూసుని సుట్ట కాల్చుగుంటావుంటే, సత్తెయగా డొచ్చి అన్నాడు గందా—

"యుద్దవుంలో బాంబులు పడి సానామంది సచ్చిపోతన్నారంట కదో ? పాపం జగ్గన్న ఎలా వున్నాడో ?"

దాంతో ఆడుకోపం పట్టలేకపోయ్నాడు.

"ఛో ! ఎదవా ! సావు కవుర్లు సెప్పడం తప్ప నీకేం పని లేదో ? మల్లా మా అన్న వూసెత్తావంటే యీాపు సిట్లగొడతా !"

అప్పటికి సత్తెయ్యగాడి వొళ్లు దగ్గిరకొచ్చింది. వెంటనే ఎనక్కి మల్లి ఎల్లిపోయాడు.

సుట్ట ఆరిపోయిందని అగ్గిపెట్టెకోసరం లోపలి కెడతా వుంటే మూలగదిలోంచి వాదిని ఏడుపు యినిపించినాది.

దరి కెళ్లాడు.

"రాజియ్యా! రాజియ్యా!! ఆ డెప్పుడొత్తాడో సెప్పవా రాజియ్యా? నా పిల్లలికి అయ్య ఎప్పుడు కనిపిత్తాడు? యీాదులోవోళ్ళ మాటలు నేను యిన్లేపోతున్నా. యింట్లో బాదలు మొయిలేపోతున్నా! నాలాటి సెనిగొట్టు దానికి సావు తప్ప ఏరే దారిలేదు. రాజియ్యా! నే నెల్లాగా సచ్చిపోతా! ఈళ్ళు నీ పిల్లలే అనుకుని చూసుగుంటావా? నీ వాదిని కోరిక సెల్లిత్తావా? సెప్పు రాజియ్యా! సెప్పు"

రాజియ్య కళ్ళల్లో నీళ్లు తిరిగాయి.

పెదాలు ఎనక్కి నొక్కిపట్టినా బాద నిలవలేదు.

"నా సిగురి కోరికి తీరసవా రాజియ్యా? ఇద్దరం సిన్నప్పన్నించీ కలిసి తిరిగినోళ్ళం మనం. ఒకరిమాట వొకరం యింటూ వుండీవోళ్ళం! ఇప్పుడు కూడా అలాగే యింటావా రాజియ్యా? నే సచ్చిపోయాక నా బిడ్డల కింత గెంజిపోత్తావా? సెప్పవూ?"

ఆడి నోటంట మాటే రాలేదు.

"ఇట్టవుంలేదా? సెప్పు రాజియ్యా! బలవొంతంగా యీాళ్ళని నీ నెత్తిమీాద పెట్టడం నేనూ వొప్పుకోను. అందర్నీ కాపాడీతల్లి ఆ గోదారమ్మ వున్నాది రాజియ్యా! ఆళ్ళ నా యమ్మ కప్పసెప్పి నేనూ సచ్చిపోతా. ఈ బూామ్మీాద నూకల్లేనోళ్ళందరికీ ఆ తల్లే దిక్కు!"

ఆ ఏడికి కయింలిపోయి నేలమీాదే వొరిగినాది సూరమ్మ. పిల్లా, బుల్లోడూ గొల్లుమన్నారు. అమ్మని సుట్టేసుకుని ఎక్కెక్కి ఏడిశారు.

ఎంటనే సన్నీళ్ళు తెచ్చి మొకంమీద సల్లి గుడ్డ ముక్కోటి తడిపి నుదురు మీదేసాడు రాజియ్య.

కొంచెం సేపటికి సూరమ్మ కళ్లు యిడినాయి. ఇడినట్టే తడిసినాయి.

"నన్నెందుకు బతికించావు రాజియ్యా? నాకు సావడాని క్కూడా యోగ్లేదా? ఈ బాదలన్నీ మోస్తా నన్నిల్లా ఎంత కాలం బతకమంటావు రాజియ్యా?"

ఎక్కెక్కి ఏడిసినాది.

"నేనుండగా నీకేం బయంలేదు సూరీ! ఏడవకు. నువ్వు సచ్చిపోడాని కీల్లేదు. నీ పిల్లల కోసవే బతకాలి! యుద్ధ వింకా కడతేరలేదు. ఆడు మట్టుక్కి ఎలా రాగల్డో చెప్పు! ఇన్నేళ్లు వోపికిపట్టావు. ఇంకొంత కాల వుండలేవూ? నామాటినవా సూరీ! లేసి మొకంకడుక్కోవూ?"

ఆ డెంతో బతివలాడగా సిగురికి సూరమ్మ కుదట బడ్డాది. గుండి సిక్కబట్టుకుని లెగిసి నిలబడింది.

మల్లా కొన్నేల్లు గడిశాయి. యుద్దం మంటలు సల్లారి పోయాయి. మనదేసం నించి ఎల్లినోళ్ళంతా ఎనక్కి తిరిగొచ్చేశారు.

జగ్గన్న అయిపూ, మచ్చా లేడు!

రాజియ్యకి ఏదో అనువానం కలిగింది.

సూరమ్మకి బయం ముంచెత్తింది. ఆడింక తిరిగి రాడా? తన కళ్ళ కింక కసిపించడా? ఆడు కూడా యుద్దంలో మాడి పోయాడా?

ఓ నాడు సందేల సూరమ్మ రాజియ్యని పిలిసింది.

"ఉత్తరమ్మొక్కా రాలేదా ?"

"ఒత్తే దాసుకుంటానా ?" కొంచెం ఇసురుగానే అన్నాడాడు.

దాని గుండె సివుక్కు మన్నాది.

ఇన్నాళ్ళనుంచి కనిపెట్టి కూసున్న పెళ్ళాన్నీ, పిల్లల్నీ మరిసిపోయి, వూరూ వాడా యిడిసేసి మనుసుపడి వల్లకాడికి పోయిన వోడికోసం ఎంతకాల వేడిఁత్తే మట్టుక్కి తిరిగొత్తాడూ? దాన్నెంత వుసూరు పెట్టాడు ? ఆణ్ణి ఏంచేస్తే పాపవున్నాదంట ?

"సూరీ ! యిప్పుడే సెబుతన్నాను. ఆడింక తిరిగి రాడు. ఇంక నీ వాసాదులుకో ! సచ్చినోళ్ళలో జవనుకో, ఆడికి పెద్ద దినం చేసేవనుకో ?

ఇనలేక పోయిందది. ఏడుపు గట్లు దాటిపోయింది. పౌరుసం ఉబుక్కొచ్చింది. సరసరా నడిసి లోన కెళ్ళిపోయింది.

మసక సీకటి పాకుతా ఉంటే—ఆ సీకట్లో దిమ్మొమంటూ ఏదో సప్పుడయితే, దొడ్డో కర్రి ఆవుదూడ "అంబా" అంటూ అరిసినాది.

సెంగు నిలగెత్తి రాజియ్య వొచ్చీతలికి నూతులోంచి బుడబుడా సప్పు డినిపించినాది. గుండె తపతప లాడిపోయింది.

రావఁయ్యా, పేరయ్యా దీపాల్తో లెగిసొచ్చారు.

సూరమ్మ కడుపులో నిలిసిన నీళ్ళు ఎల్లగక్కి ఊపిరిచ్చారు. సుక్కమ్మ వచ్చి సీర మారిసింది. దాన్ని తీసికెళ్ళి వసారాలో మంచంమీద పడుకోబెట్టారు.

ఒకొక్కరే సల్లగా జారుకున్నారు.

సూరమ్మ కళ్ళిప్పి సూసింది.

సుట్టూతా కలీ సూసింది. అదంతా దానికో కొత్త లోకంలా కనిపించినాది.

రెప్పలోల్సకుండా రాజియ్య సూత్తానే ఉన్నాడు. పిల్లలిద్దరూ రాల్లయిపోయారు.

"ఎవరు నువ్వు?"

రాజియ్య బిక్కసచ్చిపోయాడు "రాజియ్యనే!"

"ఈల్లెవరూ?"

"నీ పిల్లలే సూరీ!"

ఆళ్ళని దగ్గిరికి తీసుకుంది. ముద్దులాడింది.

ఆడినట్టే ఆడి మళ్లా మొకం తిప్పుకున్నాది.

ఏడుపొచ్చినంత పనయింది రాజియ్యకి.

ఆణ్ణి దగ్గిరకి రమ్మన్నాది. ఎల్లాడు. ఇంకా రమ్మన్నాది. ఎల్లాడు.

"నువ్వు చాలా మంచోడివి రాజియ్యా!

ఆడు మాటాళ్లేదు.

రోజులు దొర్లిపోతున్నాయి. అప్పన్నించీ దానొంటో నసిలేదు. కనిపించిన సరకల్లా బేరం సేసీది. మోజులూ, మనుసులూ ఎక్కువయినాయి. ఒకోప్పుడు సేతిలో ఉన్నయే సమ్రుని యిసిరేత్తాది. ఏవంటే మాటాడదు. ఉత్తిపున్నాన్ని నవ్వుతాది. సిటికిలో ఏడుత్తాది. ఆలాటిదాన్ని ఏవంనగల్డు రాజియ్య?

ఓడపిల్లి తీరతానికి రాజియ్యతో సెప్పకుండానే ఎల్లింది. పిల్లల్ని తీసుకు ఎల్లింది.

ఇంటి కొచ్చాక అడిగాడు—"సిట్టి ఏదే?" "ఏవో!"

ఆడు గుండి బాదుకున్నాడు. ఎంటనే ఎల్లి ఓడపిల్లి అంతా కలీ చూశాడు.

సిట్టికీ మాకూ సెల్లుబడి అయిపోయిందనుకున్నాడు.

ఇంకా రోజులు నడిశాయి. రాజియ్య కొత్తపేట నించి మకా వెత్తేశాడు

అయిదేళ్ళయ్యాక—

జగ్గన్న వూళ్ళో కొచ్చాడు. పేనాలు పోవలసినోడు కాలిరగ్గొట్టుకొని బయటపడ్డాడు. మిలిట్రీ ఆసపటాల్లో చాల కాల వున్నాడు. కఱ్ఱ కాలెట్టించుగున్నాడు. చేతులో పయిస లేకుండా దేసెం మీద పడ్డాడు.

కఱ్ఱకాలూ, సంకలో కఱ్ఱలూ, మాసిన గెడ్డవూ, ఊళ్ళో ఎవరూ ఆనవాలే కట్టలేదు.

అప్పటికీ ఇప్పటికీ వూరు బాగా మారిపోయింది.

ఎనక తనుండీ యీదికెల్లి కోవటి యీఱ్ఱాజు దుకానం కాడ నిలుసున్నాడు. ఓ అరిగిన కానీ యీడి సేతిలో ఏశాడా కోవటి!

ఈఱ్ఱాజింటికి పక్కయిల్లే తనది!

"ఈ యింటో ఎవరుంటున్నారు బాబూ?

"ఇస్కూలు మేస్టారు!"

"సొంతవేనాండి?"

"అద్దికిచ్చారు. జగ్గన్న గాడనీ వో వస్తాదుండీవోడులే! అసలు ఆడిదీ యీ యిల్లు. ఆడు యుద్దంలో కెల్లిపోయా కూడా ఆడి తమ్ముడూ, పెళ్ళావూ, యిద్దరు పిల్లలూ ఉండి

వోరు. పాపం ఆయమ్మ ఎంతో కాలం మొగుడికోసం పడిగాపు లడి కూకుంది. సిగురికి ఆడు సచ్చిపోయాడని తెలిసింది. రాజియ్యా, సూరమ్మా, కొడుకూ ఈ వూరినుంచి ఎల్లి పోయారు."

"ఇద్దరు పిల్లలన్నావు కదా బాబూ ?"

"ఇద్దరే! దాని కూతురు ఓడపిల్లి తీరతంలో మూరి పోయింది. మల్లా దొరకలేదు.!'

జగ్గన్న బిక్క సచ్చిపోయాడు! మొకం వోనికిపోయింది. నరాలు జివజివలాడినాయి. కాళ్ళు దడదల్లాడాయి. గుండి గొల్లున ఏడిసింది.

కోవంటిలా అలా చూస్తానే ఉన్నాడు. జగ్గన్న గుండి నిబ్బరించుగున్నాడు.

"అయితే ఏ వూరెల్లారో ?"

"అద్దర్ని, ఓ వొడ్డి యాపారగాడి కాడ జీతానికున్నాడు. ఆళ్ళ కిప్పుడు మళ్ళీ ముగ్గురు పిల్లలు !"

సర్రున దూసుకొచ్చి పడ్డ పిడుగులా యినబడ్డాది—మల్లీ ముగ్గురు పిల్లలు !

మొకం సిట్లించుకుని సంకలో కర్ర టకటక లాడించు గుంటూ ఎల్లిపోయాడు.

సూరీడు నట్టనడాన నిలవడి నెత్తి మండుస్తున్నాడు. ఒంటికాలితో సెరసెరా యీడుతా యిసక తిప్పకి అడ్డబడి వొస్తాఉన్నాడు జగ్గన్న. గోదారి పాయి ప్రాలేవుదాటి ముంత నిండా మంచినీళ్ళు నింపుకున్నాడు. దరినున్న పుచ్చపాదులు తడివి ఎర్రటి పండోటి కోసుకుని మూట గట్టుకున్నాడు.

నడిసి నడిసి ఆలమూరు లంకలోకి సొచ్చుగొచ్చాడు.

ఇసక మాడిపోతా ఉన్నాది. సూరీడు కాలిపోతా ఉన్నాడు.

ఆడి గుండిలూ మండుతన్నాయి. రగతం సలసలమంట న్నాది.

"సూరమ్మ—తన పెళ్ళాం—ఆడికోసం—తన తమ్ముడి కోసం—పిల్లల్ని కన్నాది! రంకులాడి!"

ఆణ్ణీ, దాన్నీ కసికొద్దీ సొడిసెయ్యాలి! ఆడి రగతం తాగాలి!

దాని వొళ్ళు ముక్కలుచేసి కాకులికీ, గద్దెలకీ ఎయ్యాలి. అది కన్నపిల్లల పీకిలు నులివెయ్యాలి! అప్పుడు కాని ఆడికోపం సల్లారదు. ఆడి వుసురు వూరుకోదు. పేనం కుదుటబడదు.

ఆణ్ణి సొడిసెయ్యాలి, దాన్ని ముక్కలు సెయ్యాలి, ఆళ్ళ పిల్లల్ని సంపెయ్యాలి!

మొల్లో కత్తికి పదును పెట్టాలి, జగ్గన్న మొగతనం నిల బెట్టుకోవాలి!

ఇంకా నడుస్తన్నాడు. ఇటూ అటూ ఆకాసెవంతా యిసక పఱ్ఱ పరుసుకున్నాది.

ఆడి కళ్ళు సీకట్లు కమ్మినాయి. ఒంటో బలం తగ్గినాది. కాళ్లు దడదడ్లాడినాయి. మూట కిందేసుకుని ఉసూరువంటా ఆ యిసకలోనే కూసున్నాడు.

సుట్టూ మనుసుల అలికిడి లేదు. కళ్ళు సేతుల్తో కప్పు కున్నాడు.

అక్కడే ఆ ఎండకి మాడి—ఆళ్ళ మీద కసి తీసుసు కోకండానే సచ్చిపోతానేవోఁ అని బయం పడ్డాడు.

కళ్లు మెరిసినాయి. పగ తీరకుండా ఆడు సావడు. సావ డానికి యీల్లేదు! మళ్లా అడుగులో అడుగేసుకుంటా నడిశాడు.

ఎదర ఎవురో వాస్తన్నారు. ఏ మో మాట లినిపిస్తా ఉన్నాయి. పిల్లలు కూడా ఉన్నారు. కాల్లు కాలిపోతన్నట్టు న్నాయి. నెత్తిలు మాటతన్నటున్నాయి. దరికొచ్చారు. పిల్లలు దాగవంటన్నారు. ఆళ్ళ నాలికలు పిడసగట్టుకు పోయాయి.

ఆళ్ళని సూత్తే జగ్గన్నకీ దాగవయినాది. ముంత తీసు కున్నాడు. ఆళ్ళింకా దరికొచ్చారు. ముంతెత్తి నోట్లో పోసుకో బోతన్నాడు.

ఆళ్ళ బాబు యీడి దగ్గిరికొచ్చాడు. "సంటోల్లు దాగ వని ఏడుస్తాన్నారు. రొండు సుక్కలు ఆళ్ళ నోళ్ళల్లో కూడా పోసి పున్నెం కట్టుకో అయ్యా!" బతివాలాడు.

ఎగా దిగా సూసి—నోటికాడి ముంత, ఆడి సేతిలో పెట్టాడు జగ్గన్న.

ముగ్గురు పిల్లలూ గడగడా తాగేసి, ముంత కాలీ చేశారు. ఆళ్ళల్లో పెద్దోడికి నీల్లు మిగల్లేదు!

ఎండక యిలి పోయిన సీటాంకాయిలా నిలుసున్నా దా ఆడ మనిషి.

కాలీ ముంత జగ్గన్న తీసుకున్నాడు.

"కొత్తపేట వూళ్లోకి యింకా ఎంతదూర వుంటాది అన్నా?"

ఆ గొంతుకలో ఏదో జీరున్నాది.

"కోసుడు పైగా ఉన్నాది."

అప్పుడు దాని మొగుడన్నాడు: "ఇంకా శానా దూరం వెళ్లాలి గందా, బుల్లోణ్ణి నే తీసుకోనా సూరీ?"

—"సూరీ?"

ఆ మాట రెండు మొనలున్న బల్లెంలా గుచ్చుకుంది జగ్గన్నకి.

అది సూరి—తను కట్టుకున్న పెళ్ళాం!

ఆడు రాజియ్య—తన తోడబుట్టినోడు!

ఎవరికోసరం తను డబ్బు గడించాడు? ఎవరికోసం యుద్దాల వాళ్లకాట్లో తిరిగాడు? కాలిరగ్గొట్టుకున్నా ఎవుర్ని సూసుకొని బతుకుదారని యిప్పుడింటికొచ్చాడు?

ఈళ్ళే! యీళ్లే! తన కంచంలో వాణ్ణం తిని తన పొట్ట మీదే కొట్టిన పుండాకోరెదవయీడు!

మొగుడు దేశాలు పడి తిరుగుతా వుంటే మరిదోడితో కులుకుతున్న రాచ్చసి యిదే!

ఆళ్ళ పాపానికి పంపిన పళ్లు, యీ పిల్లలు!

సూరమ్మ, రాజియ్య పిల్లల్ని తీసుకుని నడిసిపోతా ఉన్నారు.

ఆడి గుండికి అదుటెక్కువయినాది.

ఆళ్ళని పొడిసెయ్యాలి! ఆళ్ల రగతం! కళ్ల సూడాలి!

"ఏయ్!" గట్టిగా అరిశాడు జగ్గన్న.

గొంతుకు నరాలు ఉబ్బకొచ్చేట్టు అరిశాడు.

ఆల్లు ఎనక్కి తిరిగారు.

మొల్లో కత్తి సర్రుని ఎలపలకి లాగాడు. ఆ కత్తికి ఎండ తలతలా మెరిసిచెదిరి పడినాది.

ఆళ్లు తెల్లబోయి చూసినారు.

కత్తి ఇటూ అటూ తిప్పాడు జగ్గన్న.

రాజియ్య బుర్ర పనిసెయ్యలేదు. సూరమ్మ రాయిలా నిలబడిపోయింది. కత్తి మెరుపుతో కళ్ళు కదిలిస్తా, ఆ పిల్లలు కాళ్ళు కాలుతావున్న ఘాటే మరిసిపోయారు.

జగ్గన్న ఆళ్ళ దరి కెళ్లాడు.

కళ్ళు నిడీసేసి యీాటెల్తో పొడుస్తా వున్నట్టు సూశాడు.

ఆళ్ళు గజగజలాడిపోయారు.

సూరమ్మా, రాజిమ్యా!

తన పెళ్ళాపూ, తమ్ముడూ!

కాదు కాదు—తను సచ్చేపోయాడు!

ఇప్పుడున్నోళ్ళు, రాజియ్య, ఆడి పెళ్ళాపూ!

జగ్గన్న తల తిరిగిపోయింది. చెయ్యిపట్టు సడల్లేదు.

ఎత్తిన కత్తి దింపకండా—కసిక్కుని పొడిశాడు.

# 5

పుచ్చకాయలోంచి ఎర్రంగా రగతం కారతన్నాది.

అయి అక్కడే యిసిరేసి గిరుక్కున ఎనక్కి తిరిగాడు.

* * *

ఆడి కళ్ళ కొంకుల్లో నీళ్ళ కొలన్లే నిండినాయి.

"మరి సిట్టి కనిపించలేదా తాతా?" అంటూ అడిగింది సీతమ్మ.

తాత నవ్వాడు. అది అడిగిందానికి మాట చెప్పనే లేదు. పై పెచ్చు ఎదర తిరిగి అడిగాడు.

"ఎవ్వరికీ ?"

*  *  *

మళ్లీ పాలి పట్నం వెళ్లినప్పుడు 'సీతాలచ్మీ వొటేలు' కెళ్లాడు ఎంకన్న. బద్రయ్య కనిపిచ్చలేదు. వొటేలు పక్క నున్న గుడిసికాడి కెళ్లాడు. గుమ్మంలో కూసుని, మోకాళ్ల మీద సేతులెట్టుకొని, సేతులిమీద గెడ్డవాసిని నేలమీదికి సూత్తా కూకున్న సీతమ్మ కనిపించినాది.

"మీవోడున్నాడా బుల్లెమ్మా ?"

ఎగాదిగా చూసిం దది.

"ఆడు లేడూ ?"

"ఎవరాడూ ?"

"బద్రయ్య లేడో ?"

"ఆ డెవుడో నా కేం తెల్దు. పో యిక్కన్నుంచి !"

ఆడి కిడ్డూరవయింది. కుసింత కోపవూఁ వచ్చినాది.

"నీ మొగుడున్నాడా లేడా అంటే, అల్లా మాటాడతా వేం ?"

"షామ్మంటే నీక్కాదూ సెబుతావుంట ? మళ్లీ వొచ్చావంటే కాళ్ళిరగ్గొట్టెత్తా !"

ఆడి కళ్ళు చింతనిప్పు లయినాయి. ఒళ్ళు మండుకొచ్చినాది. 'సీ !' అంటా యిసిరిగొట్టి ఎనక్కి తిరిగాడు. తిరిగీ తిరగడంతో బద్రయ్యే ఎదట కనిపించాడు.

"ఎప్పుడొచ్చావు తమ్ముడా?" బుజంమీద చెయ్యే శాడు. జెబ్బట్టుకోని వోటేల్లోకి తీసికెల్లాడు.

పై మీద గుడ్డ సర్రుని తీసి, ఎనక్కి చూసి ముందలికి సెరసెరా నడిశాడు ఎంకన్న. ఇద్దరూ కూసున్నారు. గుమ్మం కాడ, గల్లా బల్లకాడ బద్రయ్య సతికిలపడ్డాడు. రొండు గళాసుల్తో కాపీ తెప్పించాడు.

"ఏవన్నా దేంటి?" బద్రయ్య నవ్వుతా అడిగాడు.

ఆడు కోపంతో మాటాల్లేదు.

"తిట్టిందా?"

"అల్లాంటిదాంతో ఎల్లా కాపరం సేత్తన్నావు బద్రయ్యా?"

బద్రయ్య యిరగబడి నవ్వాడు. నవ్వుతానే గళాసు కాలీ చేశాడు.

ఎంకన్న కదంతా అయోమయంగా ఉన్నాది.

"ఇంకా తాళికట్టలేదు తమ్ముడా! దానికూడా టయివుం రావొద్దో?" మళా నవ్వాడు. "పిల్ల ఎల్లాగుందంటావు?"

"ఆడల్లా అడుగుతా డనుకోలేదు ఎంకన్న. సోద్దెంగా ఆడి ముకంలోకే సూడ్డంతో బద్రయ్య మాట మారిశాడు.

"మల్లా అంటిగల్లేసు కొచ్చావా?"

అప్పటికి కొత్త వూపిరొచ్చింది ఎంకన్నకి. "మరి? వూరికే సేతులాడించుగుంటా వొస్తా ననుకున్నావా బద్రయ్యా? ఈ పాలి సరాసరి పెద్దబజారుకే ఎల్లినా. అల్లంత దూరాన్నుండగానే నన్ను గురుతుపట్టి, యీరాసామి లగెత్తుకొచ్చాడు.

సరుకు దింపించుకుని ఎనకట్లాగే డబ్బిచ్చేశాడు" 'ఇజయఁకోట యిూరుళ్ళా, అన్నాడు.

బద్రయ్య నవ్వాడు. ఆ నవ్వులో వొంక రున్నాది. టీవిగా ఎనక్కి వోలి, "సెబాస్, తమ్ముఁడా!" అన్నాడు.

ఎంకన్నకి కొత్త బలవొచ్చినాది.

వొచ్చేల్లో వొచ్చి పోయీవోళ్ళ రద్దీ ఎక్కువయినాది. ఆళ్ళల్లో సానామంది సుట్టుపక్కలున్న పడవలోళ్ళే! పలారం అందిచ్చి కుర్రోళ్ళు పెసరాట్, కాపీ, యిడ్డీ అంటా అరు స్తన్నారు. తినేసి ఎల్లిపోయీవోళ్ళల్లో కొంతమంది ఎంటనే డబ్బు లిచ్చేస్తా వున్నారు. ఇంకొంతమంది పద్దు రాయించు గుంటన్నారు. కొందర్ని గజుంతాడు బద్రయ్య. కొందర్ని మరి యాదగా అడుగుతాడు. కొంతమందిని బతివాఁ ల్తున్నాడు. ఇంకా కొంతమందిని గొప్పగా జాలితలస్తాన్నాడు.

ఇంత గొప్పోడే బద్రయ్య ?

పొద్దు గూకబోతన్నాది. ఒచ్చినోళ్ళల్లో తీరిగ్గా కూసు న్నోళ్ళూ, ఎటకారాలాడతా ఉన్నోళ్ళూ, పేకాటేసుగున్నోళ్లూ, సినేవాఁ పాట్లు పాడతావున్నోళ్ళూ రకరకాలమంది వున్నారు. ఈళ్ళంతా బద్రయ్య సుట్టూ తిరగవలిసిందే!

పేకాట మాజోరుగా సాగుతున్నాది. గుప్పిడి డబ్బులు చేతుల్లోకి తీసుకుని బద్రయ్య కూడా ఆళ్ళకాడి కెళ్లాడు. ఆ సిత్ర వేంటో సూదారని ఎంకన్నా ఎళ్లాడు. కొంతమంది డబ్బులు పడేస్తన్నారు. కొంతమంది ఏరుకుంటున్నారు. మెరిసీకళ్ళూ, ఏడిసీ కళ్ళూ!

ఆట్లోకి దిగీ దిగడంతో టే బద్రయ్య గుప్పిడూ రొండు గుప్పిళ్ళయినాయి. ఎంకన్నకి మాంచి మోజు కలిగింది ఆట మీద. కళ్ళింతచేసి సూత్తా నిలుసున్నాడు.

అది కనిపెట్టాడు బద్రయ్య.

"నువు కూడా ఆడతావా ఎంకన్నా ?"

"నాకు రాదు బద్రయ్యన్నా !"

ఆడు నవ్వాడు. "ఎంత ఎర్రోడివు తమ్ముడా! ఇదేవన్నా బెమ్మాండవనుకున్నావా ? ఆటన్నది యీ ఏల రాపోతే ఱేపొ స్తాది. పట్టుమని నేరుసుగుంటే నువ్వు మట్టుక్కి యీళ్ళని మించలేవో ? అంటిగెల యాపారం గొప్పదో, పేకాట గొప్పదో నీ కప్పుడే తెలుస్తాది !"

"నిజవేఁ ?"

మల్లా నవ్వాడాడు. "సూత్తావుగా ! యీయాల్టికి నీ తర పుని నే నాడతాలే ! పేరు నీది, ఆటనాది. లాబవొఁత్తే యిద్ద రికీ సెరిసగం ! నట్టవొఁత్తే నేనే పెట్టుగుంటా ! ఏం ?"

సయ్యన్నాడు ఎంకన్న. ఆటమీద ఆట కలపడంతో రొండు గుప్పిళ్ళల్లా నాలుగయినాయి. లాబంలో సగం ఎంకన్న కిచ్చేసి, పక్కకి తిరిగి ఆల్లెంపు అదే రకవుఁగా నవ్వాడు. డబ్బు పోగొట్టుకున్నా కూడా ఆళ్ళు ఏడాకండా నవ్వుతానే ఉన్నారు. తన్నిసూత్తే ఆళ్ళకి కల్లెందుకు కుట్టవో ? సరిగందా, తన్ని మా మెచ్చుకున్నారు.

"నీదే అదురుట్టం బెదరో !"

ఎంకన్న గొప్పగా నవ్వాడు.

అలా నవ్వుతా ఉన్నప్పుడే, ఆల్లెంపుకి తిరిగి, యీడి మంచితనం సాలా గొప్పగా సెప్పుళ్లో చెప్పాడు బద్రయ్య.

"బద్రయ్య యింతటోడని తెలీనే లేదు సువాఁ!" అనుకున్నా డెంకన్న. తెలీనందుకు లోన సాలా నొచ్చుకున్నాడు. ఏదో పెద్ద తప్పుడు పని చేసినోడిలా యిదయ్యాడు.

ఇల్లా వుండగానే ఎక్కన్నించో వూడిపడ్డాడు సెరబయ్య. "ఎప్పుడొచ్చావు బెదరో?"

సెప్పాడు. "వొచ్చినోడి వొచ్చినట్టే ఎడతావు కాని, ఎప్పుడూ రొండ్రోజులేనా వుండవేం బెదరో! మాలాగ వుసారుగా తిరగడం సాతకాదా?"

సిగ్గుపడ్డాడు ఎంకన్న.

"ఇంటికాడ బారియామని గారు బెంగెట్టుగుంటాదే వోఁరా!" బద్రయ్య ఎటకారవాఁడాడు.

పెళ్ళాం వూసొచ్చేసరికి ఆడికి ఉక్కరోస వొచ్చింది. యాపారం కోసవని ఆడు పట్నంలో వుంటే అదెవ్వుత్తీ అడగడానికి? మొగోడు, రొండ్రోజులు కాదు, పది రోజులుంటాడు. పన్నిబట్టి ఉండాలి సొస్తాది. పెళ్లాం వొద్దంటే మట్టుక్కి ఆడేం మానేరకవాఁ?

పట్నం గొప్పతనం ఆడికి తెలిసుకొచ్చాడు. కాని, వూరు కొత్త మరి! ఈ కొసనుంచి ఆ కొసాకి సూత్తా ఎల్లడానికి, ఆడికి ఆ యీదులన్నీ ఒక్కలాగే కనిపిత్తాయాయిరి! అలాటప్పుడు ఎక్కడని తిరుగుతాడు? ఏవఁని సూత్తాడు? అల్లాగని మల్లా ఏయీ తెలీనోడూ కాడు. రాయిమండీ టేసెనూ, బస్సుటాండూ, వొరదారావు వొటేలు, యింకాపోతే కొసాకి గోదారి టేసెనూ, అంతే.

పట్నవ్వంలో మోసగాళ్ళుంటారని ఎవురో సెప్పారాడికి. అంత పెద్ద రొక్కం, నోట్లకి నోట్లు జేబీలో పెట్టుకొని తిరుగుతా వుంటే ఎవురన్నా మాయంసేత్తే? అల్లాటియి ఆడు సాలా యిన్నాడు.

పట్నంలో చెడ్డ సావాసాలు సులువుగా అవుతాయంట!

"ఈ పా లో రోజుంటాలే బద్రయ్యా!" అన్నాడు ఎంకన్న.

సెరబయ్య నవ్వాడు. ఆ నవ్వులో ముచ్చటున్నాది.

"రయిటో!" అంటా అరిశాడు బద్రయ్య.

సెరబయ్యని బల్లకాడ కూకుండబెట్టి, గల్లాపెట్టి అప్ప సెప్పి, ఎంకన్నని తీసుకుని బయలెల్లాడు బద్రయ్య. ఇద్దరూ సెయ్యా, సెయ్యా కలుపుకుని నడిశారు. బద్రయ్యతోడు ఎంకన్న!

సందులూ, గొందులూ కలిపి సాలా యీదులే తిప్పాడు బద్రయ్య. ఎత్తయిన ఓ మేడ ముందల నిలుసుని లోనకి సూత్తా వుంటే, ఎంకన్న అడిగిండు—"ఏంటి బద్రయ్యా?"

"మేడ తమ్ముడా!"

"కనిపిస్తానే ఉందిగా!"

"అది కాదు ఎంకన్నా! కనిపించే వాటిలో, కనిపించకుండా దాగున్నాది కనిపించాల! ఏవంటా?"

"అంటే?"

"ఈ మేడెవుడిదో తెలుసా?"

"తెల్దు."

"పోనీ ఎల్లా కట్టాడో తెలుసా?"

"సిమ్మెంటు సున్నవుంతో."

ఇరగవడి నవ్వాడు బద్రయ్య. "దానికి డబ్బు ఎల్లా గొచ్చిందో సెప్పగలవా ?"

"గొప్పోడు గనుక !"

"గొప్పోడెల్లాగవుతాడు ?"

"అదురుట్టం కలిసొత్తే !"

మల్లా నవ్వాడు. "అదురుట్టం కాదు తమ్ముడో ! సురుకుతనం !"

"అంటే !"

"ఇప్పుడు యీ యింటి కావందున్నాడే, ఆడు ఎనక, అంటే అయిదేళ్ళకెనక ఓ జమీందారు డింటో వొంట చేసీవోడు !"

ఏంటీ? వొంటలుచేసే యింత డబ్బు గడిచ్చాడా ?"

"మ రేం టనుకున్నావ్ ! సెప్పేదంతా యిను."

"ఆడికి జీతవెంతో ?"

"రొండుపూట్లా వొణ్ణపెట్టి నెలకి పది రూపాయలు !" అంతే ?"

"యిను మరి, ఆడి గొప్పతనవేంటంటే, ఆ డెన్ని దినాలు పని ఎగ్గొట్టినా, సేసినప్పుడు మట్టుకి మా మోతగా సేసీవోడం టలే ! అందుకే ఆణ్ణి సత్తే వొదిలీవోరు కారు. జమీందారుగారి పెళ్లాంగారు మా మెచ్చుకునీదంట ! ఇంటికొచ్చి నోళ్ళందరితో ఆళ్ళవొంటోడి గొప్ప సెప్పుకోడవే !

"ఆడిపేరు రావయ్యగాడు. బలమైనవోడేలే ! ఆ డొళ్ళు సూత్తే ముసిలి జమీందారుడికి ఎనకటి రోజులు గుర్తొచ్చీయంట ! అమ్మగారు వొళ్ళు మరిసేపోయీాదంట. అప్పు

డాయమ్మ మాంచి పొంకంలో ఉన్నాదంటలే! నా సావిఁరంగా యింక సూసుకో! ఆ డ్యాయింటో అడుగెట్టిన ఏడాది తిరక్కుండానే ఆడి మకాం వొంటింటోంచి "అమ్మగారి" గదిలోకి మారి పోయిందంట! అది సూసి కడవాఁ నవుకరోళ్ళంతా ముక్కుమింద ఏళ్లేసుగునీ వోరంట. కొంతమంది అమ్మగార్ని సీదరించుకునీ వోరంట కూడా!

"ముసలోడు సికిలికళ్ళల్లోంచి కొంచెం కొంచెం కని బెడతావుండీవోడంట. గట్టిగా సెప్పీ దయిర్నెంసాలక నోరు మూసుకునీ వోడు. ఏమన్నా అంటే ఆళ్ళిద్దరూ కూడబలుక్కుని లెగిసిపోతారేమోఁని బయం! యీొవని బడి తిరిగి దాని కంటె, తెరసాటు యవ్వారం కూతంత మేలేగందా!

"దాంతో ఆళ్ళకి మరీ లోకువయింది. ఓ మంచి రోజు చూసి, యిద్దరూ కలిసి ఆడికి యిసవెట్టాను."

"అమ్మ బాబో!" అన్నాడు ఎంకన్న.

"ఇంకా యిను ఎంకన్నా! అయ్యగార్ని మోసేసిన కాడినించీ రావఁయగాడే అమ్మగారి పసుపూ, కుంకం నిలబెట్టాడు. కొన్నాళ్ళు పోయాక జమీందారీ అంతా యీడిపేర నవోఁదయినాది. అప్పన్నించీ ఆడు రామారావుగారయి పోయాడు. ఈ మేడ ఆడిది!

"అమ్మగారు యీొదిని బడింది, ఇప్పటికీ ఇన్నీసుపేట బస్సుటాండుకాడ ఓ పిచ్చిది అడుక్కుంటా వుంటాది, ఎప్పుడూ సూళ్ళేదో?"

"పాపం!" అన్నాడు ఎంకన్న.

"మరి రావఁయగాడో?"

"అదురుట్టి వున్నో డన్నావుగా!" కొట్టొచ్చినట్టు చూశాడు బద్రయ్య.

ఆ మేడమీద వో అమ్మాయీ, మరో బుల్లోడూ సినీమా పాటేదో పాడుకుంటా గంతులేస్తన్నారు; కింద నౌకరోడు కారు కడుగుతా వున్నాడు. అయ్యగారి దరిసెనం కోసం తెల్ల టోపీలోళ్ళూ, సిలుకు సూటోళ్ళూ సోపాల్లో కూసున్నారు. "అయ్యగారు పూజలో వున్నారు!" అని సెప్పాడు కుర్రోడు.

"గొప్ప దైవభక్తుడు."

"సంఘ సేవకుడు."

"నిస్వార్థ ప్రజానాయకుడు!"

"సాహిత్య ప్రియుడు!"

"కళా తపస్వి."

"బుధజన విధేయుడు, సర్వజన వంద్యుడు!"

అక్కడ కూసున్నోళ్ళంతా తలోపాటా పాడతన్నారు. ఆళ్ళంటన్న మాటలేంటో ఎంకన్నకి తెలీలేదు. బద్రయ్యకి మటుక్కు కొంత తెలిసింది.

ఇద్దరూ ముందరి కెల్లిపోయారు. ఓ యింటి అరుగుమీద లావుపాటోడు, పడక్కుర్సీలో కూకుని పేపరు సదూకుంటన్నాడు.

"ఆ డెవురో తెలుసా ఎంకన్నా ?"

"ఊ హుఁ!"

"ఎనక యీ వూళ్ళో యీడికి పెద్ద కల్లుపాక ఉండీది. పాయిబిస నొచ్చాక సరకారోళ్ళు నిగా సెయడంలో మంగళ

వోరప్పేటలో రొండు మేడలూ, కడిపి లంకలో యిరవయ్యెక రాల బూవిఁ కొన్నాక, కల్లు తాకూడదని జనానికి సెబుతా ఉపన్నేసా లీడవేఁ పనిగా పెట్టుకున్నాడు. ఇప్పుడు మునిసిపాల్టీ కవున్సిలరు !"

తెలిసినట్టు బుర్ర వూగించాడు ఎంకన్న.

ఇంకో యింటిముందర ఆగారాళ్లు. తాలాలూ, మద్దెల్లూ సప్పుళ్ళూ, సొన్నాయిపాటా, గజ్జెలమోత యినిపిస్తావున్నాయి.

"ఈ యిల్లు ఆరుముగం అయ్యరు గాడిది. అరవ్వోడులే! ఈడి కిద్దరు పెళ్ళాలు. తూతుకూడి రాజరత్తమ్మ అనీ సిన్న దాన్ని ఆదేసెంనించి లెగెత్తుకొచ్చి యిక్కడే వుండిపోయాడు. ఏలంయ్యెర్రి కుర్రగుంటలికి తెయి తెక్కలాడ్డం నేరుపుతాడు. కొత్త సినేవాఁ వొచ్చిందంటే, మన్నాడు ఏసం కట్టించాడన్న మాటే! ఆ డీ వూ రొచ్చాక బోగవోఁళ్ళ గిరాకీ పడిపో యింది. ఆడిలా బరతనాట్టెం వొచ్చినోడు మనదేశంలోనే లేడంట! ఆడు యీ వూళ్ళో ఉండిపోడం రాయివంద్రానికే పెద్ద గొప్పంట!"

నోరెళ్ళబెట్టుకొని యింటావున్నాడు ఎంకన్న.

ఇద్దరూ అల్లా నడుస్తావుంటే, ఓ సిలుకు సొక్కావోడూ-మెళ్లో బంగారం గొలుసున్నవోడూ కనిపించాడు.

"ఆడిపేరు గంగయ్య. వూళ్లో బోగవోళ్లు ఆడికి తెలీ కండా మేళానికి బేరవాఁప్పుకోరు! మొన్న వొరదలికి గోదాల్లో కొట్టుకొచ్చిన సివలింగానికి గుడి కట్టిస్తావంటే, ఎయ్యినూట పదార్లు, వురోసుకు సచ్చిన తన పెళ్ళాం పేరుమీద యిచ్చా డంట! ఆడి అన్నయ్యో డున్నాడు. సచ్చినోళ్ళ పీనుగులు

మొయ్యోడవేఁ ఆడి పని. దానాదీనా నాలుగిళ్ళు కొన్నాడు. ముప్పయ్యేలు వోడ్డీలకి తిరుగుతా వుంటాయంట!"

'ఈ వూళ్ళో యింత గొప్పోళ్ళున్నారా?' అనుకున్నాడు ఎంకన్న,

"ఈ వూరికి ఎన కో మునిసిపల్ సేరిమే నుండీవోడులే! ఆడికి ఆ కురిసీ దొరికాక లచ్చ రూపాయలు బేంకులో ఏసినట్టు ఎవురికి తెలీదంట!"

ఇన్ని గొప్ప సంగతులు లోన కెళ్లడానికి ఎంకన్న బుర్రలో సోటు నిండుకున్నాది.

"ఇన్ని యిసయాలు యీాడి కెల్లా తెలిశాయో?" అనుకున్నాడు.

జేవులోనించి రొండు సిగరెట్టులు తీసి ఎంకన్న కూ్కాడా వో టిచ్చాడు బద్రయ్య. ఇద్దరూ అగ్గి అంటించుకున్నారు.

"ఈళ్ళింత గొప్పోళ్ళెల్లాగయ్యారు బద్రయ్యా?"

"అదురుట్టవుఁ" అని యిరగబడి నవ్వాడు. "అందరూ అల్లాగే అనుకుంటారు తమ్ముడో! అదురుట్టవేఁ! అంటే ఏంటో తెలుసా నీకు?"

ఎంకన్న నోరెళ్ళబెట్టాడు.

"తెలీదా?"

"కళ్ళకి కనిపించకుండా వచ్చే లాభాన్ని అదురుట్ట వంటారు. అని బాలయ్యగా రనేవోరు."

"కరకట్టు! సరీగా సెప్పావు తమ్ముడా! నిజం సెప్పద్దో? ఇది నీకూ్కాడా తెలుస్తాఁ దనుకోలేదు!"

వోరప్పేటలో రొండు మేడలూ, కడిపి లంకలో యిరవయ్యేక రాల బూవిఁ కొన్నాక, కల్లు తాకూడదని జనానికి సెబుతా ఉపన్నెసా లీడవేఁ పనిగా పెట్టుకున్నాడు. ఇప్పుడు మునిసిపాల్టీ కవున్సిలరు !"

తెలిసినట్టు బుర్ర వూగించాడు ఎంకన్న.

ఇంకో యింటిముందర ఆగారాళ్లు. తాలాలూ, మద్దెల్లూ సప్పుళ్ళూ, సొన్నాయిపాటా, గజ్జెలమోత యినిపిస్తావున్నాయి.

"ఈ యిల్లు ఆరుముగం అయ్యరు గాడిది. అరవోడులే! ఈడికిద్దరు పెళ్ళాలు. తూతుకూడి రాజరత్తమ్మ ఆనీ సిన్న దాన్ని ఆదేసెంనించి లెగొత్తుకొచ్చి యిక్కడే వుండిపోయాడు. ఏలంమ్మెర్రి కుర్రగుంటలికి తెయితెక్కలాడ్డం నేరుపుతాడు. కొత్త సినేవాఁ వొచ్చిందంటే, మన్నాడు ఏసం కట్టించాడన్న మాటే! ఆ డీ వూ రొచ్చాక బోగవోళ్ళ గిరాకీ పడిపో యింది. ఆడిలా బరతనాట్టెం వొచ్చినోడు మనదేశంలోనే లేడంట! ఆడు యీ వూళ్ళో ఉండిపోడం రాయివంద్రానికే పెద్ద గొప్పంట!"

నోరెళ్ళబెట్టుకొని యింటావున్నాడు ఎంకన్న.

ఇద్దరూ అల్లా నడుస్తావుంటే, ఓ సిలుకు సొక్కావోడూ– మెళ్లో బంగారం గొలుసున్నవోడూ కనిపించాడు.

"ఆడిపేరు గంగయ్య. వూళ్లో బోగవోళ్లు ఆడికి తెలీ కండా మేళానికి బేరవాఁప్పుకోరు! మొన్న వొరదలికి గోదాల్లో కొట్టుకొచ్చిన సివలింగానికి గుడి కట్టిస్తావంటే, ఎయ్యి నూట పదార్లు, వురోసుకు సచ్చిన తన పెళ్ళాం పేరుమీద యిచ్చా డంట! ఆడి అన్నయ్యా డున్నాడు. సచ్చినోళ్ళ పీనుగులు

మొయ్యేడవేఁ ఆడి పని. దానాదీనా నాలుగిళ్ళు కొన్నాడు. ముప్పయ్యేలు వొడ్డీలకి తిరుగుతా వుంటాయంట!"

'ఈ వూళ్ళో యింత గొప్పోళ్ళున్నారా?' అనుకున్నాడు ఎంకన్న,

"ఈ వూరికి ఎనకో మునిసిపల్ సేరిమే నుండీవోడు లే! ఆడికి ఆ కురిసీ దొరికాక లచ్చ రూపాయలు బేంకులో ఏసినట్టు ఎవురికి తెలీదంట!"

ఇన్ని గొప్ప సంగతులు లోన కెల్లడానికి ఎంకన్న బుర్రలో సోటు నిండుకున్నాది.

"ఇన్ని యిసయాలు యీడి కెల్లా తెలిశాయో?" అనుకున్నాడు.

జేవులోనించి రొండు సిగరెట్టులు తీసి ఎంకన్న కూ్కాడా వో టిచ్చాడు బద్రయ్య. ఇద్దరూ అగ్గి అంటించుకున్నారు.

"ఈళ్ళింత గొప్పో ళ్ళెల్లాగయ్యారు బద్రయ్యా?"

"అదురుట్టవుఁ" అని యిరగబడి నవ్వాడు. "అందరూ అల్లాగే అనుకుంటారు తమ్ముడో! అదురుట్టవేఁ! అంటే ఏంటో తెలుసా నీకు?"

ఎంకన్న నోరెళ్ళబెట్టాడు.

"తెలీదా?"

"కళ్ళకి కనిపించకుండా వచ్చే లాభాన్ని అదురుట్ట వంటారు. అని బాలయ్యగారనేవోరు."

"కరకట్టు! సరీగా సెప్పావు తమ్ముడా! నిజం సెప్పద్దో? ఇది నీకూ్కాడా తెలుస్తాదనుకోలేదు!"

"అయితే బద్రయ్యా! రొండో కంటోడికి తెలీకండా సాటుగా డబ్బు గడిత్తే అదురుట్ట వంటన్నాంగందా మరి దొంగ తనవో?" దొంగతనం అదురుట్టంలోకి రాదని ఆడికో గట్టి నమ్మకం ఉన్నాది.

"అదీనూ!"

అది ఎంకన్నకి నచ్చలేదు.

"అసలు సంగతి నీకు తెలీలేదు ఎంకన్నా! ఎంతకాలం నించి దొంగతనం సేత్తన్నోణ్ణాయినా, ఆడు పట్టుబడ్డప్పుడు కాని మనం దొంగ అనం. కనక ఏంటంటే ఆడు పట్టుబడకండా ఉన్నన్నాళ్లూ పెద్దమనిషిలోనే లెక్కన్నమాట!"

"అదురుట్టవంటే అదికాదు బద్రయ్యన్నా!" సెప్పబోతా వుండగానే—

"నాకు తెలుసు ఎంకన్నా! నువ్వనుకునీయి పాతూర గాయి పచ్చళ్ళు! ఇప్పుడేంటంటే— నువ్వు దొంగతనం చెయ్యి, కూనీ చెయ్యి, ఇంకో తనవేదన్నా చెయ్యి, మోసవ్వాం చెయ్యి. ఎన్ని చేసినా సాటుగా ఎవురికీ దొరకండా చెయ్యి. ఈ బూమ్మీద రొండో కంటోణ్ని నమ్మేవో, నిన్ను ముంచే దన్నమాటే! నాలుగురాళ్లు ఎనకేసుకున్నావంటే, నువ్వాడింది ఆట, పాడిందిపాట! ఏనుగెక్కించి నిన్ను ఊరేగిత్తారు. నీ పుటోవు దండల్తోకూడా పేపర్లో ఏయిత్తారు. అప్పుడు నువ్వు కూడా గొప్పోడివే అయిపోతావు.

ఇన్ని సెప్పినా ఎంకన్నకి నచ్చలేదు.

"మోసవంటే బయట పడకోడదు తమ్ముడో! నువ్వూ నేనూ మడిగట్టుకూకుంటే పెపంచమంతా మనకోసం మార

తాదా? అసలు మోసం లేని సోటు ఎక్కడేనా ఉన్నదా చెప్పు? ఒకడు రొండోవోడికి సేత్తే లవుక్కం వంటారు. పెళ్ళానికి సేత్తే సరసాలవో డంటారు. అన్నదమ్ముల్లికి సేత్తే పెపేజీకు డంటారు. పదిమందికీ సేత్తే యాపారవంటారు. దేశానికి సేత్తే రాసకీయవంటారు. మరిగంటే, అంతమందీ యిల్లా వున్నప్పుడు మనం దూరంగా ఉండిపోతే, యీ రోజుల్లో బతగ్గలవాఁ? ఇప్పుడు గొప్పోళ్ళు అనిపించుగునీవోళ్ళంతా నాయంగా బతుగుతున్నవోళ్ళేనా? నీ మంచితనవంతా మాటల్లో సూబిచ్చాలి. నువుచేసే పనిమట్టుక్కి నువు మానకోడదు. సచ్చీదాకా నీ కిటుకు పక్కలో పెళ్ళానికి కూడా సెప్పకోడదు. తెలిసిందా? ఎంత పెవాఁదయిన పన్లు సేత్తే అంత తొందరగా గొప్పోడివయిపోతావు—ఏవంటా?"

"ఇల్లా గడించి తినీది కూడా వొణ్ణవేఁ?"

"మరి నీ సుకం కోసం కాదో? నీ మజాకోసం కాదో? కడుపునిండా తిండీ, సిలుకు సొక్కాలూ, ఎత్తయిన మేడా, దొరసానిలాంటి సొగుసుకత్తీ, సేతిలో వో బుడ్డీ—ఉన్నాయంటే నా సావిఁరంగా యిందరలోకం సూడవో?"

ఎంకన్న వొప్పుకోనట్టు చూశాడు. బద్రయ్య మాట మారిశాడు.

"అన్నట్టూ, నీకు ఆకలెత్తావుందేవో! యీ వోట్లో కూతంత కాపీ తాగి సెంద్రకాంత వింటి కెల్దారి! వొత్తావా?"

"అదెవరూ?"

"నువ్వే సూత్తావుగా!" బద్రయ్య నవ్వాడు.



# 6

రానురాను ఆడికి తనమీద మోజు తగ్గిందేవోఁ అనుకున్నాది రావులమ్మ. నవుకిరీ మానేసి పట్నంపోయి ఆడు గొప్పోడవుతున్నాడు గందా, తను మాటాడితేనే యిసుక్కుంటాడేం? తోలేడు వొచ్చిన లాబంతో మెళ్లో పట్టెడి సేయిత్తానని అన్నోడు కాడో? తను నిజవేఁ అనుకున్నాది. సినేవాలికీ, సరకస్సులికీ కరుస్సెత్తాడు కానీ తన పట్టెడమాట గురుతుంటాదా? ఏవఁన్నా అంటే బిగినీసు, బిగినీసు అంటాడు. మరయితే వొచ్చిన లాబాలు వొక్కరోజూ సూబిచ్చడేం? ఇప్పుడు గురుతులేదులే కానీ ఆడు పట్నె వెల్తా నన్నప్పుడే దానికి కుడికన్ను అదిరుండాలి!

ఏడుపొచ్చినంత పనయింది.

ఆడు తనికి అన్నాయం సెయ్యడు గందా?

ఆరేళ్ళ ఎనక రావులమ్మ యిదిలించుకున్న రవణయ గాడు యిప్పుడు వూళ్లో పరువైన పెద్దమనిసి. గరువు సెరు వెంపుని పెంకుటిల్లు కట్టుకున్నాడు. వూళ్లో మునసబు కరనాలూ, పంచాయితీ బోర్డు పెసిడెంటుగారూ యీడి మాటకి ఎంతో యిలవిత్తారు. యలచ్చన్లొత్తే ఆడు సెప్పినోడికి వోట్లు పడవలసిందే! పిరికోళ్ళని మంచి చేసుకుని, గడుసోళ్ళకి కర్ర సూబించి అందర్నీ తనెంపుకు తిప్పుకోగలవోడు. సదుగంటే లేదు కానీ, తలలుతీసి తలలు పెట్టగల తెలివున్నవోడు.

ఆడిప్పుడు అరికాళ్ళదాకా పంచిలు కడతన్నాడు. పొడుగు చేతుల సొక్కాలు తొడుగుతన్నాడు. కాళ్ళకి సేనపిల్లి

లంక జోడేసుకుని నడుత్తావుంటే, ఆడుకూడా ముందు ముందూ మంతిరి అవకపోత్తాడా అనిపిత్తాది.

రవణయ్య యింతగా మారిపోడం రావులమ్మకి యిడ్డూరవయినాది. గొప్పోళ్ళతో జడుసుకోకుండా నిలుసుని మాటాడ్డం సూత్తే ఆడు ఎనకటి రవణయగాడేనా అనిపిస్తాది. 'తన్ని కొంగట్టుకు లాగినోడే?'

ఆడికిప్పుడు ముగ్గురు పిల్లలు. ఆళ్ళల్లో యిద్దరు మొగోళ్ళు. ఆ ఎంపుకి ఎల్లినపుడు ఆ పిల్లల్ని ముద్దులాడకండా రాదు—రావి. ముద్దులు మూటగట్టే పిల్లల్ని కన్నందుకు సత్తెమ్మని మెచ్చుకుంటానూ ఉండాది. సింవంలాంటి మొగోడుకనకే అల్లాటి పిల్లలు.

సత్తెమ్మ నిజంగా సత్తికాలపు మనిసే! పాపం, అన్నం పున్నం ఎరగదు.

"మా ఎంపుకి రాడవేలేదేం సెల్లమ్మా?" అన్నాదోపాలి. "మావమీంద కోపవయితే నేనేం చేశానో?" గుచ్చి గుచ్చి అడిగింది. అప్పుడది కసిక్కున నవ్వేసింది.

రవణయ మావ ఎనకట్రోజులు రావులమ్మ వొక్కోటే మరిసిపోతా వొచ్చింది.

కోటయ కూతురుతో ఎటకారాలూ—

సోదెమ్మగా రమ్మాయిని పాకలో దాసెయ్యడం—

పట్నం బోగందానికి పదినోటీడం—

ఆ మాట కొత్తే సింతలతోపులో తన సిగలో సీవసింత తొడిలు గుచ్చడవూ—

హవ్వ! ఇయ్యన్నీ కట్టుకున్న పెళ్ళానికూడా చెప్పగునీ మొగో డెక్కడేనా ఉంటాడా? ఒకేల చెప్పేడే అనుకుందారి, సివాల్ని నవ్వేసి ఆడికే దణ్ణాలడతాడేం సత్తెమ్మా? తన్నై తేనా—సెవులట్టుకు గుంజ లాగదో?

ఆళ్ళ సిన్నోడు అచ్చం తండిపోలికే! ఆణ్ణి ముద్దాడితే రవణయగాడు బుగ్గలు తడూకుంటాడేమో? నోరబ్బో! పాత గోనా లింకా పోంకం తియ్యలేదు.

దార్లల్లో పుట్టవలసినోడు రవణయమావ! ఆణ్ణి చూసి నప్పుడల్లా సింతతోటలో వూసు గురుతొస్తాది.

సంవచ్చరాది పండుక్కి సింతలూరు తీరతాని కెళ్ళింది. ఆ డొద్దన్నాడు. ఇనలేదు. జిడ్డోరి వోటేలి కెదురున్న సెరుకు పానకం దుకానంకాడ రవణయమావ కనిపించాడు. తన్నిచూసి నవ్వాడు. అదీ నవ్వింది. తన సరసకొచ్చి సెరుకు పానకం డబ్బులు ఆడే యిచ్చేశాడు. కూడా వచ్చి సిత్రాలన్నీ సూబి చ్చాడు. అయినుకీ వంట నల్లటిదేదో తినిపించాడు. రంగులు రాట్టం ఎక్కిచ్చాడు! రంగురంగుల రిబ్బన్లు కొనిపెట్టాడు. సుక్కల సీర్లూ, రంగుల రయికలూ కూడా ఉన్నా యక్కడ. తను మనసుపడ్డం సూసి "కావాలేంటే?" అనడిగాడు మావ. డబ్బుకోసం జేబీలో సెయ్యెట్టాడు కూడా! సయ్యన్నదల్లా సెయ్యి తిప్పేసింది. "ఏవేం?" అన్నాడు. "నువ్వు కొనిపెడితే ఆడు అనుమానపడతాడు మావా!" అల్లా అంటావుంటే దానికి సిగ్గొచ్చింది. ఆడు యిరగబడి నవ్వాడు.

"మావ మంచోడే!" అనుకున్నాది రావులమ్మ.

ఇంటి కొత్తావుంటే దాగ్లోనే సీకటిపడిపోయింది. గుమ్మ
వుంలో అడుగుపెట్టిందో లేదో. ఎంకన్నగాడు శివాంలెత్తాడు.
అది నోరిప్పలేదు. ఆడు కూడు తిన్నన్నాడు. తను ముట్టుక్కు-
గుక్కుడు గంజినీళ్ళు తాగింది.

ఇల్లు సక్కబెట్టుకుని ఆడి మంచంకాడి కొచ్చింది. కాళ్ళ
కాడి దిక్కుని కూకుండి, మీద సెయ్యేసింది.

ఎలపల ఎన్నెల ముసురుకొచ్చింది. దొడ్లో జాజిపూల
వాసన గుమ్మంటూ ఉన్నాది.

"తమ దరికొచ్చి కూకుంటే ఆ డలా నిగడదన్ని పడు
కుంటాడేంవో ? ఏ రేప్పుడయితే తనకేం పట్టింపులేదు. పండుగు
రోజుని కూడా మాటాడకండా తొంగోడవే? అందరూ యిలాగే
సేత్తారా ?"

రవంణయ మావంయితేనా ?

ఆడోళ్ళ మనసు ఆపాటి తెలీదేవోంయిాశికి ?

"ఆడే వొద్దనుకుంటే నేనే అంత లోకువా ?" అనీ అను
కున్నాది.

మల్లా ఆస పుట్టుకొచ్చింది. గెడ్డమ్మీద చెయ్యేసింది.
"నిదరొచ్చిందా ?" ఉలకలేదు.

"కోపవాం ?"

"కోపవాం ?"

కదల్లేదు. ఉసూరువంటూ నేలమీదే తొంగేసుకు పడు
కున్నాది. "స్సీ ! ఏం మొగోడు !" అనుకున్నాది.

రావుంలమ్మలాంటి ఆడదాంతో ఏగడం మానెడ్డ
కట్టం ! పట్నవులో బిగినీసు మానేసి ఎలపలి పెపంచవుంలో

దొరికే సర్దాలన్నీ యిదిలేసి ఎప్పుడూ దాని వొళ్ళో తలెట్టుకు తొంగుని, దాని కళ్ళల్లోకి సూత్తా కూకోడానికి మొగోడికి యీలవుతాదా ? తనేవన్నా గట్రాటకి కట్టిన దూడేంటి ? పెళ్ళి అయితే మట్టుక్కి గోడకొట్టిన మేకా ? మొగోడు తిరక్కసెడ్డాడు. ఆడది తిరిగి సెడింది !

మొగోడి మనుసులు వొయిసుమల్లితే పోతాయి. ఆడ దానికి అల్లాగా ? పెళ్ళయిన కొత్తలో మొగుడిమీదా, పోతే పిల్లలిమీదా, యింకాపోతే సొమ్ములుమీదా—అల్లాగల్లా మోజులు మారతా ఉంటాయి.

ఆడి పెళ్ళి బాలంసుగారి చేతిమీదగానే అయింది. లగ్గం నాడు రేతిరి లెగిసిలెగిసి గుండెంత కొట్టుకున్నాదనీ? ఉండబట్టలేక పెళ్ళిపీటమీదే దాని సిగ తడువుదారనిపించలేదో ? ఏ పొద్దే లకీ పెద్దోళ్ళు దాన్నొదలకపోతే గుండి గుబగుబలాడి పోలేదో? దాని సెవులో కతలు సెప్పి కళ్లు మెరిపిచ్చాలనిపించింది కాదో? ముచ్చటయిన పదాలు పాడించి సెవులారా యినాలనిపించ లేదో ?”

అయితే మట్టుక్కి పట్నంలో యాపారం సేత్తా ఉన్న ప్పుడు ఎనకట్లా ఉండడానికి యీలవుతాదా ?

## 7

ఓ డాబా యింటికాడకెళ్ళి ఆగా రాళ్ళు. గుమ్మం తెరిసే ఉన్నాది కాని, తెరోటి అడ్డం ఉంది. కిటికీలికూడా రంగు గుడ్డలు కట్టిఉన్నాయి. ఆటికెనక ఏదో కదిల్నట్టయినాది.

ఎంటనే గల్లుమంటా గాజులు సప్పుడయినాయి. ఆ గాజులున్న సేతులు తన గుండిలు మీదే గల్లుమన్నట్టు అనిపించింది ఎంకన్నకి!

ఎవుర్నీ పిలువకండానే, బద్రయ్య సెరసెరా లోనికి నడిశాడు.

ఎంత దయిర్నెం! ఆడకూతురొక్కత్తీ ఉన్న యింటోకి! మొగోళ్ళని పిలక్కల్లేదూ?

"ఆళ్ళకాడ సనువుందేవో!" అనీ అనుకున్నాడు. "ఆళ్ళ మొగోళ్ళు ఏం అనుకోరేవోఁ!" ఏవఁయినా బద్రయ్య గొప్పోడు గందా మరి, ఆడి కసలడ్డు సెప్పేవోళ్ళున్నారా? అని.

తను గొప్పోడు కాడు కనక ఎంకన్న ఎలపలే నిలుసున్నాడు. తెలీని ఆడోళ్ళున్న యింటోకి ఎల్లడం సిగ్గూ అనిపించింది. లోన కెల్లినోడల్లా మల్లా ఎనక్కొచ్చి యీణ్ణికూడా రమ్మన్నాడు బద్రయ్య.

గొప్పోళ్ళ యింటోకి తనలాంటోడు ఎల్లొచ్చా? మరి ఆడు రమ్మంటున్నాడాయిరి! ఎల్లపోతే బావుండదేవో? గొప్పోళ్ళని కలుసుకోడం తనకీ మంచిదేగా!

బయ్యం బయ్యంగానే ఎల్లాడు. కిటికీ కాడ యిందాకా కనిపించిన ఆడది లోనకెళ్ళిందా, లేదా అని తొంగిచూసి మరీ ఎల్లాడు.

"పర్వాలేదు, రండి. కూసోండి!" అంటా నవ్వుతా కురిసీ సూబిచ్చిందా కుర్రది.

తెల్లటి సిలుకుసీర కట్టుకున్నాది. నల్లటి జుత్తు, పొగడ రంగు కుందేవోఁ తెల్లగా కొట్టొచ్చినట్టు కనిపిస్తా ఉన్న మొగవూఁ, మిలమిల్లాడతా వున్న కళ్లూ, నాజూకు వోళ్లూ!

దాన్ని సూడ్డంతోటే, ఆరోజు వున్నవేఁవోనని అను వాఁనవొచ్చింది ఎంకన్నకి!

"సెంద్రకాంతం అదేనేవోఁ?" అనుకున్నాడు.

"లోన సీరగట్టుకుంటన్నాది—ఇప్పుడే వత్తాది కూకోండి!" అన్నాదది.

అంతగా సెబతావుంటే ఏవఁన్నా అనుకుంటాదేవోఁనని ఓ పరుపుల కురిసీలో సతికిలపడ్డాడు ఎంకన్న. ఉగ్గబెట్టుకునే కూకున్నాడు. బద్రయ్య కూకోకుండా, గోడలమీదున్న బొమ్మ లొంక సూత్తన్నాడు. ఎంత సారవైనోడో!

ఆ గదిలో నాలుగు కురిసీలున్నాయి. ఓ పక్క పొడు గాటి బల్లున్నాది. గుమ్మానికి కెదరగా యింకో మేజాబల్లున్నాది. దానిమీద "బాల్రాజు" పుటో ఉన్నాది. గోడకొట్టిన పెద్ద అద్దం కూడా ఉన్నాది.

"తన మొకం దాంటో ఎల్లాగుంటాదో? అన్ని అద్ద ల్లాంటిదామరి? సూసుకుంటే బావుణ్ణు!"

గోడల్నిండా సినేవాఁటాక్ల బొమ్మలున్నాయి. ఆడో ళ్లయీ ఉన్నాయి. ఒకళ్ళ వోళ్లో ఒకళ్ళు తలెట్టుకున్నట్టూ, పూలసెట్ల సుట్టూ తిరుగుతన్నట్టూ, బుజం బుజం ఆనిసి ఎద రెదరగా నిలుసున్నట్టూ రకరకాలు బొమ్మల్లో యీళ్ళూ ఆళ్లూ కూడా ఉన్నారు. శివుడి ఏసంలో ఉన్నవోడికి దణ్ణవెఁడదారని పించింది ఎంకన్నకి. మిగిలినోళ్ళు, "రంబల్లాగున్నారు!" అను

కున్నాడు. రంబల్ని తను ఎసుగున్నట్టు! అంత అందవైఁనోళ్ళ బొమ్మలు యింతకు ముందు సూడనందుకు సిన్నదనవఁనిపించి దానికి.

ఈ లోగిలి పెద్ద జవీందార్లదేవో? మొగోళ్ళంతా పెద్ద సదుగు సదూకునోళ్ళా, ఆడోళ్ళంతా అందాల బొమ్మలూ నేవోఁ?

అంత గొప్పోళ్ళు బద్రయ్య కెలా తెలుసునబ్బా? బుర్రలో సురుకు వాలునోడు మరి, ఎవుర్నయినా బుట్టలో ఎయ్యగల్డు. ఆడూ గొప్పోడే గందా!

ఎంతటోడు కాకపోతే యింత మరియాదగా లోనకి రమ్మంటారు? మెత్తటి పరుపులున్న కురిసీల్లో కూకోవంటారు? ఆడితో బాటూ తన్ని కూడా ఎల్లా చూశారనీ?

ఇంతట్లోకే, మల్లిపూవులాటి సీరకట్టుకున్న, మెరుపుతీగ లాటి సిన్నది గుమ్మవుఁలోకొచ్చి తొంగి చూసింది. అదే టయి వుఁకి సరీగా ఎంకన్నకూడా అటే సూత్తావున్నాడు.

దాన్ని చూసి ఎంటనే బుర్ర వొంచేసుకున్నాడు ఎంకన్న.

బద్రయ్య బుర్ర అక్కళ్లేదు. ఆణ్ణి పిలాడానికి యీడి నోరు పెగల్లేదు.

అదింకా అల్లా సూత్తానే ఉన్నాది. యీణ్ణే గుచ్చిగుచ్చి సూత్తన్నాది. అది కట్టుకున్న సీర సన్నటి నడుంకాడ బయంగా అంటుకుపోయి, పోయి పోయి సుట్టూ తిరిగొచ్చి, గొప్పోడి సూపులా పైకి లెగిసి, ఎడల్పుగా ఎనక్కి వాలిపోయింది! మొకంలో సొవం చాయకి తక్కువ రంగు మటుక్కి కాదు.

కొంచెప్పుపాలిపోయి ఉన్నాది. పెదాలు సప్పగా కదల్తున్నాయి కళ్ళకి కాటికి లేదు, జుత్తు ముడేసుకోలేదు. నల్లజండాలా ఎనక్కి ఏలాడతా ఉన్నాది.

దాన్ని సూడ్డంతోటే సీకి మీద కలిగిన మోజు ఆసికి మనిసి మీద కలగలేదు! తరవాత్తరవాత మనిసీ నచ్చింది.

రెప్పలొల్పకండా అదింకా సూత్తానే ఉన్నాది. దాంతో ఆడోళ్ళు సిగ్గులో ముడుసుకుపోయినాది.

'పరాయి మొగోడుగందా', ముక్కూ మొగవూ తెలీదుగందా, పైపెచ్చు ముమ్మరవయిన ఈడులో ఉన్నాది గందా—తనకేసి అల్లా సూత్తాదేవా? అంటా అనువానవూ కలిగింది. పెద్దమనిసి తరాకోసరం ఆడయితే మొగం తిప్పేసు కున్నాడు.

"సదూకున్న గొప్పింటి ఆడోళ్ళంతా యింతేనోవో?" అనీ అనుకున్నాడు.

బద్రయ్య యిదేం సూడాపోడంతో ఆడు వంటిగాడిలా యిబయిల్లాడాడు. ఆడి మోసేత్తో ఆణ్ణి పొడిసి, గుమ్మంకాడికి సూబిచ్చాడు. యిద్దరూ ఒకేపాలి చూశారు. కాని ఆ సిన్నది అక్కడ లేదు. ఎంకన్న తెల్లమొగం ఏశాడు. బద్రయ్య నవ్వాడు.

"అంత తొందరెందుకు ఎంకన్నా? ముత్తాబు జేసుకుని రానియ్యి, సూద్దూగాని!"

ఎంకన్న మల్లా సిగ్గుపడ్డాడు.

పక్క గుమ్మంకాడ ఎవురో మొగోడి మాట యినిపించింది. తొలిసారి కలిపించిన కుర్రది మల్లా లోనకే రాలేదు.

అంతలోకి సెందరకాంతం వొచ్చింది. సన్నగా వచ్చి బద్రయ్య భుజంమీద వొయ్యారంగా చెయ్యేసింది. ఎంకన్న నోరెళ్లబెట్టుకు సూత్తన్నాడు.

"ఇందాక గుమ్మంలో నిలుసుని, సూదిలా తనెంపు చూసిన చిన్నదేనా సెందరకాంతం!" అనుకున్నాడు. ఇందాకటి కంట యిప్పుడు సాలా మారిపోయింది.

మొకంలో కొత్త రంగు ఎలుగుతా వుంది. కళ్ళు సెక్రాల్లా మిలమిల్లాడతా ఉన్నాయి. జుట్టు ఉల్లుకొని రొండు జళ్ళేసుకున్నాది. ఊసిడు మల్లెపూల దండ తల్లో దూపుసుకున్నాది. దండ కొసలు రొండూ, యీ ఎంపూ, ఆ ఎంపూ బుజాలమీద వోల్తా ఉన్నాయి. సెవుల దుద్దులు వొజ్జిరాల్లా తలతల్లాడుతున్నాయి.

'ఇందాకా, పాలిపోయినట్టు కనిపించిన మొగమేనా యిది?' అనుకున్నాడు ఎంకన్న.

ఇది మనిసా? వూరవసా? గొప్పింటి పిల్లా? సినేమా బొమ్మా?

ఆకే సూపూ, మాటా— అన్నీ అదే మింగేసింది!

ఎంకన్న మనస్సులో ఏమో మనుసులూరి పోయాయి. గుమ్మంమంటూ మత్తెక్కిస్తావున్న ఆ వోసన్ల వరదలో కాలవలో గడ్డిపోచలా కొట్టుకు పోతన్నాడు.

బతికున్న నాల్లోజులూ - బయాలూ, బాదలూ, సీదరింపులూ, మోసాలూ, సెడ్డపన్లుకూడా సెయ్యాలన్న తెలింపూ, ఉన్న మనుషులికి - బూమ్మీదుండే వయ్యారాలన్నీ కళ్ళారా చూసే అదురుట్టం ఒక్కసారేనా దొరుకుతాదా!

కడుపు నిండని కూడూ, గొంతుకు తడవని దాగం, గుండెల్లోంచి నవ్వని పెళ్ళాం, ఎంతవున్నా పండని ఎగసాయం తనమీద తనకే దయిర్నెం లేకపోవడవూ – అన్నీ మరిసి పోయి, తన్నతాను మరిసిపోయి, తియ్యటి పెదాలమీద పాకే పచ్చని నవ్వులాగ, బతుకు మొత్తంమీద రొండు సిటికిలేనా సన్నాగా గడిపే శాన్సు ఎంతమంది కొస్తాది?

రొండు జావులేళ, సూరీడు నెత్తికాలిసేతావున్న ఉసికె పర్రలో, సల్లటి నీల్లగుంట ఎంతమందికి దొరుకుతాది?

పెపంచంలో ఉన్న అందాలు చూసే కళ్ళులేక తియ్యగా సప్పరించి దాగాలు తీసుకునే నోరులేక, గుమ్మనీ వాసన్ను పీల్చుకునే తీరికలేక, ఎవురేనా కమ్మని పదం పాడతావుంటే ఇనే సెవుల్లేక – బతుకులో ఏం చూసుకుని సంతోసించాలో తెలుసుకోలేక – మనుసులు, కాలం మల్లకండానే గున్నోళ్ళా! చెవిటోళ్ళా, ముసలోల్లూ అయిపోయి కాటికి కాళ్ళు సాత్తాను, అసలు ముసలోళ్ళయిపోతేకాని ఆళ్ళ సంగతి ఆళ్ళకి పట్టదు! అప్పుడు నోరకనియి తెలుసుకునే సప్పరించుకుంటానికి ఆళ్ళ నాక కలుకూడా సెప్పినమాట ఇనవు. కోపవొచ్చి కొరుక్కుందా మంటే పళ్ళు అసలే వుండవు!

"ఈ రొవురు ?"

మొకవు అడ్డంగా తిప్పి, కళ్ళు వొంకరగాచేసి, నడుం కుసింత పక్కకి కోల్చి, మోసెయ్యి ఆడి బుజంమీద ఆనిసి, అరిసేత్తో ఆడి గెడ్డం పైకెత్తి అడిగింది సెంద్రకాంతం.

ఎంకన్న గుండి తపతపలాడింది. సన్నంగా నవ్వాడు బద్రయ్య.

"మావోడేలే! ఎంకన్న. నిన్ను సూబిద్దారని తీసుకొచ్చా!"

"ఊఁ!" అంటా మొకం తిన్నగా తిప్పిందది.

తేలిగ్గా నిలుసుని దాని బుజమ్మీద చెయ్యేశాడాడు.

ఎంకన్న సిగ్గు పడ్డాడు.

"దండాలు మావయ్యగోరికి!" అన్నదా సిన్నది.

అప్పుడేం మాటాడాలో తెలీలేదాడికి. ఎర్రిగా ఓ సిన్ని నవ్వులాంటిది నవ్వాడు.

"సెందరకాంతం బోగందా?" అనుకున్నాడు.

ఎనకోతడవ, ఆడి సిన మేనమావఁ బావ్మరిది కొడుకు పెళ్ళిలో బోగం మేళం చూశాడు. ముందల, అసలు పెళ్ళి కెడదావనుకోలేదు కానీ, మఁరమండోళ్ళ మేళం పెట్టిస్తన్నారండంతో, అదెల్లా గుంటాదో సూదావఁని మనుసయి, బోలిడు డబ్బు కరుస్సేసుకుని పెళ్ళికెల్లాడు. సిలుకు లాల్చీ లోళ్ళంతా ముందరే కూకున్నారు. మీసాలు తడుఁకుని మొగతనం గురుతుకి తెచ్చుకున్నారు! ఆడు ఎనకే కూకున్నా, ఓ సిలకలాంటి సిన్నది జనాన్ని తోసుకొచ్చి, ఆడిసేతిలో తాంబోళం పెట్టింది. ఆడి కెంతో సిగ్గయింది. గెడ్డం కింద గందంరాసి, సెక్కిలి మీద సిటికేసింది. అప్పుడు ఆ తాంబోళం ఏం చెయ్యాలో తెలీలేదాడికి. అటూ యిటూ చూశాడు. అందరూ తలో అర్ధ రూపాయీ పెట్టి తిరిగిచ్చేశారు. అంత తక్కువ మొత్తం పదిమందిలోనూ యియ్యడం యిట్టంలేని వోళ్ళు తాంబోళం మడిసి జేబీలో పెట్టుగుని, అది యిచ్చిన బుల్లెమ్మని పిలిసి గుట్టుగా సెవుల్లో ఏదో వూత్తావున్నారు.

ఆడూ అదే సేద్దావఁనుకున్నాడు. కాని, దాని తాంబోళం, అద్దనా యిలవచేసీ తాంబోళం, తన దగ్గరే వుంచుకోడం మంచిది కాదనుకుని, ఓ రూపాయి ముడుపు సెల్లించుకుని దాంది దానికిచ్చేశాడు. ఆ సిన్నది నవ్వుతా అందుకుని, మెడ కింద కితకిత లెట్టింది. పైపెచ్చు అన్నాది గందా "నీ సోకుకి నేను తగనేంటి మావాఁ ?" అన్నాది.

ఆ మాటలో గుట్టు ఏంటో ఆడికి యిప్పటికీ కొంచెం అనువానవేఁ !

"బోగవోళ్ళ మాటలు తెలుసుకోడం కట్టవేవోఁ?" అనుకున్నా డెంకన్న.

"లోన కూసుందారి రా మావాఁ!" అంటా ఎంకన్న సెయ్యి పట్టుకుంది కాంతం.

ఆడి నరాలు జిలజిల్లాడాయి. అయినా కానీ, ఆ సెయ్యి మెత్తగానే వున్నాది. సల్లగానూ ఉన్నాది. ఈడి రగతం ఉడుక్కి దాని రంగు కరిగిపోయిీాలా ఉన్నాది.

బద్రయ్య యీాళ్ళిద్దరికంటా ముందే ఎల్లి, తిన్నగా మంచవెక్కి కూకున్నాడు.

ఎంకన్నని సోపాలో కూకోబెట్టిందది. కూకున్నాడు.

తెల్లటిపక్కా, దానిమీాద సెదిరిపోయిన మల్లిపూలూ, పక్క కిందున్న పరుపు మెత్తటిదే అయుండాల. దానికింద పందిలి మంచం! ఆటన్నిటి మీాదా, గది మీాద దొరలా బద్రయ్యా!

గాజులు గలగల్లాడించుగుంటా నడిసి అలమారు కాడి కెల్లిందది.

"నే నిక్కడుండగా అలమార్లో ఏ వుందే ఎర్రి మొగవా?" అన్నాడు బద్రయ్య.

"నీకోసవే!"

రంగు రంగుల గుడ్డమూటలిప్పి, ఎర్రటి సీసాకాయి ఎల పలికి తీసింది.

పక్కగదిలో పోలీసోడున్న అలికిడీ లేదు!

బద్రయ్య యిరగబడి నవ్వాడు. సొగసుగా నవ్వింది కాంతం!

రంగు సోడాయేవోఁ? అనుకున్నాడు ఎంకన్న

పొట్టిగా వున్న గళాసులు మూడు తెచ్చి సీసా మూత యిప్పింది.

గుప్పుమంటూ వోసన గదినిండా కొట్టినాది.

"సారావాఁ?" అనుకున్నా డెంకన్న.

అగ్గితే?

కాంతం నవ్వితే?

పోలీసోళ్ళు రారుగందా?

మూడిటిలోనూ కొంచెం కొంచెంపోసి, ఇంకో సీసా లోంచి యింకోటేదో తీసి కలిపింది.

బద్రయ్య సటుక్కుని మంచంమీంచి వురికి దాని సేతిలో సీసా అందుకున్నాడు. తన గళాసులో నిండా పోసు కున్నాడు. సాంతంగా మల్లా మంచం నడేన్నెక్కి కూసున్నాడు.

కడవాఁ రొండు గళాసుల్తోనూ ఎంకన్న దరికొచ్చింది కాంతం. ఆడు పట్టుకోబోయాడు. అది వొదల్లేదు. తన గళాసు బల్లమీదెట్టి రొండోది తెచ్చి ఆడి పెదాలకి అందిచ్చి "ఊఁ!"

అన్నది. గళాసు కేసీ, దాని మొకం కేసీ చూసి, పెదాలు నాచి సప్పరించాడు ఎంకన్న.

ఒగురుగా వుంది కానీ, గొంతుకులోకి ఎళ్ళడంతోటే మంటెట్టింది. “లోనకెళ్లాక యింకా ఎంత మంటుడతాదో?” అనుకున్నాడు. ఆడి పక్కనే సోపామీదానుకుని కూకుని కాంతంకూడా తన గళాసులోది తాగేసింది.

మళ్ళా వొచ్చి బద్రయ్య యింకో గళా పోసుకున్నాడు.

సోపామీద వొంకరగా వాలి, ఎంకన్న కేసి సూత్తా అలాగే కూకున్నాది కాంతం! “బద్రయ్య ఏం అనుకున్నాడో గందా?” అనువాన వొచ్చింది ఎంకన్నకి.

కొంచెం సేపయాక ఎంకన్నకి కడుపులో ఏదో దేవేస్తన్నట్టనిపించినాది. నరాలు పొంగుతా వున్నాయి. తల తిరుగుతన్నాది.

బద్రయ్యొచ్చి, దాన్ని సెయ్యట్టుకులాగి, నడుం సుట్టూ చెయ్యేసుకున్నాడు.

సోపాలో కూకోలేక తూల్తా ఎలపలి గదిలో కొచ్చి బల్ల మీదికి వొలిపోయాడు ఎంకన్న. ఎప్పుడో కాని, నిద్దరే పట్టేసింది.

ఓ రేతి రేల—జుట్టు పై కెగదోసుకుంటా యీడి గదిలో కొచ్చింది సెంద్రకాంతం.

ఆడింకా నిద్దట్లోనే ఉన్నాడు.

దానికళ్లు చింతనిప్పుల్లాగున్నాయి. చేతులు వొణికి పోతన్నాయి. ముకం వృబ్బరించింది.

ఆడి దగ్గరికొచ్చి గుండిలిమీద చెయ్యేసింది. ఇటూ అటూ కదిపింది. లెగలేదు. ఆడి జుట్టులో ఏళ్లు దూరిసి తనెంపుకి తిప్పుకున్నాది.

సగం కళ్లు తెరిశాడు. సెంద్రకాంతాన్ని చూశాడు. లెగిసి కూకుందా రనుకున్నాడు. చేతులూ, కాళ్ళూ సెప్పిన మాట యిన్లేదు. మళ్లా కళ్ళు మూసుకున్నాడు.

సెంద్రకాంతం ఆగలేకపోయింది. ఆడి మొకంమీద మొకవెట్టింది.

ఎంకన్న కళ్లూ, పెదాలూ సురుగ్గా కదిల్నాయి.

ఎసకాతలే బద్రయ్యొచ్చాడు. తూలుతా వొచ్చాడు.

"పాపం నిదరోతన్నాడు, లగ్గొట్టకే! అంటా బుజా లట్టుకుని లెగదీసుకుపోయాడు దాన్ని.

# 8

రవణయ్య మావ పెళ్ళాం మళ్లా నీళ్లోసుగున్నా దంట! ఎంతమరట్టం! ఆడంటే దానికి ఎంత గొప్పో! సిన్నోణ్ణి తీసుకొచ్చి ఎంత వొయ్యారంగా అందిస్తాదనీ? ఓరబ్బ! యీ బూమ్మీద యింకెవ్వరూ పిల్లల్నే కనలేదా?

పిల్లల వూసు తలుసుకున్నప్పుడు దాని గుండె లోనకే దించుకుపోతాది. తనకీ జనంకి ఆ రాత లేదేమో? ఉసురుసు రనిపిస్తాది. సీకట్లో కొంగేసుకు పడుకుని బూదేవమ్మని కరిసి పెట్టుకుని ఏడుస్తాది. ఆ కన్నీళ్ళతో అబిసేకాలు చేస్తాది.

"ఏవేఁ ! పిల్లా ! మనవణ్ణెప్పుడిస్తావే ?" అంటా సెరువు కాడ పుల్లమ్మ నిలేసి అడిగినప్పుడు ఎంత సిగ్గేసుకొచ్చిందనీ ? అబ్బబ్బ ! కళ్లూ కుట్టినాయి.

"ఆ రేళ్ళనించి కాపరం సేత్తన్నా, దీనికి కడుపు గాకా ఓ కాయన్నా కాయదేవేం ?" అంటా గుసగుస లాడుకోలేదో?

లగ్గవయిన తొలిరోజుల్లోనే నీళ్లోసుగున్నోళ్ళు ఎంత మంది లేరూ ? సంవచ్చరాది పండుగ రోజుల్లో పెళ్ళయిన సీతమ్మ పున్నిమాసవుల్లో పండంటి బుల్లోణ్ణి కనలేదో ?

'తనకారా తేప్పంటే యింకేం ?' అనుకున్నాది రావులమ్మ. ఏడిసేడిసి కళ్ళు వాసిశాయి కూడా. బొట్టు కరిగిపోయింది. వాళ్ళంతా తేవఁ తేవఁయినాది.

ఓనాడు పొలంకాడ గంగయ్య అన్నాడు గందా—

"సిలకలాంటి పెళ్లాన్ని యింటో యిదిలి ఆడు పట్నం సుట్టూ తిరుగుతాడేవేం ?"

ఏం చెబుతాది ? పాయిలోకి రొండు సిటుకు లేసుకుని మాటాడకుండా అల్లాగే ఎల్లిపోయింది.

మొగరాజు ! ఆడికేవంట ! నలుగురి నోళ్ళల్లోనూ పడీది తను ! ఆడల్లా మారిపోబట్టే తనందరికీ లోకువయినాది. లేపోతే—రవణయ్య మావఁ పెళ్లాంలాగ—ముగ్గురు పిల్లల్ని కని ఉండొద్దో ?

సత్తెమ్మ పుట్టింటి కెడతన్నాదంటే సూట్టాని కెల్లింది రావులమ్మ. 'సన్నగా సింతబరికిలాగుండేది, దాని కెంత వొళ్లొచ్చిందో ?' మిసమిసా నిగారింపొచ్చినాది. ఓరబ్బ ! నవ్వితే సాలు, సెక్కిట్లో గుంటలడతన్నాయి !

ఇన్నేళ్లొచ్చినా కూడా ఆడికంత సిగ్గులేదోపోఁ? గట్రాటలా తను నిలుసుండగానే పెళ్లాం సెయిప్పట్టుకుంటాడా? సెక్కిలిమీద సిటికేస్తాడా? తనకే వుందా పెళ్ళాం? మిగిలినోళ్ళు అల్లా బరితెగించరేం? బెల్లమ్ముక్కయితే కొరుక్కుని తినరాదో?

ఆళ్ళ పరాసకాలు సూత్తావుంటే దానికి ముచ్చటా అవుతాది. అలాంటి మొగోడు మొగుడయితే నూకాలమ్మ తల్లికి నిలువుదోపిడీ యివ్వకపోయిందా? కొడుకుట్టాక ఆడికి నూకరాజని పేరెట్టదో? ఏవనుకుంటే మట్టుకి ఏం లాబం? యీ జన్మకి ఆ రాతుంటేనా!

# 9

బారెడు పొద్దెక్కాక, వోటేల్లో సందడి ఎక్కువ కాడంతో ఎంకన్నా, బద్రయ్యా లెగిసి కూకున్నారు. పందుం పుల్లలు నముల్తా ఎల్లి మొకాలు కడుక్కుని గోదాట్లో యీతాలాడ్డారిద్దరూ.

వోటేల్లోదే కుసింత పలారం చేసి పైమీన గుడ్డేసుకుని బద్రయ్య ఎక్కడికో ఎల్లిపోయాడు.

సెరబయ్య గల్లాపెట్టికాడ కూకున్నాడు. ఏం చెయ్యడానికీ తోసలేదు ఎంకన్నకి. ఒటేల్లోంచి లెగిసొచ్చి గుడిసికాడ కెల్లాడు. ఎవ్వాడో లేదో. అమ్మ పెత్తిలా యిసుసుకుపడ్డాదది.

"ఆడితో కలిసి తాగడానికెల్లక మళ్లా ఎందుకొచ్చావ్?" పై పేనాలు పైకే పోయినాయి ఆడియి.

'రేత్తిరి తాగొచ్చినట్టు దీనికెల్లా తెలిసిందో?' అను కున్నాడు. ఇంకా ఏదో అనుకోబోతావుండగానే పటాల్ని తలు పేసేసిందది. దాంతో ఎవక్కీ తిరిగొచ్చేసాడు. రాడం రాడం వూళ్లోకే వొచ్చేశాడు.

కాలు కాలిన పిల్లిలా తిరుగుతూండేతలికి ఆడికి ఆవాస వొచ్చింది. మద్దినాల రొండు జావుంలేలకి మల్లా సీతాంచ్చీం వోట్లోకొచ్చాడు.

పనోళ్ళు తినగా మిగిలినోణ్ణవూం, కూరా తెచ్చి బల్ల మీాద నో ఆకేసిపెట్టారు. బల్లమీాద తిండం అలవాటు లేదేమోం నేలమీాదే కూకుండా పనుకున్నాడు. 'ఆల్లేం అనుకోరుగందా?' అంటా అనుమానం రాడంతో మల్లా ఆ వూసెత్తలేదు.

ఒణ్ణం తిని మల్లా వూళ్ళోకి ఎగబడ్డాడు. తెగ తిరిగాడు. సీకటికూడా పడిపోయింది.

కానీ — సెంపరకాంతం యిల్లు నెలక లేకపోయాడు. ఉసూరు మనిపించింది.

పొద్దున్నుంచీ బట్టిసుక్క ఏవయ్యాడో? ఆడుంటే ఏ బాదా వుండేది కాదు. దాన్ని బంగారంగానూ, అది పట్టు కోడం యింత కట్టవని తెలిస్తే తొలిసారే కుసింత జాగరతగా చూసుండేవోడు. ఇటూ అటూ దిక్కులు సూత్తా నడుస్త న్నాడు. తన గుండిలు దాని పిడికిట్లో బిగించేసి, అది అంత బలంగా లాక్కుంటాదని ఆడు కల్లోకూడా అనుకోలేదు. తన ఆరాటం సూత్తే తనకే సోద్దెమయినాది.

ఆ డబులు పట్టుకుందాకొచ్చాడు? యాపారం కోసరం. ఇప్పుడల్లా తిరుగుతున్నాడేం మరి? మజా కోసం. ఎక్కడ

దొరుకుతాది? కాంతంకాదు. అది తన్ని వొల్లసంటే? అది అందుగా! తన్ని దరిసి కూకోబెట్టుకుని ఎప్పుడూ కళ్ళల్లోకి సూత్తా వుండిపోతాదా?

ఆ అనువానం మట్టుక్కి తీరేదాడికి. సద్దా అన్నది ఎల్లాంటిదయినా సరే, రొండు సిటికిల్లో కరిగిపోయేదేనా సరే, బతుకు మొత్తంలో ఆ రొండు సిటికిలయినా బాదలన్నీ యిది లేసి, గుండిలిమీద చెయ్యేసుకుని, మనసులో అమురుతం నింపుకుని, మెత్తటి దాని సేతులు తన సేతుల్లో దాసుకుని, కళ్ళు సగం సగం తెరుసుకుని, తన్ని తను మరిసిపోతే సాలు!

ఎన్నిఏల పుట్టుకులికయినా అందరికీ ఆ అమురుట్టం వొస్తాదా? వొచ్చినోళ్లు యిడుసుకుంటారా?

బద్రయ్య తన కళ్ళు తెరిపిచ్చాడు. బతుకంటే ఏంటో నిజంగా సూబిచ్చాడు. మనుసులందరిలోకి తన్ని గొప్పోణ్ణి చేశాడు.

కొంచెం కొంచెం తటపటాయించి, నడుస్తావున్న యీది కొసని నిలుసుని బీడీ కాలుస్తా నిలుసున్న వో సోగ్గాడి నడిగాడు—

"సెంద్రకాంతం యిల్లెక్కడా?"

"ఏవయ్యా! నీకు సెంద్రకాంతం యిల్లే కావాలీ? దాని జోలికెల్లావంటే బద్రయగాడు ఎవుక లిరగ్గొడతాడు! తెలిసిందా? అంతకంటే సినేవా టారుల్లాంటోళ్ళను సూబిత్తా, ఏవిత్తావ్?"

ఎంకన్నకి చిరాకేసింది. ముందలి కెల్లిపోయాడు.

బద్రయ్యకీ తనకీ ఎంత స్నేయితవున్నాదో యీడికేం తెలుసు? పట్నం సురుకుదనవంతా ఆడు తనకాడే సూబిద్దా రనుకున్నాడా? తనేవన్నా కొత్తోడు కనకనా?

కోసుకున్న వారం తీరిప్పుడుగానే ఎంకన్న కళ్ళకి ఓ డాబా యిల్లు కనిపించినాది. అదే గుమ్మం తెర, కిటికీలు అవే!

జోరుగా మెట్లెక్కి లోనకెల్లబోయాడు. లోన, ఓ మొగోడూ, ఆడదీ కలిసి నవ్వుకుంటా వున్నట్టనిపించినాది. టక్కున ఆగాడు.

ఎనక్కి ఎల్లిపోడానికి మనుసొప్పలేదు. ఇంతట్లో సెంద్ర కాంతవేఁ గుమ్మంకాడి కొచ్చింది. ఈణ్ణి చూసి మోజుగా నవ్వింది. "నువ్వా మావాఁ? లోనకి రా!"

ఆడెల్లలేదు. ఇంకో మొగోడుంటే ఎల్లడ మెల్లాగా? లోపలినించి దగ్గు యినిపించింది. కాంతం లోనకెల్లింది.

ఎవుఁడితోనో మాటాడతన్నాది.

బద్రయ్య లోనున్న సంగతి పాపం, యీడికేం తెలుసు?

"ఎంకన్నేనా?"

"అవును."

"దాని గదిలోకి పంపిచ్చు!"

"పోలీసోడొచ్చి దానికోసం యిందాకటినించి పడిగాపులడి కూకున్నాడు మావాఁ! అది కనిపించాపోతే ఆడు పోడుసుకు సావడో!"

"నన్నెల్లిపొమ్మంటావా?"

"అంతమాటే?" అంటా ఆడినోరు నాలుగేళ్ళతో సొగుసుగా మూసింది.

"మరయితే ఆణ్ణే పొమ్మను!"

"కొత్తోడుకదా మావాఁ?"

"కొత్తో యింతా, పాతో రోతా, కొత్తో తోనే కులుకూ!" అంటూ లెగిశాడు.

"ఎక్కడికి మావాఁ?"

"నే నెల్లిపోతా!"

ఆణ్ణి రొండు సేతుల్తోనూ సుట్టేసింది కాంతం.

"నువ్వెల్లిపోతే నే సచ్చిపోనో?"

"ఆడ్నో?"

"ఆసిపడొచ్చినోడు మావాఁ?"

"ఏం టన్నావ్?" కోపంగానే అన్నాడాడు.

నీరసంగా నవ్వినాది కాంతం.

"ఆడిమీ దంత మనసయితే ఆణ్నే చుట్టేసుకున్యాసో రాదో? నీకూ నాకూ యియ్యాల్టితో సరి!"

కాంతం ఆణ్ణి కదల్నియ్య లేదు.

"ఆడిమీద మనసు కాదు మావాఁ. జాలి!"

ఎంకన్న తిరిగొచ్చేతలికి వాకేలు మూసేసున్నాది! తలుపు కొట్టాడు.

లోన సీసాల చప్పుడినిపించింది.

కొంచెం తలుపు తెరిసి, ఎలపలికి తొంగిచూశాడు సెరబయ్య. ఎంకన్న కేసి చూసి యిరగబడి నవ్వి, టక్కుని లోనకి లాక్కుపోయాడు.

పైమీద గుడ్డ యిసుగ్గా యిసిరేసి, సొక్కా బొత్తాలు యిప్పుకున్నాడు ఎంకన్న. తలుపు మళ్లా గడియెట్టి వొచ్చాడు సెరబయ్య.

"తలుపు సప్పుడయితే పోలీసోళ్ళేవోఁ అనుకున్నా బెదరోఁ!"

ఆ డిసిపించుకోలేదు.

మూలన్ని దాచిన సీసా ఎలాగా ఎంపటకి లాగాడు సెరబయ్యా. తనకో గళాసులో పోసుకుని, ఆడికూడా కూరతంత పోసి యిచ్చాడు.

గడగడా తాగేసి పక్కనున్న కురిసీలో సతికిలబడ్డాడు ఎంకన్న. తనది తను తాగేసి రొండు బల్లు దగ్గిరి కీడుసుకుని ఆటిమీద ఎల్లగిల్లా తొంగున్నాడు సెరబయ్యా. కొంచెం సేపటిదాకా యిద్దరూ ఏం మాటాడుకోలేదు. సెరబయ్యకేం తోసిందికాదు.

"ఎక్కడికెల్లొచ్చావ్ బెదరోఁ?"

ఎంకన్న మాటాళ్ళేదు.

"సెంద్రకాంతం కాడికేనా?"

ఎంకన్న గుండె దుడుక్కుమన్నాది. కోపంగా చూశాడు.

"బద్రయ లోన కనిపించలేదో?"

గుండెల్లో కవ్వానెట్టి కదుపుతన్నట్టనిపించింది ఎంకన్నకి.

"అది మంచిదేకానీ, ఆడుమలుక్కి దాన్ని యింకోడికి దక్కనీడు. ఏవయినా, డబ్బు కరుస్సెత్తే రాంసవంద్రంలో ఆడోళ్ళకే కరువా ఎంకన్నా?"

ఎంకన్నకి వుక్కురోస వొచ్చింది. సెంద్రకాంతం బులిపించినట్టుగా ఆణ్ణి యింతదాకా ఎవ్వుత్తీ సూళ్ళేదు. అది మనిసి కాదు, దేవత!

ఎంకన్న బాధ సల్లారలేదు. సెరబయ్య వూ వోగుతానే ఉన్నాడు.

"తేలిగ్గా సెప్పాలంటే, ఎంకన్నా! ఉప్పూ, పులుపూ కలిపితే వూరగాయయిపోయి నోరూరిచ్చినట్టే, మొగోడూ ఆడదీ చూసుకుంటే మనసులు పుట్టుగొస్తాయి! ముక్కు-మూసుకుని జపాలు చేసుకునీ వోళ్ళకూడా, సిలకలాంటి సిన్నది కంట బడితే ఎగిరి గంతెయ్యరో?"

సెరబయ్య వోగుడు ఎంకన్నకి నచ్చలేదు. ఉండబట్టలేక 'సెరబయ్యా!, అంటా అరిశాడు.

"ఏం?"

"నోరు ముయ్!"

మూసుకున్నాడు. ఎంకన్న బుర్రలో ఆలోసన్లు గిరగిరా తిరిగి పోతన్నాయి. ఆడూ, బద్రయ్యా,—ఆడూ, బద్రయ్యా. కాంతవూ — ఉట్టి బద్రయ్యా, కాంతవూ — ఆకికి ఆడే మిగిలాడు.

గుమ్మంలో కెల్లాక రమ్మన్నదల్లా మల్లా ఎలపలికెందుకు రాలేదు? తనంటే కాంతానికి మనుసయినప్పుడు, బద్రయ్యకి ఉలుకెందుకో? ఆడు దానిప్పెట్టిన సొత్తెల్లాగవుతాది? అది మట్టుకూ, బద్రయ్య కెందుకు జరిసిందీ? తనుమాత్రవేం తక్కువా ?

"స్సీ! ఆ జాతే అంత !"

మనసిరిసేసాక దాని వూసెత్తడం తండే తప్పు! మురిపించి, మురిపించి మూతిమీద తన్నిరకం!

డబ్బుకీ, మనసుకీ సుట్టరికం లేదు. లచ్చలికి లచ్చలు కాళ్ళకాడ గుమ్మరించినా, యీ బూం పెపంచకవుంలో మనసిప్పి మాటాడేవోళ్ళు లేరు.

తన కోరికి సుట్టూతా అల్లుకున్న ముళ్ళకంచి సెంద్ర కాంతం! ఇంకా పాకితే నరకడానికి తయారుగా ఉన్న పదును గొడ్డలి, బద్రయ్య!

"రాయవంద్ర వెల్లబోకు

రంగు బట్ట కట్టబోకు—అంటూ పదం పాడతా ఉన్న సెరబయ్యకేసి వోడిగా సూశాడు ఎంకన్న. సటుక్కున లగిసి ఆడి దగ్గిరికి లగెత్తుకొచ్చాడు సెరబయ్య.

"సూడు ఎంకన్నా! దానిమీదే మనసు పడతా వెందుకు? కాంతాన్ని మించినోళ్ళు కోసుంటే కోటి మందొత్తారు. దాన్ని నువ్వు మరిసిపోకపోతే బద్రయ్యతో నీకెల్లాగా గొడవ తప్పదు. నీ యాపారం బుగ్గయిపోతాది. నీకున్న మనసులూ, నువ్వు కావాలనుకునీ సుకాలూ ఏయీ తీరకుండానే వూడబెరికి గోదాట్లోయిసిరేత్తాడాడు. మన్లో మనకి పోటీ లెందుకు ఎంకన్నా? మనవంతా కలిసి పనిసేత్తే అందరం గొప్పోళ్ళవయిపోవూం? నీసేతి కొత్త ఏపారవేదో సేయిత్తానని యీ యేలే బద్రయ్య సెప్పాడు! మా అందరికంటా నువ్వంటే ఆడికి మా సెడ్డ యిస్టవుం! ఆడి మనసిరిగిపోయిందంటే, నీకెక్కడా యింత మంచి నీళ్ళుట్టవు. మన్నసుట్టూ తిప్పికోడం తప్ప యిడిత్తే, అసలు ఆడోళ్ళల్లో ఏవున్నాదని అంట? మనకున్న సీవూ నెత్తురే ఆళ్ళకీ ఉన్నాది. మిగిలిన సొగుసులన్నీ మన్ని గుప్పిట్లో పెట్టుగోడానికే తెచ్చిపెట్టుగుంటారు. ఆళ్ళ

మాయిలో పడ్డావో, నీ కళ్ళకి పొరలు కమ్మేత్తాయి నా మాటిను! సుకవంటే ఆడోళ్ళల్లో లేదు బెదరూ! మన మనసుల్లో ఉన్నాది. రొండు సేతుల్నిండా డబ్బు గడించేదారి సూడు ముందు. అది దొరికితే లచ్చ సుకాలు దొరుకుతాయి! ఏవంటా?"

ఆడు మాటాల్లేదు.

"కొత్త యాపారం సేత్తావా మరి?"

ఈడి కేసి తిరగాలేదు.

"నీరసంగా ఉన్నదా? పోనీ రేపు మాటాడదారిలే! ఇంకో గళాసు ఏసుగుంటావేంటి?"

పక్కబల్లమీదున్న సీసాతీసి, సెరబయ్య మల్లా గళాసులో పోశాడు. ఈనారి ఎంకన్న గళాసు నిండా తాగాడు. సీసా దాసేసి మల్లా వొచ్చి బల్లమీద పడుకున్నాడు.

"ఆ కత్తికి రొండెంపులా పదునే!" అంటా గొనుక్కున్నాడు ఎంకన్న.

"ఏంటదీ?" మగతగా అడిగాడు సెరబయ్య.

మాటాడకండా, పొడుగ్గా మూలిగి ముందలికి వొలిపోయాడు ఎంకన్న.

తెలతెల వోరత్తా ఉండగా లెగిసి, మొకం కడుక్కుని, గోదారి రేవులో దిగి కడవలో నీళ్ళు ముంచుకొత్తా ఉన్నాది సీతమ్మ.

అప్పటికప్పుడే సానాసేపటి ఎనకే నిదర లేసి బద్రాద్రి రావయ్యకి మేలుకొలుపు పాడతావున్న ముసలయ్య పాట ఆపేసి దానికేసే సూత్తా ఉన్నాడు. పలాసని వొళ్ళూ, సన్నటి

సేతులూ, కోలమొకం, నున్నని సెక్కిళ్ళూ, సనసన్నగా సిను కులు రాత్రావున్న మబ్బుల ఆకాసెంలాగ తడి తడిగా నల్లటి జుట్టూ—

"ఏ దేవుడు తపస్సు చేస్తావున్నాడో దీనికోసం!" అను కున్నాడు ముసలయ్య.

దాన్ని సూత్తా వుంటే ఆడికి ఎనకటి రోజులు గురు తొచ్చాయి. రోజులు సజావుగా నడిత్తే, సిట్టికి మాత్రం తను పెళ్ళి చెయ్యాలిసినోడు కాడో? అది బతికున్నాదా? ఏనాటి కేనా ఆ బద్రాసెలం రావయ్య తన సిట్టిని తనకి సూబించక పోతాడా? ఈ జనవానికి ఆరాతున్నాదా?

సిట్టీ, సివయ్యా, సూరీ, రాజియ్యా!—ఆళ్ళ వూసు తలుసుకోడంతో ఆడి మొకంలో నెత్తురింకినాది.

ఆళ్ళెవురో, తనెవురో! పెళ్ళాం లేదు, బిడ్డలూ లేరు! సుట్టాలింక అసలే లేరు. రావయతండే ఆడికంతా! ఆయిన తప్పకండా కనికారం సూబిత్తాడు. ఈ ముసలితనంలో తన బాద లన్నీ మరిసిపోయి, ఆయిన సేవలోనే రోజెల్ల బెట్టుకుంటాడు. ఎప్పటికో దయ తలిసి, తన్ని యీ పాడు పెపంచకవులోంచి తీసుకపోయి ఎక్కడికో-ఎక్కడెక్కడికో, నీళ్ళులేని సవుద్రాలు దాటించి – గాలిలేని ఆకాసాలు తోసేసి, యింకా యింకా పైపైకి తీసికెళ్ళిపోతాడు.

అక్కడ, తన్ని ఎక్కిరిబించీ మనుసు లుండరు. మొగు ళ్ళని యిడిచేసీ పెళ్ళాలుండరు. కాళ్లు యిరగ్గొట్టే యుద్దా లుండవు. తన బతుకంతా దోసుకు తీసుకునే మోసా లుండవు. కూటికోసం చెత్తపన్లు సెయ్యక్కర్లేదు. పసువుకోసం అబద్దా

లాడక్కర్లేదు. పేరుకోసం అన్యాయాలు సేయ్యక్కర్లేదు. మోస గాళ్ళకి మొక్కక్కర్లేదు. ఇట్టంలేనిదానికి బలవంతం లేదు. మనసులో వోమాటా, ఎలపలి కింకోమాట ఆడతా నోటిని తాటిసెట్టి సెయ్యక్కర్లేదు. ఈ బూమిమ్మీదుండగా తను బతికిన సెండాలంబతుకు తలుసుకుని రోతపడక్కర్లేదు. ఆ సీరావం సెంద్రమూర్తి పాదాలకాడే వొలిపోయి ఆయినలోనే కలిసి పోతాడు. ఆడే ఆయినయిపోతాడు!

ముసలయ్య కళ్ళలో నీళ్లే వొరిగినాయి. అయివాంచేసీ లోగానే సీత మొచ్చి ఆడెదర కూకున్నాది. ఆడి కళ్లల్లోకే సూత్తా.

"ఏంటి తాతా?"

ఆడుమాటాడ లేదు. గబగబా కళ్ళు తుడుసుకున్నాడు.

"ఒంట్లో బాగో లేదా?

"ఊఁ హుఁ!"

"మనసులో బాదగా ఉందా?"

"నువ్వుండగా నాకు బాదేంటమ్మా?"

సీతమ్మ సన్నగా నవ్వింది.

పట్నోపడి కొట్టుకొచ్చిందాక్కీ, యుద్దంలో కాళ్ళిరగ్గొట్టు కుని వూళ్లంబడి తిరిగి తనకీ సుట్టరికవేంటి?

"ఇంతకాలం తను బతికున్నాడంటే దాని లాలింపు కోసవేఁనేమోఁ?" అనుకున్నాడు ముసలయ్య. బలవంతంగా తెచ్చుకుని నవ్వాడు. దాని మెడ నున్నగా, బోసిగా ఉన్నట్టని పించింది. ఒక్కవొంటిపేట గొలుసుంటే దానికి ఎంతంద వొఁచ్చేదో?

"కుసిన్ని గెంజినీళ్ళు తాగుదూగాని, లోనకిరా తాతా!"
ఆడు మాట్లాన్లేసు. వాడ్దనీ అసలేసు. కర్రవూతం తీసుకు నిలుసుని, రొంతో సెయ్యి దాని బుజమ్మీద్దేసుకుని, మెల్లగా అనుగేశాడు.

"ఈయేల గొలుస్సంగతి తేలిసెయ్యాలి!" అంటా గొనుక్కున్నాడు.

"ఏం గొలుసు తాతా?'

"నీ జిగినీ గొలుసు!"

గెంజి తాగి సెయి కడుక్కుని ఎడుసుకోంగోతావుంటే బద్రయ్య గుడిసిలో కొచ్చాడు.

సూదుల్తో పొడిసినట్టు చూశాడు ముసలయ్య. ఆటికి ఆడు ఆగలేకపోయాడు.

ముసలోడంటే బద్రయ్యకి బయవే! ఆడు తనతో ఎప్పుడూ ఎక్కువ మాటాడ్డు. మాటాడేదో, తన్ని సిత్తు చేసే డన్నమాటే! సూటిగా ఎల్లీవోళ్ళతో అదే గొడవ!

కాయిడీపెట్టిలోంచి సిన్న డబ్బా తీసి, దాంట్లో ఉన్న రూపాయినోట్లు కొంచెం ఎలపలికితీసి, మల్లా మూతపెట్టేశాడు.

ఎల్లిపోబోతావుంటే, ముసలయ్య పిలుపు యీపుమీద చరిసినట్లు అనిపించింది. ఎనక్కి తిరిగాడు బద్రయ్య.

"దాని గొలుసు దాని కిచ్చెయ్యరాదో?"

బోన్లో నిలుసున్న దొంగోడిలా సూశాడు బద్రయ్య.

"అది అమ్మేశాను!"

"మరోటి సేయించూ!"

గుమ్మానికి తగలకండా తలొంచుకుని ఎల్లిపోయాడు బద్రయ్య.

ఆడి లక్కీ-సాన్సు ఏవో తను అమ్మేసిన గొలుసులాటిదే దొరికింది. దరకోసం ఎనకతియ్యకండా ఎంటనే కొనేశాడు.

అది జేబీలో పెట్టుకుని తెస్తావుంటే, లోన గుచ్చుకుని గుండెలు గోకెట్టినాయి.

ఉసారుగా సొరబడ్డాడు. ముసలయ్య లేడు. సీతమ్మ కొప్పు ముడేసుకుంటా ఉన్నాది. ఈణ్ణి చూసి నిలుసుంది. ఎందు కన్నట్టు చూడనూ సూసింది. ఎందుకంటే, ముసలోడు లేనప్పుడు ఆడు లోనకి రాడానికి యీల్లేదు కనక!

'ఎందుకు సెప్మా?' అనుకున్నాది.

జేబీలో వున్న రంగులుపెట్టె తీసి, మూత తెరిశాడు.

దాని కళ్ళు జిగేలుమన్నాయి.

తనదే, జిగినీ గొలుసే!

అడక్కుండానే సేతులు ముందికి జరిగి అందుకో బోయాయి. కాని నిగ్గొక్కున్నాది.

సొగుసుగా దాని సేతికిస్తా, అన్నాడు గండా—

"బాగున్నాదా?"

అది మాటాడకండానే కళ్ళింత చేసుకుని గొలుసు చూసుకుంటా మురిసిపోయింది.

"ఎల్లా వుందీ?"

ఏళ్ళతో తడవబోయింది ఆడు అడ్డెట్టాడు.

"నీ మెళ్ళో నువ్వెట్టుగుంటే ఏవుంటాదే? నా సేత్తో తగిలించనియ్యా!" ఆడు చొరవ సేత్తావుంటే గబుక్కున యిది లించుకుని మూలకి పోయింది.

కోపంగా సూత్తా ఎలపలి కొచ్చేశాడు బద్రయ్య. సానా సేపటిదాకా సీతమ్మ ఎనక్కి తిరిగి సూళ్ళేదు.

కాళ్ళు టకటకలాడించుగుంటా ముసలయ్య లోన కొచ్చాడు. అది సెంగుతో కళ్లు ఒత్తుకున్నాది.

నేలమీదున్న గొలుసు చూశాడు. కళ్ళు యిప్పారేట్టు చూసి, తీసుకుని దానికాడి కొచ్చాడు.

సీతమ్మ గోదారెంప సూత్తావున్నాది. దాని మెళ్ళో గొలుసు తగిలించాడు ముసలయ్య. పై పేనాలు పైకే పోయి నాయి!

"ఒద్దు తాతా! నాకీయా వొద్దు!" అంటా తీసెయ బోయినాది.

"వొయ్యకు తల్లీ! ఉంచుకోవాలి. నీ తాత ముచ్చట కోసం వుంచుకో! నా సిట్టితల్లి కాదూ!"

తాత బతివాడ్డంతో అది కరిగేపోయింది. ఆళ్ళిద్దరూ బయటికొచ్చారు. ఆ సందేల, పడమదిక్కుకి సూత్తా మసక ఎలుగులో యిద్దరూ బొమ్మల్లా నిలుసున్నారు.

"నీ మెళ్ళో వుంటే, యీ గొలుసుకే కొత్త అంద వొచ్చిందమ్మా!"

అది నవ్వబోయింది. రాలేదు. దాన్ని తొక్కిపెట్టి ఏడుపే ఎల్లుకొచ్చింది. వొళ్ళంతా వొణికిపోయింది.

"ఆడేవేనా అన్నాడా సీతమ్మా?"

అది మాటాళ్లేదు.

"సెప్పవూ?"

నోరిప్పలేదు.

"పీక నులివేత్తా నాగు! ఎదవ" అంటా సివాలెత్తాడు ముసలయ్య.

"తాతా!" అంటూ అరిసి ఎక్కెక్కి ఏడిసింది సీతమ్మ. తాతగుండి సెరువయినాది. కోపం కరిగిపోయింది. దాని కన్నీళ్ళలో కొట్టుకుపోయింది. ఆడి గొంతుకు బొంగురయింది.

"ఏడవకమ్మా! నీకేం బెంగ లేదు. బగమంతుడు నన్ను సల్లగా సూత్తాడు. అప్పుడప్పుడు మనమీద మబ్బులు కమ్ముకొత్తా వుంటాయి. బెదరకోడదు. దయిర్నం సిక్కబట్టుకోవాల. గట్టిగా గాలి యిసిరిందంటే మబ్బులన్నీ సెదిరిపోతాయి. అప్పుడు మన కళ్ళముందర అంతా ఎలుగే! ఆ రావయతండి తప్పకుండా కనికారం సూపిత్తాడు. ఆడే వొచ్చి నీ దరిని నిలుసుంటాడు! నా మాటిను తల్లీ! నీ తాతకి ఆ డెప్పుడూ అన్నాయం సెయ్యడు!" ఆ మాట లంటావుంటే ఆడి వొళ్ళు ఆడికే తెలీలేదు. ఆడి గొంతుకులోంచి పెగిలి, ఓ పదవేం పాడుకుంటా వొచ్చినాది.

'పాపికొండల ఎనక రావయ్యా
పవళింపు సెయ్యంపై లేవయ్యా.
సీతమ్మ నిలుసుంది రావయ్యా!
పాపికొండల ఎనక రావయ్యా!
అల్లంత దూరాన బద్రాద్రి కొండపై
ఎలుతురులు సిమ్మేవు సీరావసెంద్రా
దూరాలు నడిసింది సీతమ్మా!
అలిసిపోయిందయ్యా మా తల్లి!

పాపికొండల ఎనక రావయ్యా!
మట్టిలో పుట్టించె మణికోట మెరిసింది
మిదిల మారాజింట జానక్కై ఎలిసింది
నీ పేరు తలిసింది నీ రూపు వాలిసింది
జాగు సేయక రార అందాల దేవా!

పాపికొండల ఎనక రావయ్యా!
ఎన్ను ముద్దగ చేసి మన సిచ్చినాడిరా
బతుకు నావయ్యొచ్చి నీ దరిని కలిసింది
సుక్కాని తీసుకో సుక్కల్లో తోలరా
కొత్త లోకాలన్ని కలిసి తిరగాలిరా!

పాపికొండల ఎనక రావయ్యా!
అందాలు చందాలు రంగు రంగుల ఎలుగు
నీ మనసులో కదిలి బూవికొచ్చాయిరా
మిట్టపల్లాలన్ని మిడిసి పడతన్నాయి
కట్టుసుకవులు రొండు కలిసి పొంగాయిరా!

పాపికొండల ఎనకరావయ్యా!
నల్లత్రాసుల పొరలు ఎలుతురుని దాసాయి
ఆసల్లు సేరాయి కొండసిగురుల పైకి
మనిసి బతుకుల బండి పెడదారి పట్టింది
కళ్ళ గంతల విప్పి దారి పట్టించరా!

పాపికొండల ఎనక రావయ్యా!
నీపేరు యిడువకా నీ మేలు మరువకా
నిన్ను నమ్మింపెరా నిన్నె కొలిసిందిరా

ఒంటిగా నిదరేల రావయ్యా
జంటగా ఏలుకో సీరావసెంద్రా!

పాపికొండల ఎనక రావయ్యా!
పవళింపు సెయ్యపై లేవయ్యా!
సీతమ్మ నిలుసుంది రావయ్యా!!

కొబ్బరికాయిల బత్తాలి కానుకొని కూసున్నాడు ఎంకన్న. గోద్దాల్లో వొచ్చిపోయీ పడవల్ని సూత్తా వున్నాడు. తెరలు తెరలుగా కదిలే సిట్టి కెరటాల మీద సూపు నిలిపి ఏదో ఆలోసిత్తా ఉన్నాడు. ఎవకెంపుని, పగిలిపోయిన పడవల్ని బాగుసేత్తా వున్న సప్పుడు యినిపిత్తావున్నాది.

మాటిమాటికి ఆడికి సెంద్రకాంతవేఁ గురుతొత్తన్నాది.

సూరీడు సీకట్లో తప్పిపోయాడు. కమ్మరోళ్లు పని ఆపేశారు. ఇద్దరు ముగ్గురు పల్లోళ్ళు యీతాలాడతా వున్నారు. మినుగురు పురుగులు పరిగెడతా వున్నట్టు, గోదావరి బిడ్జి మీద రెయిలుబండి పాకిపోతన్నాది.

ఎంకన్న ఒడ్డోల్లోకి తిరిగొచ్చేతలికి సెరబయ్యా, బద్రయ్యా వూసులాడుకుంటా సవ్వకొంటన్నారు. ఎంకన్న మొగం సూసి సెరబయ్య బిగిసిపోయాడు. బద్రయ్య లెగిసొచ్చి యీడి జబ్బట్టుకు లాక్కెళ్ళి కురిసీలో కూలేశాడు. ఎంకన్న సేతులిదిలించుకుని ముందరున్న బల్ల మీదెట్టుకొన్నాడు.

"డోసు కావాలేంటే బెదరో?" అన్నాడు సెరబయ్య.

ఎంకన్న కోపంగా సూశాడు.

"అంత తొందరేంటిరా? ఒడేలు కట్టాశాక ఎన్ని బుర్ర వాలంటే అన్ని తాగొచ్చు! ఇప్పుడు నే సెప్పేది మటుక్కి-

సరింగా యిను. తెలిసిందా ? ఎంకన్న సేత మనపోఁ గొప్ప యాపారం సేయించాలి ! తక్కువ పెట్టుబడితో ఎక్కువ లాబం చేసుకోడం బిగినీసుపోడి తెలివి. అది సెయ్యాలంటే బుర్రలో సురుకుదనం వుండాలి ! కొనీవోడి మనుసు కనిపెట్టి, ఆడికి నచ్చిందే గొప్పదని సెప్పాలి. ఏరే ఆలోసన్లు ఆడి బుర్రలోకి సొరనీకండా ఉక్కిరి బిక్కిరి సెయ్యాలి. ఓ సారి ఆడు నీ వుచ్చులో పడ్డాడో ! తన్నుకు సచ్చినా బయిటపడ లేడు. మచ్చికచేసి లాబం గుంజాలి. ఇంటన్నావా ? పెద్ద పెద్దోళ్ళ బిగినీసులో కిటుకిదే !"

"అయితే మనం సూత్తావుండగానే ఎంకన్న పట్నంలోఁ మేడకట్టేత్తాడేంటి ?"

"మరేంటనుకున్నావ్ ? ఎర్రిమొగవాఁ ! మేడేం కరవఁరా ! లచ్చలికి లచ్చలు గడిత్తాడు. సినేవాఁ టాకుఁ త్రాంటి సిన్నదొచ్చి, సేతికి సీసాలందిత్తా వుంటే, తస్సాదియ్యా ! ఎంకన్న తమ్ముడు గొప్పోడయిపోడో ?"

"సినేవాఁటాల్లు సెందరకాంతం కంట సక్కనోళ్ళా ?"

"నోర్మూయ్ !" గట్టిగా అరిశాడు ఎంకన్న.

"యాపార విసయాలు మాటాడతావుంటే ఏఁగాకోల వేంట్రా సెరబయ్యా ? నువ్వు ముందు బయిటికెళ్ళిపో !"

బుజా లెగరేసి, ఎంకన్నని వొంకరగా సూసి, ఎల్లి పోయాడు సెరబయ్య !

"తమ్ముడో !"

ఎంకన్న మాటాడలేదు.

"కాంతంతో సినేవాఁ కెల్తావా ?"

ఎర్రోడిలా చూశా డెంకన్న.

"కాంతపంటే అంతకోప వెందుకు ఎంకన్నా ?"

ఆసికి నోర్లు మంచిపోయింది.

"దాని వూసె త్తకు బద్రయ్యా! దాఁకీ నాకూ సుట్టరిక వేంటి ? బోగం..." కసిగానే అన్నాడు.

బద్రయ్య నవ్వాడు.

"పోనీ యాపారం సేత్తావా ?"

"ఏం యాపారం ?"

మాటు పలక్కుండానే, కుడిసీలోంచి లేశాడు బద్రయ్య.

ఒటేలు బల్లలు కాలీగా వున్నాయి. తలుపు గడేట్టి ఎన కొచ్చాడు. దొంగతనంగా దాసిన సీసా బిరడాతీసి, యిద్దరికీ సెకుకో గళాసులోనూ పోశాడు. ఓటి ఎంకన్నకి అందిచ్చాడు.

"సారా !"

# 10

పొద్దున్నే వొచ్చి మాసెమ్మ చెప్పింది—"రవణయగాడి పెళ్ళాం. మల్లా మొగోణ్ణే కన్నాదంట !"

ఆ మాటలు రావులమ్మ గుండిల్లో కసిక్కుని గుచ్చుకున్నాయి !

మాట చెవినేసిన మాసెమ్మ మల్లీ తిరిగి ఎల్లిపోవొచ్చా! అహఁ ! అన్నీ దానికే కావాల.

"మల్లీ యీ రోజుకి నీ సంకలో కూడా వోబుల్లోడు ఎలవాలే బుల్లెమ్మా !"

ఓరయ్యో ! అంత సుఖువే ?

'సత్తెమ్మదెంత అదుష్టం!' అనీ అనుకున్నాది.

'ఆడు తనకే పుడితే?'

'స్సీ! రవణయ్య మావఁగోడుకు తనకి పుట్టడవేంటీ?'

మనసు చివఁ చివఁ లాడింది.

ఓరబ్బో! ఎంత సిగ్గో!

'ఈ మాటంటే మావేం అనుకుంటాడో?'

పెళ్లాం పుట్టింటికెళ్లాక రవణయ్యకి తిండి సరిలేదు. రొండు మెతుకులు ఆడే వుడకేసుకు తినీవోడు. ఉప్పూ, పులుసూ లేని సప్పటికూడు! అదీ లేపోతే సల్లటి గంజినీళ్ళు! దాంతో తిండంటే జివసచ్చి, సిమతిల్లు మరిగాడు. బోలెడు డబ్బు కరుసు పెడతా సెలాకీగా తిరిగీవోడు. ఎన్ని సరదాలు తెచ్చిపెట్టుకున్నా యింట్లో పెళ్లా వున్న సాటొస్తాదా? పురిటికి పుట్టింటికి పంపిస్తే, తస్సాదియ్యా! ఆ బెమ్మదేవుఁడు కూడా ఒక్కడూ వుండలేడు. ఇప్పుడయినా తప్పనసరయింది కానీ, లేపోతే దాన్నసలు యిడిసీపోడా తను? అదెల్లిన కాణ్ణించీ వొంటిసుకం సచ్చిపోయింది. పక్కమీన పడుకుని యిటూ అటూ దొల్లు పుచ్చకాయిలా కదిలీపోడు. సరాలు పీక్కు తినీయి. బుర్ర నిదరోయింది కాదు. గుండె మారాం పెడతాది! 'ఎన్నెలకేత్తిళ్ళు మరీ బాద! పురిటినీళ్ళయిపోగానే దాన్నెంట బెట్టుకొచ్చెయ్యాల!'

సత్తెమ్మని యిట్టవుఁ లేపోయినా పెళ్ళి సేసుకున్నాడాడు. కొత్తలో దాన్ని ఎంత సీసరించుకునీవోడో! ఎత్తు పళ్ళూ, కోతి మొగవూఁ!

రేత్తిరి రెండు జావుఁ వేళకొచ్చినా కళ్ళల్లో దీపాలెట్టు కుని గుమ్మంకాడ కూకునీది !

'పాపం !' అనుకునీవోడు. దాని తెల్లసీర చూసి పుసి క్కుని నవ్వుకునీవోడు.

పెళ్ళి చేసుకోక ముందు తను ఆడిన నాటకాలన్నీ, రావుఁలమ్మ ముచ్చట్లూ పూసలు గుచ్చినట్టు చెప్పీవోడు. దాని కళ్ళు కుడితేగా !

'మా దొడ్డపిల్ల అనుకున్నాడు.

ఇప్పుడదే ఆడికి దేవత కాదో ?

సుక్కురారంనాడు—

రావుఁలమ్మ వొచ్చి ఇంటివోలకం చూసి నవ్వింది.

“అత్త లేపోతే నువ్వుండలేవు మావాఁ !”

“ఆడకూతురు లేని కొంప మరెలాగుంటాదే ?”

అది మళ్ళా నవ్వింది.

“ఆపాటి మొగమాటం అందరికీ వుంటాదిలే మావాఁ ! కూరా నారా లేందే బువ్వ ఎలా తింటావ్ ? నన్నడిగితే నేనేసి పెట్టనో ! సాటోళ్ళం గందా, వొకళ్ళకోళ్ళం సాయం చేసు గుంటేం తప్పా మావాఁ ?”

“రవణయ్యకి రావుఁలమ్మమీద చెప్పలేనంత యిష్టం కలిగినాది.

అసలు రావుఁలమ్మ ఎప్పుడూ మంచిదే! తన్ని చేసు గుంది కాదు కానీ, దానిసుట్టూ గుడికట్టేసి పూజ చేసీవోడు కాడో ?

“అత్త కడుపుని మళ్ళా బుల్లిమావ ఎలిశాడు !”

“దేవుడు సల్లగా సూత్తే నీకు మట్టుకి ?”

"అంత భాగ్గెం కూడానా!"

"అప్పుడే వోయిరాగ్గెం వొచ్చిందేవేఁ? అంత ముసిలి దాని వయిపోయావంటా?"

కసిక్కున నవ్వేసింది రావులమ్మ.

ఆ నవ్వు సూత్తే ఆడికి సింతలతోపు గురుతొస్తాది!

అంతటితో మావఁ మాట మారిసేత్తా డనుకున్నాది.

"సిలకలాంటి పెళ్ళాం వుండగా ఏటేటా కవఁలపిల్లలు పుట్టిద్దో?"

వొంటినిండా సిగ్గేసింది దానికి. అది ఆడు చూడనూ చూశాడు.

"నిన్నింటో యిడిచేసి పట్నంలో ఆడు ఏం రాసరిక వెఁలగబెడతన్నాడే? ఏం రోగవంట? నే నెప్పుడేనా అల్లా చేశానా?"

"సాల్లే మావా!"

మొగం తిప్పేసుకున్నాది. తిప్పుకోడంలో ఆ వొయ్యారం మల్లా సూడాలనిపించిందాడికి.

"నీకు పప్పుసారు మనుసు గందా, సిటికిలో కాసి పెడతా! సందేలకి తెమ్మంటావా?"

రవఁణయ గుండె ఎగిరి గంతేసింది.

"నీ మాంమీద యింత దయొచ్చిందేం రావేఁ?"

ఆ మాటిని, నవ్వుకుంటా అది ఎల్లిపోబోతావుంటే— అన్నాడాడు—

"సీకటితో టే గూట్లో వాల్తా! సన్నిల్లల్లో వుతకాలాడి నీ కోసనే సూత్తావుంటా! సయ్యేనా సిలకా?"

'సొగసోడు మావఁ!' అనుకున్నాది.

వొయ్యారంగా సేతులు తిప్పుతా, మాటాడకండానే ఎల్లిపోయిందది. కుసింత దూరం ఎల్లి, మల్లా ఎనక్కి తిరిగి సూసింది. ఆడింకా గుమ్మం పట్టుకుని తన్నే సూత్తా వున్నాడు.

సూత్తా, ఆడు మీసం తడువుఁకుంటావుంటే ఆడి నవ్వే వొరాల పుట్ట! ఆడి సూపే యీతముళ్ళ కట్ట!

మావఁలాటి మొగోడు అందరికీ దొరుకుతాడా?

అన్నారందేవుఁడి వొరం కాదో?

ఆడి నవ్వు అందరికీ వొత్తాదేంటి?

మల్లా ఆఁపోలికి పిల్లల్నే కండానికి సత్తెమ్మ ఎన్ని నోవుఁలు నోసుకున్నాదో?

పొయిమీద వొణ్ణం గెంజి వొరిసి, సిటికిలో ఆడి కాళ్ళ కాడ వొద్దో?

ఉడుకునీళ్ళతో తానవుఁచేసి, సిక్కటి పాలల్లాంటి సీర కట్టి, పచ్చగన్నేరు రేకంటి రయికి తొడిగి, ఏబుఁళం మల్లిపూల దండ, మబ్బుల నడవఁ సందమావఁలా తిరుంకుని, మంచు లాటి ఎన్నెట్లో ఆనిముత్తెల్లా నిలుసుంటె రాప్రఁలమ్మ.

దాని మనసులో సరికొత్త వోసన్లు ముసురుకున్నాయి. తియ్యటి మనసులు పరుసుకున్నాయి. కొత్త జనవేఁ యిరగ బూసింది.

రవఁణాసి మావ తనమీద అంత కనికారం సూబిత్తాడని ఎప్పుడేనా అనుకున్నాదా?

అప్పుడు సిన్నతనవే కావొచ్చు, యిసుకపొంకవేఁ అవొచ్చు—మనుసుపడి ఆడు దరికొత్తే తను యిసిరి కొట్టి లేదో?

సీకట్లో సిగ తడివిఁ నవ్వితే, సెరసెర నడిసొచ్చెయ్య లేదో ?

ఆడు తన్ని కంటిరెప్పల్లో దాసుకు చూసుగుంటా నంటే జాలితలిసేనా పెళ్ళి సేసుకున్నాదా ?

అప్పటి రవఁణయ్య కాడో, ఇప్పటి మావ ?

ఎప్పుడు కాఁపడినా నోరారా పలకరిస్తాడే కాని ఎనకటి సీదరింపులు మనసులో పెట్టుకుని కసిరి కొట్టాడా ?

అంత మంచోణ్ణి యిదిలించుకుని, యీణ్ణి కట్టుకుని ఏం సుకపడతన్నాది ?

రవఁణయ్య మావఁ గొంతుకలోంచి వొచ్చే మాటల ముచ్చట జనవఁజనవాలకయినా యినగలుగుతాదా ? తన అదుట్టం కాదో ?

ఎంతసేపటికి అది యిల్లు కదలకపోడంతో, యిసుగెత్తుకొచ్చి సెందురుడు మబ్బుల్లోకి ఎల్లిపోయాడు.

రావుఁలమ్మ గుండి గుబగుబలాడింది.

ఆడి దరి కెల్లాలి ! కాళ్ళకాడ వాలిపోవాలి ! రవఁణయ్య మావఁ జాలికి మనసులో దణ్ణాలుపెట్టాలి.

సత్తెమ్మ సినకొడుకు తన సంకలోనే మెసల్తా ఉన్నట్టనిపించింది రావుఁలమ్మకి !

దొంగసాటుగా సందమావఁ తొంగి సూడ్డంతో అది సిగ్గుల్లోనే దాక్కున్నాది.

ఎనకెనకే కోరికీ ముంచుకొచ్చింది !

తెగింపూ యిసుసుకు పడింది !

దొడ్డి తలుపేసి గడెట్టింది.

మనుసేసి మల్లా అన్నం మొగం చూసుకున్నాది. సిగ్గు రాండంతో బోర్లా తిప్పేసి, సెరసెరా నడిసింది. దీపం బుడ్డి సన్నగా చేసింది.

వొచ్చేసి తలుపుమీద చెయ్యేసింది.

తన గుండెలమీదే ఎవర్రో చెయ్యేసి నట్టయినాది.

ఆ చెయ్యి రవణయ్య మావది లాగే వున్నాది.

వొళ్లు వూగిపోయింది.

మనుసు ముందరికీ, సిగ్గు ఎనక్కీ!

అబ్బబ్బ! ఆపుకోలే పోయింది.

తలుపుమీద దాని సెయ్యి అలా వుండగానే, ఎలప ల్నించి సప్పుడినిపించి.

"మావే నేవో?"

మనుసాపుకోలేక తన కోసవే వొచ్చాడా?

ఎప్పుడూ లేంది యిప్పుడింత తొందరేంటో?

నలుగురూ చూసి గుసగుస లాడుకోర్రో?

అంత వుండబట్టలేనోడు, యిన్నాళ్ళూ ఎలా వుండగలి గాడో మరి?

తనమీద జాలిపడి ఆడే నెలుక్కుంటూ వొచ్చాడా?

రవణయ్య మావ తన పాలి దేవుడు కాడో?

ఏపాటి కేతిరికీ రావులమ్మ రాకపోయీ తలికి మనుసు ఆపుకోలేక పోయాడు రవణయ్య.

ఇంతలోకే మనుసు మారుసుకున్నాడా?

ఆడి తప్పింది కదా?

మరింత జాగారమెందుకో?

ఆడి గుండెల్లో గుబులు పట్టింది. ఎన్నెల్లోనే నిలుసున్నా యిసినకర్ర తీసుకోకుండా వుండలేక పోయాడు. ఎంత యిసురు కున్నా పొగలు సల్లారలేదు. ఉసూరుమంటూ మంచంకాడి కెళ్లాడు.

ఇంటో పని మూలాన్న యింకా యీలవ లేదేమో?
ఎన్నెల రేత్తిరి, వొకత్తీ రాడానికి సిగ్గయినా దేమో?
పోనీ రమ్మంటే తనే ఎల్లినోడుగా!
దాన్లో ఎవురన్నా అటకాయించారేమో?

అబ్బబ్బ! అది తన్నింత బాధ పెడతాదని ఎప్పుడేనా అనుకున్నాడా? పగ్గం విసిరి తన మనసు లాక్కుంటాదని కలగన్నాడా?

ఆ వుసురులో ఆడు నిలదొక్కుకో లేకపోయాడు.

ఈ యాల్టికింక రాదేమో?

దడదడల్లాడి పోయాడు.

సివోల్ని లెగిసి ఎ పలికొచ్చి తలుపు గొళ్లె పెట్టాడు.

అప్పుడే కట్టుకున్న సాకింటి బట్టలు చూసుకుని, ఆ ఎన్నెట్లో తన్ని చూసుకుని తనే మురిసిపోయాడు.

కండిగిలో దాన్నిల్లు సేసుకునీదాకా ఆడి మనసు మనసులో లేదు!

ఓరగా తలుపు తీసి ముచ్చటగా చూసింది రావులమ్మ. కళ్ళు పెద్దయిచేసి సూసింది!

ఆడు రవణయ్య కాడు!

ఎవడో కొత్తోడు, దొంగోడు!

ఆడదాన్ని ఒంటిగా చూసి, దోసుకుందామని వొచ్చాడు;

బయంతో వొనికేపోయింది. గాజులు గల గలా గోలెట్టి నాయి. కాళ్ళు దడుసుకుని సెపట్లు కమ్ముకున్నాయి. గుండెలు అదిరిపడి తాడెత్తు లెగిసినాయి.

రావులమ్మ నోటంట మాట రాలేదు !

ఆడు నవ్వాడు.

"ఎవరూ లేరా ?"

ఆడు నిజంగా దొంగోడేనని యిప్పుడే బలపడి పోయింది. ఏం చెయ్యాలో ? ఎవుర్ని పిలవాలి ? రమణయ్య వొచ్చినా బాగుండి పోయిది !

"నీపేరు రావులమ్మ కాదో ?"

ఆడికి తనపేరెల్లా తెలుసో ? దొంగసచ్చినోడు !

మల్లా నవ్వాడాడు.

"నాపేరు సెరబయ్యలే ! పట్నవులో ఎంకన్న జతగాణ్ణి. ఆడే పంపించాడు !"

అప్పటికి కొంచెం దయిర్నెం కలిగింది.

"ఎందుకో ?"

"నీ కోసం !"

"ఏంటీ ?"

"ముందు కుసింత దాగవియ్యి. అన్నీ యివరంగా సెబుతాను !" అంటా లోనకి రాబోయాడు.

ఆణ్ణి రానీడానికా—నీ, పొమ్మండానికా—ని దానికేం తోసలేదు.

ఆడికి సోద్దెవనిపించింది.

దాని మనసు చివుక్కు—మన్నాది. సెరసెరా లోనకెళ్ళి ఉసూరుమంటా అద్దంలో చూసుకుని, సీరకొంగుతో మొగం కప్పుకున్నాది.

ఆడు లోనకొచ్చినట్టయింది.

మొగం తుడిసేసుకుని, పువ్వులిసిరేసి, సీరమార్చుకుని ఎలపలికొచ్చింది.

అప్పటికప్పుడే ఆడు యిల్లంతా కలీసూత్తన్నాడు.

దానికేం చెయ్యాలో తోసలేదు. గళాసులో నీళ్ళు పోసి యీదిలో కొచ్చింది. ఆడూ ఎనకాతలే వొచ్చాడు.

దాని ఏసం మారిపోడం ఆడికి నచ్చలేదు.

"ఎందుకు పంపించాడో ?"

"గొలుసు కోసం."

"ఏం గొలుసు ?"

"నీ మెళ్ళో సెంద్రారం కోసరం !"

"ఎందుకో ? సెంద్రకాంతాని కియడానికా ?"

ఆడిపేనాలు పైకే పోయాయి. అదిచ్చిన గళాసు కిందెట్టేశాడు. కాంతం యిసయం దీనికెల్లా తెలిసిందో ? ఎవురు సెప్పేరో ? పల్లిటూరు ఆడదంటే ఏంటో అనుకున్నాడు కాని, యిలాంటోళ్ళు కూడా వుంటారని కల్లోకూడా అనుకోలేదు.

"ఆ డేసాలన్నీ నాకు తెలుస్తానే ఉన్నాయి. మావూరోళ్లు చెప్పారు. యాపారవంటా పట్నమెల్లి, అంటిగెల్లు అమ్మిన డబ్బంతా ఆ బోగవోళ్ళకెట్టేసి, యిప్పుడు ఏ మొగమెట్టుకు నిన్ను పంపించాడూ ? పవురుసం లేదో ? మొగోడుకాడో ? ఆడూ నువ్వూ కలిసి నాకాడ దొంగేసా లేద్దారను కున్నారా ? సెంద్రారం కాదు, సీపురుపుల్లకూడా యియ్యనన్నానని చెప్పు ! తెలిసిందా ?"

దాంతో ఆడు సిత్తయిపోయాడు. ఇల్లాంటి ఆడదాన్ని వొంచడం శానా కట్టవే! మంచికి రోజు లుంటాయా మరి? ఆడి బుర్ర పాదరసమేనో; సటుక్కుని కళ్ళు మెరిశాయి.

"సెప్పిదంతా యిను రావులమ్మా! ఆ డిప్పుడు నీ మాటలు యినీట్టు లేడు!"

"అవును! ఎందుకింటాడో?"

"నిన్న సందేల కారుకింద పడ్డాడు. రగతం కక్కుకున్నాడు. మోసెయ్యి ఎవుకి లిరిగిపోయాయి. బతికి బట్ట కడతాడని కల్లో కూడా అనుకోలేను. అంతా నీ అదురుస్టం!"

ఆ మాటలు యింటూనే అది రాయయిపోయింది. సెవులు గళ్ళడినాయి. సూపు నిలిసిపోయింది. గుండీ ఆగిపోయింది!

కారు కింద పడ్డాడా?

ఎవుకి లిరిగాయా?

రగతం కక్కుకున్నాడా?

ఆడు తనవోడు?

గుండెలిమీద బండరాయి పడ్డట్టయింది.

మెళ్లో తాళి తడుంకున్నాది!

"ఇక్కీ? ఎక్కడున్నాడు? ఎల్లాగున్నాడు?"

ఆడు తాపీగానే అన్నాడు. "ఆసపట్లాలో! ఈ యేల కొంచెం నయంలే! రేపు వొటేలుకి వచ్చేత్తాడు. పేనానికి బయం లేదు. రగత మెక్కించి, ఎవుకిలు అతగడానికి రొండంద లవుతాయట. అందుకే నిన్ను గొలుసు అడిగి తెమ్మన్నాడు. తరువాత నీ యిట్టవు!"

తన మొగుడు సావు బతుకుల నడాన్ని కొట్టుకుంటా ఉన్నప్పుడు, తనికి ఉపకారం సేద్దారని ఆడొత్తే, ఉత్తి పున్నానికి కోప్పడినందుకు తన్ని తానే తిట్టుకున్నాది.

ఎల్లాగున్నాడో ?

ఏవయిపోతాడో ?

తన పసుపూ, కుంకం ఏవయిపోతాదో ?

దాని కళ్ళు జలజలా తడిశాయి !

తన బుద్ధి కాలిపోబట్టే ఆడికంత పెమాదవొచ్చింది. ఆడికి అన్నాయం చెయ్యాదల్సుకున్నందుకు దేవుడు తనకే తిప్పి కొట్టాడు !

తండ్రి పాపిష్టి బతుకు! ఆణ్ణి దేవుడు సల్లగా కాయాలి. తనకి దూరవయిపోయినోడు మల్లా తనవోడు కావాలి. మంచి మాటలు సెప్పి మనసు మల్లించాలి.

సెరబయ్య ఎంత దయిర్నం చెప్పినా దాని గుండెకు కుదురు పడలేదు. ఎంటనే పట్నం వెల్లి ఆణ్ణి చూసుకోవాలి. ఎయ్యి దేవుళ్ళకి మొక్కి పేనాలు దక్కించుకోవాల !

అల్లంత దూరంనుంచే రావులమ్మని ఆసగా సూసిన రవణయ్య తన కళ్ళని తనే నమ్మలేపోయాడు. దాని పీర సూస్తేనే ఆడి మనసులోన్ని సప్పగా సల్లారినాయి. గుమ్మం కాడ నిలుసుని ఏం చేస్తున్నాడో ? దాపు కొస్తున్నకొద్దీ యింకో మొగోడు కనిపించాడు.

దాని మొగుడేనో ?

కానీ, సానోళ్ళని మరిగినోడు, యీయాల్టప్పుడు యింటికెందుకొత్తాడు ? అంపులోకీ ఎన్నెల రోజుల్లో !

అల్లంత దూరాన్నే రవంణయ్యని చూసి సరసరా లగెత్తుకొచ్చింది రావుంలమ్మ. ఆడి నోలకం సూత్తే సెర బయ్యకి కళ్ళు కుట్టినాయి.

దాని కళ్ళు వాసి ఉన్నాయి. మొగం అదురుతా ఉన్నాది.

"ఏంటే రావీం ? ఏంవయిందే ?"

"మావాం !" అంటా ఆణ్ణి సూత్తా తెగ ఏడిసింది.

"ఏం జరిగిందో సెప్పవేం ?"

"ఆడు కారుకింద పడ్డాడంట మావాం ! సెయ్యిరిగింది. ఆసపటాల్లో ఉన్నాడు !"

"మా బాగా అయింది ! ఎదవేసాలెత్తే కారుకింద పడ్డో? పట్నవెల్లాక అసలాడికి కళ్ళు కనుపిత్తన్నాయా అంట ?"

"అది కాదు మావాం ! ఇప్పుడు పేనంమీది కొచ్చింది. రగతం పోయిందంట !"

"కొత్త రగత వెంక్కించినా ఆడి గొనం సత్తే మారదు!"

"దేవుం డాణ్ణి బతికిత్తాడా మావాం? నా పసుపూ కుంకం నిలబెడతాడా ? మల్లీ నన్ను సూత్తాడా ? సెప్పవా మావాం ? సెప్పవూ ?"

రవంణయ్య గుండె కరిగింది.

"పరాలేదే! ఆడికేం పెవాందం లేదు. పట్నవుంలో గొప్ప గొప్ప డాకటర్లున్నారు. తెలుసుకుంటే ఆళ్ళు పేనాలు కూడా పొయ్యిగల్రు ! నీకేం బయంం లేదు. నేనున్నాగా !"

బోరుమంటా ఏడిసిం దది.

గొలుసుమాట చెప్పాడు సెరబయ్య. ఆళ్ళు రాపోయినా పరాలేదన్నాడు. రవణయ్య యిసిపిచ్చుకోలేదు. మొన్నాడు కోడి కూతేకి బయిలెల్లి నావలో రావులమ్మని తీసుకుని పట్న వెల్లడానికీ, అక్కన్నించి తను అత్తోరింటికెల్లి పెళ్ళాన్ని చూసి రాడానికీ అన్నీ తయారు చేసుకున్నాడు.

# 11

ఏదర్నించి లెగిసి గోదాల్లో తాణవు సేత్తావుంటే సీతమ్మ కనిపించింది.

'మా సొగుసుగా వున్నాది!' అనుకున్నాడు ఎంకన్న.

అలాంటిది దొరకడం బద్రయ్య చేసుకున్న పున్నెం కాదో? ఇన్నేల్లయి తీసుకొచ్చాడు గందా, యింకా పెల్లెందుకు సేసుకోలేదో? ఆణ్ణి అంత సీకరించుకుంటాదేం? ఆడే నచ్చలేదో?

'ఆడోళ్ళ మనసులు సిక్కుదారాల్లాంటియేవో!'

రేవులోకొచ్చి కడవతో నీల్లు ముంచుగుంటా వొంగుంటే, ఆడికి సూడ ముచ్చటేసింది.

సెయిత్రమాసంలో కన్నిడిసిన గన్నేరుపువ్వులాగున్నాది!

మోకాల్లోతులో నీళ్ళు ముంచుకుని ఎల్లిపోతా ఎంకన్నని చూసిందది. చూసి నిలుసున్నది నిలుసోనూలేదు. ఎల్లిపోతానే వున్నాది. పోతా పోతా ఏవన్నాదంటే—"తాత రమ్మంటన్నాడు నిన్ను!" అన్నాది.

తనతోటి అన్నాదని ఆడికి తెలుసు. కట్టుకున్న సీర కాళ్ళని కరసి పట్టుకున్నా కిందికి సూడకండానే ఎల్లిపోయింది.

ఒళ్ళు తుడుసుకుని సెరసెరా నడిసెల్లాడు ఎంకన్న. పాకలో అడుగెట్టాడు. సీతమ్మ పొయ్యి రాజేత్త వుంది. ఎదర తాత కనపించలేదు. ఒద్దేసేపు దాని గుడిసెలో వుండడానికి ఆసకి దయిర్నెవేఁ సిక్కింది కాదు. బద్రయ్యనే లెక్క చెయ్యంది తన్ని యింకా ఏం తిడతాదో? అనుకుంటా ఎలపలి కొచ్చేబోయాడు. అప్పుడు తాత ఎనక్కి పిలిశాడు. కర్ర టక టక లాడించుగుంటా వొచ్చాడు. ఎంకన్న ఆగాడు.

"పేరేంటి?"

"ఎంకన్న."

"ఏవూరు?"

"ఆ...మూరు."

"ఎం...క కొచ్చావిక్కడికి?"

"నువ్వే రమ్మన్నావంటగా!"

"అది కాదు. యీ వూరెందు కొచ్చావని అడుగు తన్నాను."

"యాపారం కోసం,"

'బద్రయ్య నీ సుట్టవాఁ?"

"స్నేవితుడు."

"యాపారం యీడితో నే సేత్తావా?"

"అవును."

ఓ చిటికసేపు ఆగాడు ముసలయ్య.

"నీకు బాగుపడాలని లేదా ఎంకన్నా?"

"ఏం?"

బసువుగా అడుగులేసుగుంటా ఎంకన్న ముందు కొచ్చాడు. ముసలయ్య. మొకం ఎదరకెట్టి కళ్ళతో గుచ్చిగుచ్చి చూశాడు.

"ఎంకన్నా! నువ్వు బాగుపడాలంటే ముందు యిక్కడి నుంచి ఎల్లిపో! ఆడు పచ్చి తాగుబోతు, పొగరుబోతు, బంది పోటు దొంగోడు. కూనీకోరు! నీ డబ్బు నీకు దక్కాలంటే, నీ యాపారం సాగాలంటే, నువ్వు పేనాల్తో బయిట పడాలంటే నీ మేలు కే సెబుతున్నా! పో, యిక్కడినించి ఎల్లిపో! ఎంటనే ఎల్లిపో!"

ముసలయ్య మాటలు యిడ్డూర మనిపించినాయి. అసలు ఈణ్ణి తను యింతకిముందెప్పుడూ సూడనన్నా లేదు. సీతమ్మకీ యీడికీ సుట్టరికవేంటో?

ఆడంగా మాటాడ్డంలో కిటుకేంటో? నిజవ్వు సెప్పాలంటే యీడన్నంత సెడ్డోడు కాడు బద్రయ్య. ఇన్నాళ్ళనించి వొస్తా పోతా వున్నోడుగందా, బద్రయ్య మంచిచెడ్డలు తనకి తెలవ్వా? స్నేహితంకోసం పేనాలిస్తాడు. ఉపాయం సెప్పాడంటే తిరుగు లేదు.

అన్నీ వొదులుకుంటే తన లాబాలు గూబల్లోకి రావా? ముసలోడి మాటింటే నష్టాల్లో మునిగిపోడా? సూపుల్లో పొగరుమోతుగా కనిపించినా మాటల్లో ఎంత మంచితనవున్నాదనీ! ఆడి బాదలు ఆడు మరిసిపోయి, కాసింతసేపు ఏ ఆలోచనా లేకండా వుండిపోవాలనే ఆడు సారా తాగితే తనకేం నష్టవంట? ఆ మాటకొస్తే యిప్పుడు తనువాట్టుక్క తాగడా? అన్నాయంగా బీదోళ్ళని దోసుకోని, డబ్బు కూడేసుకునేవోళ్ళని, దారి కాసి సొమ్ము లాక్కుంటే అది బందిపోటుతనవెట్లాగవుతాది? సుకంగా తిని పడుండక. ఎదటోళ్ళ ఏగతం పీలిచి, వాళ్ళు బసీ జలగల్లాంటోళ్ళని ఏంచేస్తేమాత్రం తప్పేవున్నాదీ! మిగిలినోళ్ళకి

వుపకారం చేసినట్టు కాదో ? నాయంగా పోయీవోడికి వచ్చి మంచిసిల్లే ముట్టవుగందా, పెపంచకంలో నాలుక్కాలాలపాటు బతికి. పెళ్ళాం బిడ్డలికి కూడెట్టవాలిసినోళ్ళు ఏదో ఓదారట్టా పోతే బతకడవెల్లాగంట? తెలివిమీరిన మనుసుల్ని మంచి తనంతో ఒప్పించకపోతే కర్రెత్తి బయపెట్టడం తప్పాడు పనా? బూమ్మీద బతికీవోళ్ళందరికీ సుకపడ్డానికి యీలుండాలని ఒప్పు కున్నవోళ్లు నలుగురూ గూడుపుటానీచేసి మిగిలినోళ్ళ పొట్టల మీద కొట్టడం మటుక్కు తప్పు కాదో? ఈళ్ళుమాత్రం మను సులు కారో? తెలివి లేదో? ఒకడికీ, మరొడికీ నడాన తేడాలు సూచించి ఈళ్ళలో ఈళ్లకి దెబ్బలాట లెందుకెట్టాలి! తన సొంతలాబం లాటిదే ఎదటోళ్ళదీ అని తెలుసుకుని, ఓ మనిసి మరో మనిసిని నోరారా 'తమ్ముడా!' అంటూ ఎందుకు పిలవ లేడూ? కట్టవూ, సుకవూ కూడా ఆళ్ళల్లో ఆళ్లు అందరూ పంచుకుని ఒకరికోరు సాయం చేసుకుని అందరూ బాగుపడే దారెందుకు సూడ్రో?

మోసాన్ని మోసంతోనే లొంగదియ్యాల !

పెపంచకవుగుట్టుమట్లన్ని కడకంటా తెలుసుకున్న వోడు బద్రయ్య. ఆడు చేసే పనుల్లో తప్పులు దొల్లడాని కీల్లేదు!

పాతకాలపు టూలోసన్లూ, ఎర్రి ఏదాంతాలూ పెట్టుకుని ఆళ్ల బాగోగుల్ని ఆళ్లే నీళ్ళకొదిలేసి, ఎందుకూ పనకిరాని సచ్చు దద్దమ్మల్లా తయ్యారయి, గద్దెక్కిన గడుసోడికల్లా సలావుచేస్తా, కుక్కలికంటూ కూడా కనాకట్టపు బతుకు బతుకుతన్నారు. సీ! ఎదవ మనుసులు!

ఎంకన్న బుర్రలో యిన్నిరకాల ఆలోచన్లు దొల్లుతా వుంటే ముసలయ్య ఆడి కళ్ళల్లోకి సూత్తానేవుండి పసిగడ తన్నాడు. ఇదంతా బద్రయ్య తరిపీదనీ తెలుసు.

సీతమ్మ పొయ్యిసరడం మానేసి, యిసినకర్ర చేత్తో పట్టు కుని అలాగే కూసుండిపోయింది.

తువ్వాలుగుడ్డ గుంజిలుప్పైకి సుడుముకుని ఎంకన్న ఎలపలి కొచ్చాడు. బద్రయ్య సావాసంతో ఆడిలో సురుకుపా లెక్కు వయింది!

"ఎంకన్నా!" గట్టిగా అరిశాడు ముసలయ్య. ఇనిపించుకో కుండానే నడిసొచ్చాశాడు.

"ఈ ఎర్రోళ్ళని వొప్పించడిం నా తరంకాదు తల్లి! ఆ బగమంతుడే కాపాడాల!" ఉషూరు మనిపించింది ముసలయ్యకి.

ఆడి మొగం వొడిలిపోయింది. కాళ్ళు ఏదో బయంతో వొనికిపోయాయి. సేతులు దడదల్లాడాయి.

దగ్గిరి కొచ్చి తాతని బల్ల మీద కూకోబెట్టింది సీతమ్మ.

ఒటేలు సెద్దులో పక్కగదిలో కెళ్ళి బట్టలు మారుసు కున్నాడు ఎంకన్న. ఇంతట్లోకే లగెత్తుగుంటా సెరబ య్యొచ్చాడు.

రావులమ్మ, రవణయ్య, సెరబయ్య ముగ్గురూ వూళ్లో కొచ్చేతలికి సలిదికూడే శయింది. ఏదో ఎవజ్జెంటు పనుందని సెరబయ్య ఏరే దార్ని ఎల్లిపోయాడు. రావులమ్మా, రవణయ్యా గోదారిగట్టంతా నెలుక్కుంటా వొచ్చి, సిగురికి సీతాలచ్చిం వొట్లో కొచ్చారు. పక్కగదిలో కెల్లారు. అంతకు ముందే ఆ గదిలోంచి ఏయో నవ్వు లినపిస్తున్నయ్యింగా నటు క్కుని పారిపోయాయి.

రావులమ్మ తనవోణ్ణి గుమ్మంకాడే చూసి ఒక్కుటు కురికి ఆడి మంచంమీద వాలిపోయింది. గుండిలిమీదపడి బోరుని ఏడుస్తన్నాది. తన్ని తను తిట్టుకున్నాది. ఆణ్ణి తను సరిగ్గా చూసుకోకపోడంవల్లే యింత పెమాదం వొచ్చిందనుకుంది. తన తప్పులు మన్నించి దేవుడు ఈణ్ణి — తనవోణ్ణి రచ్చించడూ?

సెరబయ్య గోడకేసి తిరిగి, సినేమా కుర్రదాని సొగసులన్నీ ఎదపలకి కనిపించీ బొమ్మ ఎంపుకి తిరిగి సిక్కి సిక్కి సూత్తన్నాడు.

రావి బాద సూత్తే రమణయ్యకి కూడా కళ్లు సెమ్మగిలినాయి.

ఎంకన్న బరువుగా రెప్ప లిప్పి చూశాడు. రావులమ్మ ఆడి మీదే వొరిగిపోయున్నాది. గుండిల మీద కుంపటి మండుతన్నాది. ఆ ఏడికి అది కయిలిపోతన్నాది.

"ఎల్లాగుంది ఎంకన్నా?"

మూలిగాడు.

"పాపం, గట్టి దెబ్బలే తగిల్నిట్టున్నాయి!"

"ఆసపత్రాల్నించి ఎప్పుడు తీసుకొచ్చారో?" అనడిగాడు సెరబయ్యని.

"ఈ ఏలేనంట!".

"మందు తెప్పిస్తన్నారా?"

"తెప్పించాల. డబ్బు దగ్గిర లేక వూరుకున్నాం!"

"అదేంటి సెరబయ్యా, డబ్బులేదని మందూ, మాకూ ఎయ్యాపోతే పేనం మీదకి రాదో!"

"అంపుకేగా నే నాలమూ రొచ్చింది! గొలు సిమ్మంటే ఆడు ప్మొ క్కి నీలిగింది. నన్నేం చెయ్యమంటా?"

సట్టుని మెళ్లోంచి గొలుసు తీసి సెరబయ్యి కందించింది రావులమ్మ.

అలా గిచ్చేడం ఎంకన్న కూడా పట్టి ప్తే సూశాడు.

"ఇదమ్మేసి, ఆ డబ్బుతో మందులు తెప్పించిపెట్టు అన్నా! నీ కాళ్ళట్టుగుంటా! నే నీ సెల్లి ల్ననుకో. నా తాళి సిలబెట్టు!"

ఎక్కెక్కి ఏడిసింది.

సెరబయ్య గొలుసు తీసుకుని సినేవా బొమ్మేంపు ఓ నవ్వు యిసిరాడు.

"బయంలేదు రావే! పట్నంలో పెద్ద పెద్ద డాకటేర్లు న్నార్లే! రకరకాల మందు లిత్తారు. నీ వోణ్ణి తప్పకుండా బతి కిస్తారు. నీలాంటిదాన్ని దేవుడు తప్పకుండా సూత్తాడు. ఏడవుకు" అంటూ జాలిగా మాటాడాడు రవణయ్య.

కొంచెం సే పున్నాక చేతిలో సంచీ తీసుకుని లెగిశాడు. "మరి నేనెల్లొస్తా నెంకన్నా! నీ పేనాని కేం బయ్యం లేదులే! కరీదయిన మందు లేనా వోడుకుని బేగే వొళ్ళు బాగు చేసుకో! ఇప్పుడు మా అత్తోరింటి కెడతన్నా నేను. దాన్నీ, పిల్లోణ్ణీ చూసి రెండు మూడు రోజుల్లో యింటి కొచ్చేత్తాను. మళ్లా కలుసుగుందారి!"

ఎంకన్న వులక లేదు. ఆడెంపు సూడనన్నా లేదు.

"ఎల్లొత్తా రావే!"

కడుపులో బాదపట్టలేపోయింది రావులమ్మ.

"ఏడిత్తే లాబవేంటే సెప్పు! ఇలాటప్పుడే గుండిక దయిర్నెం తెచ్చికోవాలి. నేమల్లా వొచ్చి సూత్తాగా! నీ కేం పరాలేదు."

దా నేడుపు సేవన మాసంలో వుబుక్కొచ్చిన వొరదని మించిపోయింది.

ఇద్దర్నీ జాలిగా సూత్తా, తలుపు చేరేసి రవణయ్య ఎలపలి కొచ్చాడు.

రావులమ్మ ఆడి మంచం కాడే సతికిలబడి కూకుని, కాళ్ళమీద సేతులెట్టుకుని మొగం వోల్సుకున్నాది.

రొండు సెగాలు యిటూ అటూ చూసి, ఎంకన్న సటుక్కుని మంచ మీంచి లెగిసి కూకున్నాడు.

రావులమ్మ కొయ్యిలాగయి చూసింది. దుప్పటీ యిసిరేసి కాళ్ళు జాడించాడు.

"సిలకంటె సిలకవే

బంగారు సిలకవే

పంచి వొన్నెల రావి సిలకా!"

అంటా రావులమ్మ బుజాలు పట్టుకుని లాక్కున్నాడు.

ఆడి మోసం దాన్కి తెలిసిపోయింది. కోపంతో కళ్లు ఎర్రబడినాయి. పౌవురసంతో పెదాలు తిట్టుకున్నాయి.

బుస్సుని ఆణ్ణి తోసేసింది.

"ఓసోస్! నీ దెంత సొగుసే సీ రావి సిలకా!" అంటా పట్టుకోబోయాడు.

"గొలుసు పోయిందని బాద పడతన్నావా? ఎర్రికూనా! దాంతో మేం కొత్త యాపారం పెడతాన్నావే! లచ్చలకి

లచ్చలు గడిస్తన్నాం కాసుకో మరి !" ఎదవ సెంద్రారం పోతే పోయింది కానీ అల్లాటియి రేపు ఎయ్యి సేయించిస్తాను. ఇంక మరి కోపం యిడిచేసి కూకోవో ?"

"స్సీ ! మాంసుదారోడా !" మొగం సిగ్గించుకున్నాది. ఆడి సేతులు తోసిపారేసి దూరంగా జరిగిపోయింది.

కారు కింద పడ్డాడనీ, పేనంమీంద కొచ్చిందనీ అబద్దాలాడి యిద్దరూ కలిసి తన్ని మోసం చేశారు. అనా తక్కువ నాలుగు కాసులు గొలుసు కాజేసుకున్నారు. తన మెళ్ళోంచి లాక్కుని ఆ సెంద్రకాంతాని కియ్యడానికేనా ?

సెంద్రకాంతం పేరు గురుతుకు రాగానే దానికి రగతం అంతా మొకంలోనే పేరుకున్నాది. కళ్ళు సిందూరవంయినాయి. పళ్ళు పటపటలాడాయి. ఒళ్ళు సలసలా కాగింది.

"అం తెసు రెందుకే! రావేం? ఆడదాని సొమ్ము తినేటంత సచ్చు మొగోణ్ణనుకున్నావా ? నీ డబ్బులో సిల్లుగవ్వ నాకక్కర్లేదు. గొలు సమ్మేసి, మావోడు తెచ్చి డబ్బంతా ఈ యాపారానికే పెడతాను. యాపార వంటే అనాకానీ యవ్వార వనుకున్నావేంటే ? మాది గొప్ప యాపారం ! ఏంటో తెలుసా ?"

ఆడు సెప్పే మాటలేయీ రావుఁలమ్మ యినిపించుకోలేదు. దాని కోపవంతా చందరకాంతంమ్మీదే గడ్డకట్టుకున్నాది.

టంకు పెట్టెలో దాసిన సీసా ఎలపలికి లాగి, రావుఁలమ్మకి సూపించి, యిరగబడి నవ్వాడాడు.

"మనం చేసే యాపారం అందరి లాంటిదీ కాదే ఎర్రి మొగవాఁ! తెలివితక్కువోళ్ళు నాసిరకంది సేత్తారు. మంది సొలా యిలవైంది. ఆళ్ళు పొగలు చేత్తారు, మనం రేత్తిరి. ఆళ్ళయి రూపాయిలూ, పావలాలూ లాబం. మనయి లచ్చలచ్చలు! బతికున్నన్నాళ్లూ బిగినీసు చేసినా ఆళ్ళకి మిగిలేది సున్న. మనకి పట్నంలో రెండు మేడలూ, ఆలమూళ్ళో పొలవూఁ, యిక్కడో సిన్న కారూ, మన పిల్లల్నెత్తుకోడానికి నవుకరోళ్ళూ—అబ్బో యిప్పుడే అంతా సెప్పేత్తే నువ్వు ఒళ్లు మరిసిపోవూ? మరేవోఁ నీకు ఆరు పేటల సెంద్రారం కావాలా, పదేను కాసుల రాళ్ళ నెక్కిలీసు కావాలా?"

ఆడి మాటలు అది యింటవుఁలేదు.

"పోనీ, నెక్కిలీసు మాట తరువాత సెబుదూగాన్లే! ఎంకన్న ఎల్లాంటోడో యిప్పుడేనా తెలిసిందా? ఈ సీసాలో కిటుకు గురుతు పట్టేవా? సెంద్రకాంత వుందేం. దాని కిదంటే మాా సెడ్డ మనుసు! నాతో బాటు కుసింత నువ్వు కూడా తాగ్గూడదో?" అంటా ఆ సీసా దాన్నోట్లో ఒంచెయ బోయాడు. రావుఁలమ్మ తోసేసింది. దా నొళ్ళు మండిపోతన్నాది.

ఆ గొడవలో పలాసటి పాలరాయిబొమ్మలాంటి బుల్లెమ్మ వురో గుమ్మంకాడ నిలుసోడం ఎంకన్న సూల్లేదు.

అగ్గిలో నూనేసినట్టయింది రావుఁలమ్మకి. ఇదేనా సెందర కాంతం? ఎందు కొచ్చిందో? గొలుసుకోసవేఁమో? తన సెంద్రారం కోసవేఁవో?, మొగుళ్ళనీ, మొగోళ్ళనీ ఎంతమందిని బుట్టలో ఏసుగున్నాదో? ఎన్ని కాపరాలు పడగొట్టిందో? బతుకంతా ఆళ్ళు సెవఁటోడిసి గడించిన నాలుగు రాళ్లూ తన

ఎదాన్నెట్టుకుని ఎంతమంది వుసురు తిన్నాదో ? రంగురంగుల సీరెలు కట్టి, దొంగ సింగారాలు తెచ్చిపెట్టుకుని, తియ్య తియ్యటి సూపులి కెనక గుండెల్లో యిసాలు దాసుకొని ఎంత మందిని పొట్టనెట్టుకున్నాదో ? పడగిప్పి ఒయ్యారంగా ఆడీ కోడి తాసులాగ, సెకసెకా సిందులాడే ఆడది కంటికి కనిపిస్తే మొగోళ్ళ సూపులో నాగస్సరా లెలా వుట్టుకొస్తాయో ? మన సిచ్చిన పెళ్ళాన్నొదిలి యిలాంటి మాయిదారి దాని కొంగట్టు కేలాడుతూ తిరగడానికి యీ మొగోళ్ళకి సిగ్గెంపకు లేదో ? నలుగురూ ఏలెత్తి సూపించరో ? పలానా రావ్వులమ్మ మొగుడు ఉంచుకున్నది అంటా ఆళ్ళు ఆడిపోసుకోరో ? తన పరువు పోదో ?

ఆడదంటే అంత మనుసు పడీవోడయితే పెళ్ళాన్నిడి సెయ్యాలనుందా ? అయినోళ్ళకి దూరమయిపోలా ? ఆడికేం కరువం కాలింపనీ ? ఎప్పుడేనా కాదో, కూడదో అంటే తను మట్టుక్కి ఆడి సరదాలకి అడ్డొడత్తాదా ? పీసు మిఠాయి యిట్ట వంటే ఒద్దని నోరు కట్టేస్తాదా ? ఏ పాపం చేసిందని తన కీరాత ?

అయిందేదో అయింది. ఇప్పుడేనా ఆడి మనసు మారితే అన్నారం సత్తెన్నారాయుడికి ఆరుపాయిలు ముడుపు కట్టదో ? తన కళ్ళల్లో నీళ్ళు తుడిసేత్తే, ఆ సింతలూరు నూకాలమ్మకి నిలువు దోపిడీ ఇయ్యానో ? తన కడుపునో కాయికాస్తే ఆ తిరప తెంకన్నకి ఒద్ది కాసులు ఒడినిండా పొయ్యదో ?

ఆడి బుద్ది మారితే దేవుడల్లే కాళ్ళకాడే పడుండదో ?

శివశివా ఎందుకొచ్చిన ఆడ బతికురాయిది అంటా బాదపడింది. తనకింత గతట్టినందుకు దాని మీద దానికే జాలి

కలిగింది. ఆడిమీద వుక్కురోసం వచ్చింది. ఓకిట్లో నిలుసున్న దాని మీద సిరుని లెగబోయింది.

మల్లా మనసు రకరకాలుగా పోతాది. ఆణ్ణిప్పుడు తిట్టుకుని ఏం లాబం ? దాంది మటుక్కు తప్పేవున్నాది ? దాని పొట్ట కూటికోసమే గందా అది అల్లా సేత్తన్నాది ! ఇంతకీ తన రాత బాగావుంటే యిల్లాగెందుకవుతాది ? ఎంకన్న మీదొచ్చిన కోపం కూడా రావులమ్మ గుండిల్లో లోతు కంటా ఎల్లి జాలిగా కరిగిపోయింది.

ఆడి తప్పేలేదు. ఈ మాయిలన్నీ దానియ్యే ! స్సీ ! ఆడదయి పుట్టి ఆడోళ్ళ మీందే పగబట్టినాది. మెరుపులా మెరిసి, పిడుగులా నెత్తిన పడింది. సుట్టూతా గూడు కట్టుకూకున్న జనం దాని ఏడికీ, ఎలుగుకీ ఎప్పుడో అప్పుడు మాడి బుగ్గయి పోయిావోళ్ళే !

కళ్ళల్లో కోపాలు వాడిగా పదునెట్టి గుమ్మంలోకి చూసే తలికి ఆ సిన్న దక్కడ లేదు.

తన్నిచూసి బయపడిందా ? ఎందుకొచ్చిన ఏసవంట ? తన కాపరం నట్టేట్లో ముంచడానికాకాదో ? అయినోడు అలాంటోడయ్యాడు కనక, అలుసు తీసుకుని తనమీద సవ్వారీ చెయడానికాకాదో ?

ఇదేం పట్టనట్టే, ఎంకన్న గది కిటికీలన్నీ మూసేసి, సీసా అంతా కాళీచేసి, మనుసుట్టి బడ్డట్టు సూత్తా రావులమ్మ దరి కొచ్చాడు. ఎర్రెక్కినట్టు చూసింది.

"ఓసి పిచ్చమ్మో ! నీ కంత దుడుకెందుకే ?"

అప్పటికీ ఆడి బుర్ర, కాపీ గళాసులో సెంచా పెట్టి తిప్పినట్టు, తిరిగి పోతావుంది. ఏం మాటాడతున్నాడో, ఏం సేత్తన్నాడో ఆడికే తెలీకండా అయిపోయినాది.

ఆవురావురు మంటా లగెత్తుకొత్తన్న ఎంకన్నకి దొరక్కుండానే తప్పించుకుందారనుకున్నాది రావులమ్మ. అయితే ఆడిది ఏనుగు బలవాయె!

పిచ్చి కుక్క మీద కుసుకుతా వున్నపుడు, బచ్చవేసి అరిసే చిన్న పిల్లలా కూసింది రావులమ్మ. కళ్ళల్లో కక్కిన నిప్పుల ఏడికి ఒళ్ళంతా సెమటలు చిమ్మాయి. గొంతుకు బిగిసి పోయింది.

అంతకు ముందెప్పుడూ ఆణ్ణి అలా సూళ్లేదు. సూత్తాదని అనుకోనూ లేదు. మనసులో ఎన్ని దణ్ణాలెట్టినా, యీయేల ఆణ్ని కొరుక్కు తినేద్దారన్నంత కోపవూ వొచ్చింది. కాని ఏం సేత్తాది? ఆడు తన మొగుడు. మొగోడు.

కాని, ఎంతయ్యెనా గుండె బలవున్న పడుసు కనక సటుక్కున ఆణ్ని తోసేసి, యిసురుగా బయిటికి వురుకొచ్చి పడింది.

ఆడు వోకిలి కాడికి వచ్చి, రెండు సేతుల్తోటీ గుమ్మం కమ్మీలు పట్టుకొని కసిక్కుని దాన్ని కొరుక్కుతినేట్టు సూశాడు. గుండెల్లో జోరు సల్లబడ లేదు. నిసా దిగనూ లేదు. కాళ్ళల్లో సుకుకు సన్నబడలేదు. నరాలలో గోల సప్పబడలేదు. ఓకిట్లోంచి ఎలపలి కొద్దారనుకున్నాడు. ముంగిటికి పోలాడు కూడా. కూతంతలోనే బిగిసి పోయాడు. కళ్ళు బయంబయంగా యిటూ అటూ పరిగెత్తినాయి. గొంతుకు తడారిపోయింది. గుండె సప్పుడు తగ్గింది. రాటకానుకుని సురసురా చూస్తున్న

సీతమ్మ కనపడ్డంతో ఆడు నిజంగానే దడుసుకున్నాడు. అడుగు ముందికి పడలేదు. సూపు ఎదర నిలుసోలేక పోయింది. సేతులు తలుపుల్ని వొదిలి రాలేక పోయాయి. ఎంకన్న సచ్చినట్టే అయిపోయాడు. సుకుక్కని కొరడా కర్రతో యీపు మీఁదెవరో కొట్టినట్టే అయిపోయాడు. ఈస్సెర యేసు సూసిన కోడితాసట్టే ఎనక్కి జంకేశాడు. ఒళ్లు వుండలు చుట్టుకుపోయింది. కాళ్లు సల్లబడ్డాయి.

* * *

బద్రయ్యగాడి సంగతి కొసకంటా తెలిసినోడు ముసలయ్య ఎంకన్న లాంటోళ్ళనీ. సెందరకాంతం లాటిదాన్నీ ఎన్ని పట్టిలు కొట్టించగల్డో, మసిపూసి ఎల్లా మారేడుకాయ సెయ్యగల్డో అంతా ఎరిగున్నవోడు. చేసే పన్లుకీ, చెప్పే మాటలకీ ఎంత తేడా కనిపిస్తాదో తెలుసు. ఆ వొచ్చీ మాటలు ఎంత లోతునించి వొస్తాయో కూడా సెప్పగల్డు. కడుపులో ఆలోచన్లు ఎదటోడు కనిపెట్టలేకుండా ఎన్ని రకాలుగా తిప్పగల్డో, సెవులారా యిన్నదే! ఇలాంటోణ్ణి నమ్ముకున్న ఎంకన్నగాల్లు పెళ్లాన్నీ, వూళ్ళని యిడిసేసొచ్చి యిక్కడేం పొంకుంటారో ?

తగిన అనబం అయితే కాని, ఎంకన్న దార్లో పడ్డని ముసలయ్య అనుకున్నాడు. అలాంటోళ్ళకి సల్లగా సెబితే బుర్ర కెక్కదు. మోకాలి సిప్పలు సితకబొడిస్తే కాని తల్లో జేజెమ్మ కిందకి దిగదు. అలాంటోడికి తను బాదపడితే మట్టుక్కి ఏం లాభం ? ఇసుగేసు కొచ్చింది ముసలయ్యకి. ఆడి ఆలోచన్లు ఎప్పు డెల్లాగుంటాయో సీతమ్మకి తెలుసు. నిజం సెప్పాలంటే ఆణ్ణి సరిగ్గా దార్లో తిప్పగల్ది తనొక్కత్తేనేవోఁ.ఎంకన్న మూలాన్ని

తాత ఎంత యిదయ్యాడో కనిపెట్టింది కనక, సల్లగా ఆడికి యీ మాటా ఆ మాటా సెప్పి మనసు మారసాలనుకుంది.

తాత లాంటోడు, సిలక్కి సెప్పినట్టు సెప్పినా లెక్క సెయ్యనోడు తన మాటింటాడా? అలాగని నోరు మూసుక్కూసుంటే ఆళ్ళ కాపర వేవయి పోతాది? ఆడి పెళ్ళాం వుసుర్ని పడిపోదో? బతుకు సితికిపోదో? అయినోడు అందరి నోళ్ళల్లోనూ పడిపోతే దాని పుట్టిక రచ్చకెక్కదో? పాపం దాని మొగం సూసయినా ఎంకన్నని మారసాలి!

ముసలయ్య యింట్లో లేనప్పుడే చూసి, బద్రయ్య కూడు తిండాని కొచ్చేవోడు. ఆడితో బాటు అప్పుడప్పుడు ఎంకన్నా వొచ్చేవోడు. ఆ సనువుతో ఆడు అదును కనిపెట్టి ఒక్కడే వొస్తావుండేవోడు. అప్పుడప్పుడు సీతమ్మ కూడా సొరవచేసి ఆడితో సల్లసల్లగా మాటాడతా వుండేది. రవణయ్యగాడి కవుర్లూ, పంటల యిసయాలూ ఏవేవో అడుగుతా వుండేది. అల్లా చెప్పుకుపోతావుంటే ఆడికి వుసారుగానూ వుంటుండేది. వూసూ బోతుండేది. ఏ సంగతయినా ఆణ్ణే అడగ్గలిగి సనువు తీసుకోడంతో బద్రయ్యకి దొరకని గని తన ఎదటే ఉన్నాదనుకున్నాడు.

కడకంటా సీతమ్మ తన్ని నోకంట కనిబెడతానే వుంటాదని పాపం ఎంకన్నకి తెలీలేదు. అది సెప్పీ మాటలూ, ఆడీ పరాసకాలూ, చేసీ పన్లూ తన మీద మనుసుపడే సేత్తావున్నాదనుకున్నాడు.

రాస్రులమ్మ గొలుసమ్మిన డబ్బుతో ఎంకన్న యాపారం మా జోరుగా సాగుతన్నాది. ఆదర్శించొచ్చి పడవలోళ్ళకీ,

యాపారం కోసం వొచ్చి సావుకార్లకీ, కూలీ నాలీ చేసుకునీ బక్కటోళ్ళకీ రొండోజావు రేతిరేలకి కల్లుముంతలు సరఫరా చేసీ పని ఆడిది. ఏ లంకల్లోనో తయారు సేయించి గడ్డి పడవల్లో దాసిపెట్టేసి కల్లు కుండలు యీడికోసం వొచ్చిపడుతూం డేయి. ఎవుడికి తగ్గ కవీషను ఆడి కిస్తా వుండీవోడు. తలుపులు గడియేట్టి వాకేట్లల్లోనో, కొబ్బరికాయి బత్తాల్గాట్ల సందుల్లోనో, యిరిగిపోయిన పడవాల కంతల్లోనో, అంటిగెల్ల సాటుని గుట్ట ల్లోనో ముంత లట్టుకుని ఎంతో మంది వొరిగిపోడం తనకళ్ళ ముందే ఆడు సూత్తా వుండీవోడు. తను సేత్తన్న గొప్ప పనికి ఆడికి సెప్పలేనంత వుసారు పుట్టుకొచ్చీది. తన్లో తనే మురిసి పోయీవోడు, ఇంతమంది బతుకులూ తన గుప్పిట్లోనే ముడు సుకో పోయాయి గందా అని.

అప్పుడప్పుడు మనుసేసి ఆడూ వొకో ముంత తాగుతా వుండీవోడు. కూతంత తాగితే కుతితీరనప్పుడు బుర్రికి బుర్రే ఎక్కించేసీవోడు. నిసాలో నిండిపోయి, వొళ్ళంతా మైకం కమ్మేకొత్తే నలుగురూ సాయంపట్టి తన్ని పడగ్గదిలో కూలేసిన రోజులూ వున్నాయి. ఇప్పటిక్కాని మజాచేసీ అదునుట్టవుం ఆడికి కలగలేదు. రొండు సేతుల్తోటీ డబ్బూ గడిత్తన్నాడు. సిటికిలో సెట్టంతోడు అయిపోగల్డు. తన యాపారంలో గొప్ప తన వేంటంటే ఆడుచేసీ పని అసలు రొండో కంటోడికి—ఆ తాగీ వోళ్ళకి తప్ప!—సత్తే తెలీదు. దానవోయి గుంటల్లో ఆడో ఆసంతస్తుల మేడ లేపాడంటే అప్పుడంతా కళ్లప్పసెప్పి సూత్తారు. పెట్టి పుట్టినోడని తెగపొగిడేత్తారు!

ఇంత దయిర్నె వున్నవోడే అయినా, అప్పుడప్పుడు తన్లో తెగ గింజుకుంటా వుంటాడు. ఏంటో ఆ బాద? ఎవురికీ నోరిప్పి సెప్ప లేకపోతాడు! మల్లా యింతట్లోకే, సీతమ్మ పూసు మనసులో ముసరడంతో బోల్డు బలం పోడుసుకొచ్చేది. మొగతన వున్నాసనిపించేది!

ఆడదాన్తో దొరికే సరదా అంతా తన పెళ్ళాంలోనే వుందనుకునే రోజుల్లో ఆ డొక్కి పల్లిటూరు బుల్లోడు. అదే పట్నవోళ్ళ రకంగా తయారయితే రంభల్లాంటోళ్ళు కూడా రావులమ్మ ముందర బలాదూరే అనుకునేవోడు. అయితే అది సెబితే యింటేగా? ముచ్చటపడి నైలాను సీరకొంటే సర్రుని తోసేసింది. పొగడరూ, సున్నోపూ కొంటే సట్టుకుని యిసిరేసింది. అట్టడుగుని దాక్కుండిపోయిన సొగుసంతా ఎలపలికి చూసుకు మురిసిపోదారంటే, ఆ ముచ్చటంతా అదే ముక్కలు చేసింది. దాంతో, ఆడి మనసంతా యిరిగిపోయింది. యాపారం కోసరం ఎల్లినోడు పట్నం వొదిలి యింటికి రాడానికే బుద్ది యింది కాదు. బద్రయ్య దరవవా అని దాపరికం లేని వొయ్యారవంతా సెంద్రకాంతంలోనే సూసాడాడు. కాని లాబవేంటి? మనుసుపడి దరికెడితే బద్రయ్యగాడే అడ్డు తగిలాడు. అలాటప్పుడు దాన్నసలు తనకి సూబిచ్చడ వెందుకో? యిల్లా బాద పెట్టడవెందుకో? గొప్ప కోసవా? అదీ తెలీకండా వున్నాది! పోనీ అద్దైతేనేం, ఆణ్ణి ఆటకాయించలేదో? అసలల్లాంటిదాన్ని తను నమ్మమని ఎవుడు సెప్పేడూ? అప్పటితో ఆనోళ్ళంటేనే సిరెత్తి కొచ్చింది. పట్నంల్లాగా వొచ్చాడు కసక, లచ్చలు కొద్దీ గడించి గొప్పోడయిపోతే అప్పుడు లచ్చలమంది సెంద్ర

కాంతాలు ఆశి కాళ్ళకాడికే వొచ్చిపడతా రనుకున్నాడు. దేవుడు చేసీ దంతా తన మేలుకే అనుకున్నాడు. ఇంతట్లోకే సీతమ్మ కంట బడ్డాది. అది కూడా బ్రెమ్మయ్యగాడి దరవేనే! అయితే మట్టుకు? ఆడంటేనే దానికి సుక్కొదుకు గందా! నాసావిరంగా, ఒక్క దెబ్బకి రొండు పిట్టలు రాలవో?

## 12

కడ వుచ్చుకుని సీతమ్మ నీళ్ళకోసం గోదారి కెడతా వుంటే, ఎనకాతలే పిల్లిలా ఎల్లిపోడు. సాటుసించయినా, దాన్ని సూడాలని ముచ్చటపడీవోడు. నీప్ప సంపుకుని గుడిసిలో కెడతా వుంటే, ఏం ఎరగనట్టు ఆడుగులో అడుగు కలుపుతా ఎల్లేవోడు. మరియాద కోసమని సీతమ్మ పీటేసి కూకోబెట్టేది. సంటేంటో సెప్పుకుపోతావుండీవోడు. పొయ్యూసుకుకుంటా, కూర తరు క్కుంటా, గెంజి నోస్సుకుంటా వూంకొడతా వుండీదవి. ఓనాడే మయినాదంటే యీడు సిగరొట్టు కాలుస్తా కవుర్లు సెబుతా వుంటే మాటల్లో గబుక్కుని నిలేసిందవి.

"ఇన్ని వూసులు చెప్పేవోడివి, ఎప్పుడూ నీ పెళ్ళాం సంగతే చెప్పవేంటి ఎంకన్నా ?"

ఆ మాట లాడికి సురుక్కుని తగిలాయి. సిరాకూ కలి గింది. సిర్రెత్తికొచ్చిది. అయినా దాందగ్గర ఎర్రోడిలా ఎంటుంటే ఏం తడకలు కడతాడో అని, మాట మారిసేశాడు. సీతమ్మ నవ్వింది. తిరిగి వొంటిల్లో కెళ్ళిపోతావుంటే మళ్ళా అడిగింది.

"మొగుడు వయ్యాక పెళ్ళాం వూసు చెప్పడానిక్కూడా సిరాకే?"

ఈసారాడు వుండబట్టలేక పోయాడు. పళ్ళు పటపట లాడించాడు. తుప్పుక్కుని వూసాడు.

"ఇప్పుడడిగితే అడిగావు కానీ, యింకెప్పుడూ దాని వూసెత్తకు సీతమ్మా!"

ఆ మాటల్లో కోపవ్వూం సూచించాడు. కుదేలయిం దది. మళ్ళా కొన్నాళ్ళదాకా దాన్ని కంటబడలేదాడు. ఆడి మనసు మారసకపోడం సరి గందా, తనే ఆళ్ళ కాపరానికి అపకారం సేత్తాన్నానేమో అనుకున్నాడి. ఈసారి గట్టిగా పట్టుకపోతే తను పస్ట కట్టువంతా నీళ్ళు కారిపోదో?

మునుస్త్రోజుని ఆడు జీడిపప్పు కాయిళ్ళు బేరవాడతా వుంటే, పనిగట్టుకుని ఎలపలి కొచ్చి, 'ఎంకన్నా!' అంటూ పిలిసింది. ఏ ఎగనున్నాడో ఏవో, దాని పిలుపు యినేసరికి నిన్నటి యిసురే మరిసిపోయాడు. ఏదో కాండికి బేరం పైసలా చేసుకుని, సుంకేయించుకుని, సెంగు నొచ్చి సీతమ్మ గుడిసికాడ వాలాడు. అప్పటిదాకా గుమ్మంకాడే నిలుసున్నదల్లా, యీణ్ణి చూసి సొగుసుగా నవ్వుతా లోనకి జరిగింది! యీడూ ఎల్లాడు. పాక నడాన్నున్న రాటకి సేర్లబడి కూకుందది. ఆడొచ్చి బల్లమీద సతికిలబడ్డాడు.

"కోప వొచ్చిందా ఎంకన్నా?"

ఆడి గుండెలు పొడిసేత్తన్నట్టు సూసింది. అదంతా తన మీద మోజేమో ననుకుని ముచ్చటపడిపోయాడాడు.

"సేస్సా! నీ మీద కోపవేంటి సీతమ్మా?"

ఈలయినంత సొగసుగా అందా రనుకున్నాడు. ఆడి మాటల సొగసుకి ఆడే పొంగిపోయాడు.

"నా మీద కాపోతే మరోరి మీదున్నాదో ?"

సిగ్గుపడి సిన్నగా నవ్వాడాడు.

"నీ పెళ్ళాంమీదేనా ?"

దాంతో ఆడి పెదాలు బిగిసిపోయాయి. సూపులు పదు నయాయి.

"మనద్దరి సడాన్నీ దానిమాట ఎత్తద్దని చెప్పలేదా సీతమ్మా !"

కోపం, సిరాకూ, సనువూ, పరాసకం కూతకూతే కలిపి మరీ అన్నాడు.

సీతమ్మ నవ్వింది. ఆ నవ్వు లోతెంతో ఆడికి తెలీనే లేదు.

"రావులమ్మ వూసంటే నీ మనసెందు కిరిగిందీ ?"

ఇంక అది తన మాట యినిపించుకునీట్టు లేదని తేలి పోయినాది. అంతల్లా గుచ్చిగుచ్చి అడగడంలో వుద్దేశవేంటో ? తను మాట మారిసినా అదింక తన్ని వొదద్దనీ తెలిసింది. ఒకేల దాన్ని వొప్పించాలని చూసినా తను నెగ్గలేడనీ తెలుసు. అందుకని దాంతో మాటాడ్డవే తగ్గించుకుందారని సూశాడు. సివోల్న బల్లమీంచి లెగిసి ఎలపలికి రాబోయాడు. అడ్డంగా నిలుసుని సీతమ్మ అటకాయించింది.

"కట్టుకున్న పెళ్ళాన్ని కట్టంపెట్టి నువ్వేం పొంకుంటావు ఎంకన్నా ? మనుసుపడి నిన్ను పెళ్ళి చేసుకున్నాది. తన సుకా లన్నీ నీ తోటియే అనుకున్నాది. తన బతుకంతా నీ కాళ్ళ

కాడే నయ్యేజం పెట్టింది. నువ్వే తన దేవుఁ డనుకున్నాది. అల్లాటి ఆడదాని కళ్ళంట నీళ్ళు తెప్పిస్తే నువ్వేం బాగుపడ తావు ఎంకన్నా ?”

తుపాకీగుళ్ళు పేల్చినట్టు యింతలేసి మాట లంటావుంటే ఆడు రాతిబొమ్మలాగే నిలుసుండిపోయాడు.

దీనికంతకీ బలం యిచ్చింది తన అలుసే అనుకున్నాడు ఎంకన్న. యియ్యకండావుంటే బాగుండిపోయీది. తన కాపరం గుట్టుమట్లన్నీ తెలుసుకుని రచ్చ కీడసడానికా ? పోనీగండా, ముచ్చటయిన పిల్లగండా తసంటే యిట్టపుగండా ! అని చెప్పేసి మనసిప్పి మాటాడితే యీదొమెల తన్నిలా టోకాయిస్తాదని ఎప్పుడేనా అనుకున్నాడా ?

సీతమ్మమిూద ఆడికి కోపఁవొచ్చిన మాట నిజవేఁ కానీ, వొచ్చినా తను ఎర్రోడయిపోడం తప్ప దాన్నేం సెయ లేడనీ తెలుసు. అందుకే, యిప్పుడయినా మించిపోలేదు కనక, దాని మనసు మారసడం సాలా మంచి దనుకున్నాడు. బద్రయ్యగాడి కెల్లాగా అది లొంగేదీ కాదు. సెరబయ్యగాడు సరేసరి, సన్నచ్చ గటం ! ఇంక తనొక్కడికే ఆ యీలు సిక్కింది. నాసావిఁరంగా యీ అన్నలో దానికి సరీగా సక్కలిగింత లెట్టేడో, మల్లా రావుఁలమ్మ వూసెత్తుతాదా ? అంత గొప్ప వుపాయం బుర్రకి తోసినందుకు తన గొప్పతనాన్ని తనే నమ్మలేకపోయాడు. పట్టిందల్లా బంగారఁవయితే ఎయ్యి దేవుళ్ళకి కొబ్బరికాయలు కొట్టడా ? మల్లా ఆలమూరు దారి కూడా తొక్కాలేంటి ? మొగమిూ్మద సిరాకంతా చేత్తో తుడిచేసుకుని జేబీలోంచి మల్లా బీడీపీకి తీశాడు. అగ్గిపెట్టె నిండుకున్నాది.

"కూతంత అగ్గెడతావా సీతమ్మా?" నోటినిండా అడిగాడు.

"ఎవురికీ?"

నవ్వాడు.

"రావులమ్మకా?" అదీ నవ్వింది. కళ్ళు వోరగా పెట్టింది. "అగ్గెడ్డానికి నేనేం దాని మొగుణ్ని కాదుగా!"

"అయితే నేద్దానికి అగ్గెడతన్నానంటావా?

"సెప్పుకోడానికూడా సిగ్గు లేదో?"

"సిగ్గనీసి ఆడోళ్ళ సొమ్ము!"

"మొగోళ్ళు యిలాంటోళ్ళు అయితే అంతే మరి! సిగ్గూ పడతారు. ఈలుంటే సావనూ సత్తారు!"

"పీడే యిరగడవుద్ది!"

"నువ్వింత కటికోడి వనుకోలే ఎంకన్నా!"

"కటికోణ్ణో, మంచోణ్ణో నువ్వే సూత్తావుగా!"

"ఏంటీ?"

"ఏంటో యిప్పుడే సెబితే సరసం దెబ్బతింటాదే ఎర్రి దానా!" దానొంక మల్లా సూడకండానే సెంగుని దాటేశాడు ఎంకన్న.

సూడగా సూడగా ఆడి యవ్వారం బద్రయ్యకి యిడ్డూర వయినాది. ఇన్నాల్లాయి తన పంచని సేరినా, ఎప్పుడూ సీతమ్మ ఎంపు కన్నెత్తి సూడనోడు, యీమద్దె దాని గుడిసిలో కంత సొరవగా దూరతన్నాడేవాఁ అనుకున్నాడు. తన్ని సూత్తే సివా లెత్తీ సీతమ్మ ఆణ్ని దరికెల్లా రానిత్తన్నాదో?—అనీ అనుకున్నాడు.

తన వొడ్డీలో కొచ్చినోడు రోజురోజుకీ మెరికిలాగయి పోడో? సురుకుపా లెక్కువు కాదో? తన పెగ్గికి తనే మురిసి పోయాడు. నోట్లో ఏలెడితే కొరక లేనోళ్ళని కూడా వొజ్జిర్లా మెరిపించీ యిద్దెలు తనకాడున్నందుకు మీసాలు కూడా దువ్వుకున్నాడు.

మరిగంటే, ఆ సురుకే యింకో పాలెక్కువయిందంటే మొదలుకే మోసం రాదుగందా? ఎర్రెంకన్నగాడే చూసి చూసి తనకే ఎసరెట్టడు గందా? పంజిరప్పులో సిలకలాగున్న సీతమ్మని చూసుకు మురుసుకుపోతన్నందుకు, తన కళ్ళల్లో కారంకొట్టి ఎగరేసుకుపోడు గందా?

అయినా బద్రయ్యగాడి సంగతి ఎరగనోళ్ళెవరంట? ఆవులిత్తే పేగుల్లెక్కెట్టడో? ఆడి కళ్ళెదర రొండోకంటోడు దాన్ని దక్కించుకపోగల్డనే? రగతం తాగెయ్యడో?

అసలు సెంద్రకాంతంమీంచి సూపు మల్లించాలనే తను ఎంకన్నని సారా యాపారంలోకి దింపింది. పనేం చేయకండానే లాబంలో సగవోటా తను గుంజుకుంటున్నాడు. ఆ వుపాయం ఆడికి యింటో గూడా సనువిచ్చాడు. ఆ సందట్టుకుని, ఆడే కనక సీతమ్మని ఏసుకుపోదారనే చూసేనో, పేనాల్తో తను యిడుత్తాడనే? తల తెగ్గొట్టి కోటగుమ్మం కాడ నడిబజార్లో కట్టిపోతే తనపేరు బద్రయ్యేనా అంట?

అల్లా గనుకుంటానే కూతంత తమాయించాడాడు. ఎవ్వారం ముదిరినప్పుడు మాటగందా! ఈలోగా ఎయ్యి కళ్ళతో కనిపెట్టుకు నుండకో? అప్పుసరవొత్తే కాళ్ళిరగ్గొట్టడవే కాని, యిప్పుడే తొందరపడితే బెడిసికొట్టదో? ఏవయినా

ముందుసూపు మంచిదేలే! గట్టోళ్ళని నలుగుర్ని ఆడిమీద నిగాపెడితే సరి!

ఇలాగంటా ఏవేవో ఆలోసన్లు బుర్రలో దొల్లిపోతా వుంటే ఎనకేపునించొచ్చిన సెరబయ్య యీపుమీద చెయ్యేశాడు. ఉలిక్కిపడ్డాడాడు. సెరబయ్య నవ్వాడు.

"ఏంటో ఎత్తు లేస్తన్నావు గురో!"

"అబ్బే! ఏవుందిరా సెరబా! ఆలమూరోడు లేడూ, ఎవుర్రూ మన ఎంకన్నగాడు—"

"హోరి! ఆణ్ణి గురించి యింతాలోసి నెందుకు గురో?"

"నువ్వూ సూత్తానే వున్నావుగా!"

"సీతమ్మతో సరసాలేనా? పోన్లే గురో! కట్టుకున్న పెళ్ళాం దగ్గిర లేపోతే, ఎంతటోడికయినా ఎటకారవాడా లని పిస్తాది! పాపం, ఆపాటేనా యీలియ్యకపోతే ముమ్మరంలో వున్నోడు గందా, ఆడింక మనం సెప్పిన మాటింటాడా?"

బద్రయ్య సురసురా సూశాడు, సెరబయ్య కూతగ్గాడు.

"అది కాదు బద్రయ్యా! నేనో సంగతి సెప్పనా సీతమ్మమీదాడికి మోజు కలగడం కూడా మన మంచి అనుకో!"

"ఎంలాగో?"

"సెబుతా యిను! ఓ మడిసిని మనం గుప్పిట్లో పెట్టుకోవాలంటే, సనువిచ్చి యిచ్చి, లైవుం కనిపెట్టి, ఏదో వొంక మీద సటుక్కిని దెబ్బకొట్టాల. తెలిసిందా? ఇక్కడా డుండగా సీతమ్మని బుట్టలో ఏసుగున్నాడంటే, దానికితగ్గ అనబం నేను

చెయ్యనో? అందుకు మనం మంచి అనుకోసం సూత్రా వుందారి. ఏ ఎగలో అయినా ఆడు కాని సీతమ్మ సిగ తడివాడో, సేతులూ కాళ్ళూ యిరగ్గొట్టి కుళ్ళబొడవనో? అయినా కాని, బద్రయ్యా! సెరబయ్యగాడుండగా సీతమ్మ మీద యీగ వోల్తాదనే?”

ఆడి ఆలోసన బాగా నచ్చింది. నోరు మెలికిలు తిప్పి, మీసం మెలేసి, సూపులో సగం దాసి, గొప్పోడిలా నవ్వాడు బద్రయ్య. నవ్వుతా సెరబయ్యగాడి యీపు చరిశాడు.

ఇద్దరూ నవ్వుకుంటా లెగిసి ఎల్లిపోయారు.

రేవులో లంగర్లేస్తా పడవోలు దాపుకి సేరేత్తన్నారు. కొంతమంది పల్లోళ్ళు గెంజి నోరుసుకోడం కోసం సిసురు లిసుత్తా వున్నారు. ఒకో బుల్లోడు బియ్యం కడుగుతాన్నంటే, మరోడు చేదేసి నీళ్లు తోడతా వున్నాడు. సంజె ఎల్తురు సల్లగా పాకిపోయింది. ఆ రోజు అమావోసి. మినుగురు పురుగుల్లానున్న పడవోల్లో కిరసనాలు దీపం బుడ్లు తప్ప యిడిస్తే ఎలుగన్నదే సున్న.

గోదారిమీంచి యీసురుగాలి జోరుగా కొడతన్నాది. పడవోల్లో దీపం బుడ్లు బయ్యం బయ్యంగా వొనుకుతన్నాయి. అయి అల్లా దడుసుకోడం చూసేనేమో, కెరటాలు మరీ ఎక్కి-లాక్కు-పోతన్నాయి.

గుడిసిలో సీతమ్మ ముసలయ్యకి గెంజిపోసింది. ఆడు తాగేసి ఎక్కడికో అల్లాగే ఎల్లిపోయాడు. తను కూడా కూతంత తాగి, నులకమంచమ్మీద నడువాల్సింది. రాటకున్న కిరసనాలు బుడ్డి ఎగురతా సంటన్నాది.

లోన గడెట్టడం మరిసిందో ఏవో. యిసుసుగా ఎవ్వరో తలుపు తొయ్యటప్పట్తో బళ్ళుని సప్పుడయింది. ఉలిక్కిపడి సీతమ్మ మంచంమీాంచి లేసి నిలుసున్నాది. వొచ్చినోడు ఎన కాతలే గడీ బిగించి, జుట్టెగదోసుకని, సేతులు రొండూ సన్న కెట్టుకుని, ముచ్చటగా నవ్వాడు.

ఆడికళ్ళు కమ్మరి కొలిమిల్లాగున్నాయి. సూపులు సూదిమొనల్లాగున్నాయి. ఆడు రాడవే ఆకల్తోవున్న పడుసు సింపంలాగొచ్చాడు.

సీతమ్మ దడసల్లాడింది. సూపులు సెదిరిపోయాయి. నరాలు అదిరిపోతన్నాయి. ఒళ్ళంతా బయంతో ముడుసుకు పోయింది. మినుకు మినుకుమంటా వున్న దీపం నీడలో రాటని కరిసిపెట్టుకు పోయింది. దాని వొనుకు సూత్తే ఆడికి మరీ సొర వొచ్చింది. రొండడుగులు ముందలికేశాడు. కానీ, సీతమ్మని అంటిపెట్టుకున్న రాటమ్మటుకు ఎనక్కి ఎల్లనేలేకపోయింది.

ఇంకా ఆడు దగ్గిరి కొస్తున్నాడు.

సీతమ్మ మరీ వుండసుట్టుకు పోయింది.

రాటమీాద చెయ్యేశాడు.

దాని గుండిలిమీాదే ఏసినట్టయింది.

గిజగిల్లాడింది. నోటంట మాట ముందే పోడంతో అరుపు అంతకంటా అనిగిపోయింది.

ఆడి కంతకంటా, మాటల్లో అసలు పన్లేదు.

సీతమ్మ కాళ్ళు పట్లు తప్పాయి. మెడ వొలిపోయింది. వొంజల్లుకి తడిసి ఉక్కిరిబిక్కిరయిన ముద్ద సేవంతిపువ్వు సొగసు దాన్లో కనిపించినా దాడికి. సుతారంగా లెగదీశాడు.

సీతమ్మ వొళ్ళు అంతకిముందే సచ్చిపోయింది!

ఎన్ని పొగడన్లూ, సున్నోవులూ కోటా కొట్టుకున్నా, తైలానుసిలుకు సీలు ముచ్చటగా కట్టుకున్నా, సినేవాం ఆడోళ్ళలా వొయ్యారం తెచ్చుకున్నా, సేత్తో సారా గళాసు తీసుకొచ్చి నోటికి అందిచ్చినా, మెత్తని బూరుగుదూది పసు పులుమీద కూకోబెట్టి మల్లిపువ్వుల వోసన్లలో ముంచేసినా, ఆనాడు తెలివితప్పి పడున్న—అని ఆడి బుర్రలో తెలుసుకునీ సత్తావు సచ్చిపోయినా – సీతమ్మ ముందల ఎయ్యిమంది రాసం లమ్మలూ, పదేలమంది సెందరకాంతాలూ బలాదూరే అని పించిందాడికి.

ఊగుతా వూగుతా, వుయ్యాల్లు వూగుతా కొండెక్క డానికి మొదట మెట్టుమీదున్న దీపబ్బుడ్డి ఎంపు నవ్వుతా సూసి, సీతమ్మొంపు తిరిగి కళ్ళనిండా సూసుగుని, సొగసుగా వొళ్ళిరుసుకున్నాడు.

* * *

తోలాట యిడిసి యిళ్ళకి పోతావున్న జనానికి గోదా రొడ్డుకాడ పడవోల రేవులో ఏంటో గొడవ యినపించిం కొబ్బరికాయిల బత్తాలు ఎసక్కీ యీడిసిలాగి, యిద్దరు మను సులు ఎవుణ్ణో సితకా, బోతకా బాదుతావుంటే, ఆడి ఏడుపులూ మూలుగులూ గట్టిగాయినపించాయి. దాంతోటి సుట్టూతా జనం పోగయి, లగెత్తి కెల్లారు. ఇంతలోకే కొట్టినోళ్ళిద్దరూ మాయ వయ్యారు. ఆదరాబాదరాగా ముందరి కొచ్చి, వొచ్చినోళ్ళలో యిద్దరు దెబ్బతినోణ్ణి లెగదీసుకుని పక్కకెల్లిపోతావుంటే, పోతావుంటే, ఓడు మీసం తడుంకోడవుం, మరోడు వొంటి నా

సవ్వడవూ, అక్కడున్నోళ్ళకి సర్గ్గా కనిపించలేదు. గోదారంతా మల్లా వాడ్గుతో కలిసి అమావోసి సేతిరిలో మునిగిపోయింది.

కోడి కూతేలకే లెగిసి పదాలు పాడుకుంటావున్న ముసలయ్య, తూరుపుకొండ మీద ఎర్రటి ఎలుగులు ముసురుతా పసుపు రాడంతో పంచుప్పల్లి తీసి మొగం కడుక్కొని, గోసీ పెట్టుకొని, సంకకర్రా పంచిగుడ్డా గట్టుమీదెట్టి గోదాన్లోకి దిగాడు. ఉతకాలాడతన్నంతసేపూ ఎప్పుడూ ఆడి బుర్రలో ఏయో పరిగెడతానే వుంటాయి.

అంతకి ముందరదాకా, నిద్దరకొట్లో ముడుసుకుపోయిన మనుసులికీ, యిన్నేసి ఎలుగులు యిసరతా వున్న సూరీడికీ వున్న సుట్టరికవేంటి ? మనసుల్లో మురిగిపోతన్న వోరవలేని తనవూ, కుతిలేసి దాగవూ, దొంగబుద్ధీ, మాటదగా—అన్నీ సేతిరేల ఎలపలికి లెగిసొచ్చి, దొంగసాకుల్తో మనసిని సుట్టేసి, మాయవోలలు పన్ని, ఎదటోళ్ళ మాట లెనకుండా సెవులు గళ్ళడేసి, ఏ ఎంపుకి తప్పించుకుపోదావన్నా ఆడికి సందియ్యకండా సేసి, ఏవేవో ఎదవపన్లు ఎందుకెందుకో సేయిత్తా వుంటాయి ! అయి సేత్తావున్నంతకాలం, ఆటి మంచిసెడ్డలు తెలుసుకుని బుర్ర ఆడి తగ్లోంచి తీసి దాసేత్తాయి. అయినా కూడా అప్పుడు గుండె గోలెడతానే వుంటాది పాపం! సోడా కాయ పోర్సులా ఆడి జోరు సల్లబడ్డంతోటే, ఎనకటి ఎగలో సేసిన పన్లన్నీ జాయిగా ఎలపలికొచ్చి యిాణ్ని నిలదీసి సవ్వ జాయిసీ అడుగుతాయి. అంతకి ముందు ఎంతమంది కళ్ళల్లో కారవ్వ కొట్టినోడయినా యిాటికి జవాబు సెప్పుకోలేక కొట్టుకుపోతాడు. ఏదో వొంకెట్టుకున్నా, తనకి తను సరిసెట్టుకోడవే అవుతాది. పాపం యిా గొడవంతా తనకి తప్ప రొండో

కంటోడి కెప్పుడికీ తెలీదనుకుంటాడు. అల్లా ఎప్పుడి కాడే అనుకో డవ్వంలో వున్నాది సిత్రవంతా.

ఎప్పటికో వొళ్ళు మరిసి నిదరోతాడు. ఆ డప్పుడు సచ్చి నోళ్ళల్లోనే జవం. అల్లా కొన్ని జావులు పోగాపోగా, ఎప్పటికో తెల్లవోరతాది. అది ఆడికి తెలీనే తెలీదు. సూరీడు సూదులు కాలిసి ఎర్రగా కళ్ళల్లోకి గుచ్చడంతో, మొగానికున్న మాసి కిలు సటుక్కుని తుడిసేసుకుని కొత్తవ్రాత ఏసుగుంటాడు. మల్లా అదో జనవం! మల్లీ రేతిరయితే మల్లా మల్లా అదే.

రోజు రోజుకి కొత్త ఆసెలు పుట్టించి, కొత్త ఎలుగులు యిరజిమ్మే సూరీడికీ, బూమ్మీదుండీ మనిసికీ వున్న సుట్టరికం-సొగుసుగా యిడిసీ పువ్వుకీ, ఆ వోసన్ను మింగిన గాలికీ వున్న పేగు సమ్మందవేఁవో!

అనుకుంటానే ముసలోడు తానవంసేసి గట్టుమీద కొచ్చాడు, పెదాల్లో ఏటేటో గొనుగుతా రొండు సేతులూ పైకెత్తి, పైనున్నోడికి దండాలెట్టాడు, కిందికొంగి బూదేవమ్మకీ పెట్టాడు. ఒళ్ళు తుడుసుకుని కర్ర సంకల్లోకి దూర్సుకుని ముంగటికి నడిసిపోయాడు.

ఆయేల కప్పుడే మొగం కడుక్కుని, కడవ సంకలో బెట్టుకుని నీళ్ళకోసం ఎదురొచ్చి సీతమ్మ యింకా తలుపు తెరిసిన అలికిడే కాలేదు. రేతిరి సరింగా నిదరట్టలేదేవోఁ! పాపం, చిన్న పిల్ల!

'అటు సూరీ డిటు పొడిసినా వొంటి సుకవంటే ఎరగని సిన్నది యీయే లింత పొద్దెక్కే-దాకా మగతగానే వుండటం ఏంటో?' అనీ అనుకున్నాడు. అనుకుంటానే గుడిసెంపకి

ఎల్లాడు. లోపకి నడిశాడు. ఎల్లి మళ్లీ తలుపు సేరేసేడు. సీతమ్మ యింకా నిదర్నించి లెగలేదు. గోడమీద బల్లిలా మంచాన్ని కరుసుకున్నాది.

'ఏంటో?' అనుకున్నాడు ముసలయ్య. సిన్న అనవానవూం పొడుసుకు వచ్చింది.

'లేపుదారా? అయినా ఎందుకో?' అనుకుంటా మంచం కాడ కెళ్లాడు. వొళ్ళు మరిసి నిదరోతన్న పిల్లని లేపడానికి మన సొప్పక ఎనక్కి తిరిగాడు. గోదాట్లో తడుపుకొచ్చిన పంచిగుడ్డ నీళ్ళు పిఁసి, దండెంమీద ఆరేశాడు. బొత్తావుల బనీనేసుకుని కర్ర టకటక లాడించుకుంటా గుమ్మంకాడి కెళ్లి తలుపు లాగాడు.

"తాతా!" అంటా గావుకేకెట్టింది సీతమ్మ. ఉలిక్కిపడి ఎనక్కి తిరిగాడు. ఆ కేకే ఆడి గుండెల్లోకి పొడుసుకెళ్లి ఎయ్యి సాల్లు తిరిగి పలికింది. బయం, బాద, జాలి, ఏడుపు !

తలుపు సేరేసి మళ్లా మంచంకాడి కొచ్చాడు.

"ఏంటమ్మా?"

మాట నోటంట రాకండానే బుర్ర వోలుసుకున్నాది.

పలకలేదు. తల గుండెల్లో దాసుకున్నాది.

"వొంట్లో బాగోలేదా తల్లీ? పెసాదం దొరగారికాడి కెళ్లి వుపాపతీమాత్తల్లు తెమ్మన్నావా? రేతిరీ పొగలూ యింటో పనితో, పాపం నీ వొల్లు వూసవయిపోతన్నాది. నీ యీడు పిల్లలింకా అమ్మకాడే వుండవొలిసినోళ్ళు! ఏం సేత్తాం! దేవుడు నీకీ కట్టా లెట్టాడు. జబ్బు సేసి బాదపడ్డం నీ వొంతూ, సూళ్ళేక బాదపడ్డం నా వొంతూ! అంతా ఆ బగవంతుడి

మాయ! పోనీ; దరవాసుప త్తిరిలో అనుకు తెమ్మన్నావా? సెప్పమ్మా! మా యమ్మవుకదూ!"

మంచందరికెళ్ళి వొంటిమీద సెయ్యేశాడు.

"ఒద్దు తాతా! వొద్దు నన్ను ముట్టుకోద్దు!" అంటూ ఎక్కెక్కి ఏడిసింది.

ముసలయ్య కంతా అయోమయమయిపోయినా, ఆలో సనగా పైకి సూశాడు.

"అమ్మా! ఆడు కాని—"

"తాతా!"

బొద్దులోంచి లెగిసిందా అనుపు. లోన రగిలిన బాద పొగిలి పొగిలి ఎల్లుకొచ్చింది.

"ఆళ్ళ వూసెత్తకు తాతా! ఆళ్ళదేం తప్పు లేదు. నేనే పనికిమాలినదాన్ని! నా రాత్తిల్లా కాలింది!"

ముసలయ్యకి వొళ్ళు మండిపోయింది. కంటబడితే సాలు ఆడి రగతం తాగేసేవోడిలా వురివాడు.

ఇంతట్లో తలుపుతోసుకుని ఆడు రానేవచ్చాడు. వొచ్చి ముసలయ్య ముకంలో కోపంసూసి, ఎంటనే ఎల్లిపోబోయాడు. కాలు టకటకలాడించుకుంటూ నడిసెల్లి ముసలయ్య ఆడిజెబ్బట్టుకున్నాడు. బలంగా ఎనక్కి తిరిగాడాడు. సేతుల్లో బుజాలు అదింపట్టి, ఆడి కళ్ళల్లోకి సూటిగా చూశాడు. బిక్క సచ్చిపోయాడాడు. కొంచెం దయిర్నెం సిక్కబట్టుకుని నోరు మెదపబోతావుంటే సెళ్ళుని లెంపకాయ కొట్టాడు ముసలయ్య. అదిరిపోయాడు.

"ఏంరా? ఎదవా! బతికుండాలని లేదేంట్రా? దా నోంటి మీద సెయ్యేశాక నిన్ను పేనాల్తో వొదుల్తానన్నా ననుకున్నా వట్రా? ఆ యేల దీని జిగినీ గొలుసు తీసుకున్ననాడు నాకిచ్చిన మాట మరిసిపోయావంట్రా? మాటాడవేం?"

సేత్తో, వాసిన బుగ్గ రాసుకుంటా సూశాడాడు.

"నాకేం తెల్దు."

"తెల్దూ?"

"ఉహు!"

"నోర్ముయ్!"

"నిన్న నే నసలు గుడిసిలోకి రాలేదు."

"నువ్వు రాపోతే వొల్లకాట్లోవోడు యింకెవు డొత్తా డురా?"

"..........."

"సెరబయ్యగాడా?"

"ఏవో!"

"ఎంకన్నగాడా?"

"ఏవో!"

"ఏవో నంటావంట్రా? నాకాడ దాసడానికి నీ కెన్ని గుండిలున్నాయి? మరియాదగా సెప్పు. లేపోతే నీగుడ్లు పీకేత్తా! రగతం తాగేత్తా!"

సిన్న నవ్వు నవ్వాడాడు.

"ఎన్ని తిడతన్నా సిగ్గులేదంట్రా?"

"నాకేంమరో?"

"మరెవురో సెప్పు. ఊఁ"

"నేను కాదు."

ఆ మాటతో ముసలయ్యకి సిర్రెత్తుకొచ్చింది.

"దొంగెదవలందర్నీ సేరదీసి, దిక్కులేని ఆడకూతురు బతుక్కి నిప్పెడతావంట్రా?"

"నే కాదంటే నన్నంటావేఁ?"

"అన్నో"

మల్లా నవ్వాడాడు.

ముసలోడు కాగడాలా లెగిశాడు. సంకలో వున్న కర్రెత్తి ఆడి నెత్తినెడతా—

"సచ్చావురా ఎదవా!" అంటూ అరిశాడు.

"తాతా!" అని గట్టిగా అరిసి, గబుక్కుని మంచం మీంచి లెగిసి, సీత మొక్కొచ్చి అడ్డు పడ్డాది.

"తప్పు తాతా!" యీణ్ణి కొట్టకు. యీడిదేం తప్పులేదు. అదంతా నా కరవఁ! ఎవుళ్ళనని ఏంలాబం? సిన్నతనంలోనే అయ్య సచ్చిపోయాడు. అమ్మా, ఆమా గోదాట్లో కొట్టుకుపోయారు. నావలేక నేను బతికాను. బతికుండగానే సచ్చిందాన్ని తాతా! నారాత ఎవుణ్ని కొడితే మారతాది?"

అది ముసలయ్య కాళ్ళమీద పడ్డాది, యిదిలించుకున్నాడు.

"నీకు తెల్దు సీతమ్మా! సూత్తా వూరుకుంటే యీళ్ళ దండగం పెచ్చు పెరుగుతన్నాది. అవుసరవొచ్చినపుడు కాళ్ళిరగ్గొట్టాపోతే యీడి బుద్ది దారికిరాదు.!"

"ఒద్దు తాతా! ఒద్దు!" అంటా తాతని సుట్టేసుకు పోయింది సీతమ్మ.

ఆడు సల్లగా జారుకున్నాడు.

సీతమ్మని లెగదీసి గుండెలి కొత్తుకున్నాడు ముసలయ్య.

ఆడి కళ్ళెంట పడ్డ వుడుకు నీళ్ళు సీతమ్మ తలమీద అబిసే కాలు సేశాయి!

# 13

ఆరాడం రాడం, రావులమ్మ ఆలమూరొచ్చీతలికి పిడుగులాంటి కవు రిన్నాది !

రాయవంద్రం నించిపోడం, తిన్నగా రవణయ్య అత్తారింటికే ఎల్లాడంట. ఎడతావుండేటే దార్లోనే సెప్పుగున్నారంట, ఏలేస్సిరంలో కల్రారోగం పాకిపోతన్నాదని. మాటిమాటికీ యిరేసినా ల్లిడవ్వూ, టపీటపీమని మనుసులు సచ్చిపోడవ్వాను! ఆ మాటిండంతో ఆడికి బయవయితే కలిగిందంట కానీ, ఆ రోగవే తన పెళ్ళాం పేనాలు తీస్తాదని ఆడు అనుకోలేకపోయాడు! అప్పుడే నీళ్ళోసుకున్న బాలింతరాలు, సంటిగుడ్డు తల్లి, సత్తెమ్మత్తని కలరా జబ్బు పొట్టనెట్టుకున్నాది!

ఆడు ఊర్నించి వొచ్చిందే తడువు, తలుపు గొళ్ళెమెట్టి రవణయ మావింటి కెల్లింది రావులమ్మ.

పావుకాటు తిన్నోడిలా పడున్నాడాడు. గాలి దువారంలో నేలకొరిగిన మొక్కల్లాగున్నారు పిల్లలు! సంటోడో పాత గుడ్డమీద కునుకు తీస్తున్నాడు. మూల్నున్న పొయ్యి సప్పగా సల్లారున్నది. ఇల్లంతా బావురు మంటా వున్నాది.

రాపులమ్మని సూసీతలికి రమణయ్య బాద ఆగింది కాదు. గట్టు తెగిన గోదారిలాగే ఏడుపు పొల్లుకొచ్చింది. దెబ్బ తిన్న లేగ దూడ్లాగే ఎనక్కి వాలిపోయాడు. అరిసేతుల్తో మొకం కప్పేసుకున్నాడు. దోసిళ్ళతో నీళ్లు గుమ్మరిస్తున్నాడు.

కడుపులో తల్లిపేగు గిలగిలమన్నాది రాపులమ్మకి! రమణయ్య దరికెల్లి సేతులు పట్టుకున్నాది. కంటి గుడ్లు నీళ్ళలో నాని ఉబ్బరించినాయి. ఆ సూపుతో దాని కళ్ళు సెమ్మగిలినాయి.

"ఏం సేత్తాం మావా! పూడ్సలేని ఎత్తొచ్చింది! నన్నూ పిల్లల్నీ అన్నాయం సేసి పోయినాది, సత్తెమ్మత్త! రాకరాక ఆ మాయిదారి రోగాలు యిప్పుడే రావాలా? పోక పోక ఆ వూరికే పోవాలా? అంపులోకి సత్తెమ్మత్తనే తీసుకుపోవాలా? ఈ కాడికి మన్రోజు బాగోలేదు మావా! ఏం సేత్తాం? సీతామాలచ్చింటి యిల్లాల్ని పొట్టనెట్టుకుని పండంటి కాపురం బుగ్గి సేసిందా మాయదారి రోగం!"

ఆ మాటల్తో తగ్గడానికి బదులు ఆడి బాద మరీ ఎక్కువయింది. పెళ్ళయినకాడినుంచీ జరిగినవన్నీ ఒకోటే ఆడి బుర్రలో గిర్రుని పరుగిడుతాన్నాయి. గుండె దిట్టం సేసుకోడం మల్లీ సేతకానిదయింది. ఆడుమ్మలకేం సేత్తాడు? ఉసూరమని వాలిపోయాడు.

"సూడు మావా! ఇల్లా సూడవూ? నా మాటినవూ? నువ్వే యింత బెంబేలయిపోతే ఆ సంటోళ్ళు ఏమయిపోవాలి సెప్పు! పెద్దోడివి, మొగోడివి నువ్విలా కళ్ళు తడుపుకోవచ్చా? లెగిసి మొకం కడుక్కో! కుర్రోళ్ళని దరికి తీసుకో. ఇప్పుడే

పోయి రాజేత్తాను. కుసిన్ని గెంజినీళ్లు తాగుదుకుగాని. ఎన్నాళ్ళయితే పోయిన సుకొత్తాదిసెప్పు! ఆళ్ళకి అమ్మవయినా, అయ్యవయినా యిప్పుడు నువ్వే గందా! నువ్వింత బాదపడితే ఆళ్ళు చూసి బతగ్గల్రా? లెగు మావాఁ! లెగు!"

"ఒద్దు రావేఁ! నన్నిలాగే ఉండిపోనీ. నా బతుకిలాగే సల్లారిపోనీ! నా గుండి మండిపోనియ్యి. బతికున్నన్నాళ్ళూ దాన్ని ఎన్నో బాదలెట్టాను. సీవంత లోటొత్తే సిర్రూ బుస్సూ మన్నాను. సివాఁలెత్తాను. నోటికొచ్చినట్టు తిట్టాను. కర్ర విరిగేట్టు కొట్టాను. నా సుకం కోసం పేనాలిచ్చి ఆడది యింటోనే వున్నా, దీనెంటా, దానెంటా పడ్డాను. దాని గుండిలు కోసిన కటికోణ్ణి నేనేనే రావీఁ!"—

"తగిన శాత్తే అయింది నాకు! నట్టనడేట్లో మమ్మల్నిడిసేసింది. పురిటోసన పోని సంటిగుడ్డునీ, యీ సిన్నోళ్ళనీ నన్నెలా పెంచమంటావు రావీఁ? అమ్మని సూబించమని ఆళ్లూ నిల్దీసి అడిగితే నన్నేం చెప్పమంటావు రావీ?"

ఒలవోలా ఏడిశాడు. అంత గుండి నిబ్బరవుఁన్న రావుఁలమ్మ కూడా సెదిరిపోయింది.

"బయంలేదు మావాఁ! ఎవురున్నా లేకపోయినా సాటోళ్ళం మేంవున్నాం! నీ బిడ్డలికేం బయం లేదు. పువ్వుల్లో పెట్టినట్టు మేం పెంచుతాం. లెగిసి కళ్లు తుడుసుకో మావాఁ!"

"రావీ!" అంటూ గుండి కదిలిపోయీలా ఏడిశాడాడు.

ఇంట్లో పన్లు సక్కబెట్టుకోడవేఁ తడవు ఆయేళ్టినించి రోజూ రవఁణయ్య మావఁ యింటికాడ వాలిపోయీది. పూట పూటా పప్పుసారో, దొండకాయకూరో, తోటకూరపులుసో

రవణయ్యకోసం, ఆడి పిల్లకోసమనీ తనింటోనే ఏరే చేసిపెట్టి పెట్టిగడతా వుండేది. పిల్లకి ఉడుకునీళ్లోసి ఉతికిన బట్టలు తొడిగేది.

జాయిగా ఆడు కూడా సత్తెమ్మని మరిసిపోవాలనే సూత్తావుండేవోడు. లోపల్లోపల రావులమ్మ మంచితనానికి ఎయ్యి దణ్ణాలు పెట్టేవోడు!

రవణయ్య మావని సూత్తన్నకొద్దీ రావులమ్మ కడుపులో దిగులెక్కువయింది. ఎనకట్లా ఆడు మునసబుగారి పన్లు అట్టే సూట్టంలేదు. బారెడు పొద్దెక్కేదాకా నిదర లెగడు. అప్పటికే ఆడి పిల్లలు లెగిసి ఆకల్తో ఏడుస్తా వుంటారు. సూరులోంచి పండుపుల్ల తీసి మొగం కడుక్కుంటానే పొయ్యి రాజేస్తాడు. ఇంతట్లోకే ఒక గళాసుడు పాలు తెచ్చి పోత్తాడు సుబ్బగాడు. గయిరమ్మొచ్చి యిల్లు తుడిచి, ముంతలు కడిగిపెట్టి ఎల్లిపోతాది. అప్పటికే కుతింత కాఫీకాసుకుని ఆడు తాగేత్తాడు. మిగిలిన పాలు సల్లారబెట్టి కుసింత పంచదారేసి పిల్లలికి పట్టేత్తాడు. ఆ పొయిమీందే అత్తెసరేసి, పిల్లల్ని యీదుగు మీద కూలేసి ఎక్కడికో ఎల్లిపోతాడు. ఏ మిట్టమద్దినాలకో తిరిగొచ్చేతలికి ఆకల్తో నకనకలాడుతావున్న పిల్లల్ని లోనకి తీసుకెళ్ళి, ఉప్పూ, కారం నలిపి ఒణ్ణాపెడతాడు. పెద్ద ముంతలో పులిబెట్టిన గంజి తీసి దాంటో కుసింత సల్ల కలిపి ఆళ్ళకి పోసీవోడు. అప్పుడప్పుడు వల్లచ్చమ్మగారు పెట్టే వూరగాయి పచ్చడి నంజుకోడానికేసీవోడు. మల్లా యిల్లిడిసి ఎల్లిపోతే వూరంతా మాటుమనిగాక ఒచ్చేవోడు. పిల్లలమీద అప్పుడప్పుడు యిసుక్కునీవోడు కూడా! అంతలోకేమల్లీ ఆళ్ళని గుండెల్లో గుచ్చుకుని కళ్ళెంట నీళ్ళెట్టుకునీవోడు.

కన్ను మూసి కన్ను తెరిసేలోగా ఎల్లాటి కాపర మెల్లా గయిపోయింది! ఆడదన్నది లేపోతే అన్ని కాపరాలూ యింతే గందా! సిరొత్తే దాంతోనే రావాల! తుడిసిపెట్టుకుపోయినా దాంతోటే పోవాల! ఏ రోజు ఎల్లా గడుస్తాదో ఏం చెప్ప గలం మనం? రొండు పుష్కరాలేనా దాటకముందరే, సత్తె మ్మత్తకి నూరేళ్లూ సిండాయి గందా! గలగలమంటూ అందరి చెప్పాడు చేస్తా నడుత్తన్నప్పుడు లచ్చిందేవి గుడిలా కలకల్లాడతా వుండే యిల్లు, యీయేల ఎలెలబోయింది. కోడికూతేలకే లెగిసి, వోకిలి తుడిసి, కళ్ళాపుసల్లి, ముగ్గుపెట్టి కొంప బారెడు పొద్దెక్కినా చెత్తా సెదారంతో కలకుల్లాడతన్నాది. సద్దికూ డేలకే ఇంటో పనంతా కానిచ్చుకుని పిల్లలికి నీళ్ళోసి, చెక చెకా పన్లు చేసుకుని, సంటోణ్ణి వొళ్లో బెట్టుకుని మొగుడుకోసం వోకిట్లో కాసుక్కూకునీ దేవత మాయమయిపోయింది! ఎంతలో ఎంతయింది!

ఎనకటి సంగతులన్నీ తలుసుగున్నప్పుడు రావులమ్మ మనసు రకరకాలుగా పోతాది. తన కడుపూకాత్తే సత్తెమ్మత్త లాగే తనకీ బూమిమ్మీద నూకలు సెల్లిపోతే తనవోడు కూడా యిల్లాగయిపోయీవోడే గందా! ఏళ్ళ తరబడి తన్ని తలుసు కుని మనస్సు రాయి చేసుకునీవోడు గందా!

సత్తెమ్మ సోట్లో తన్నే చూసుకున్నప్పుడు రావులమ్మ గుండి సెదిరిపోయింది. దాని బిడ్డలు తన కడుపునే పుట్టినట్లు కళపెళ్ళాడీది. గుండెల్లోంచి జాలి వుబుక్కొచ్చి తను ఆళ్ళింటి కెల్లి పిల్లల్ని సూసొచ్చీదాకా మనసు మనసులో వుండీది కాదు. ఆళ్ళని దగ్గరికి చేరుసుకుని కళ్ళల్లో నీళ్లు కుక్కుకునీది.

నోకిట్లో ఆవుదూడ అంబా అని అరిత్తేసాలు సటుక్కుని ఆ పిల్లలే మనసులో మెదిలీవోరు. చెట్లమీంద గూట్లో తల్లిపిట్ట కూనలకి చిన్న చిన్న తిండిగింజ తెడిచేసాలు, ఎసకటి సత్తెమ్మ కళ్ళముందాడీది. పిల్లి పిల్లల్నెత్తి ఏడిస్తు తిప్పినట్టు, రావులమ్మ ఆలోసన రకరకాలుగా పోయాది! ఎప్పుడి బాదలు ఎవుడు చల్లార్సగల్డు? అనీ తెలుసు. కాని గుండె ఆగదు. అసలు ఆళ్ళకీ తనకీ ఏంటి సుట్టరికం? తను ఆరిసీదా, తీరిసీదా? అయినా పాపం సిక్కబట్టుకో లేదు.

సెనివోరం సంతలో రవణయ్య మావ కనిపించి అన్నాడు, సిన్నోడికి పులపర వొచ్చిందని. ఎంటనే ఎల్లి ఆణ్ణి చూసొచ్చేదాకా వుండబట్టలేకపోయింది రావులమ్మ. నులక మంచంమీద మగతగా పడున్న పిల్లోణ్ణి తీసుకుని గుండెలి కొత్తుకున్నాది. వోళ్ళంతా తడించూసి చెంగుతో వొత్తి పట్టు కున్నాది.

అప్పుడు రవణయ్యగాడి బుర్ర రకరకాలుగా నడిసేవి. అసలు తన కది ఏవౌతాది? చిన్నతనంలో మోజుపడి ఎర్రోడిలా దాని చుట్టూ తిరిగేవోడు. తన్ని చూసీతలికి సీదరించు కునీది. మనుసుపడి పెళ్ళి చేసుగుందారంటే యిదిలించి కొట్టింది. ఎంకన్నగాడికే ఆ అదుట్టం పట్టింది. ఊళ్లోవున్న సీటుకత్తె లంతా తన్ని చూసి మురిసిపోతంటే అది వోర్సలేకపోయాది. రానురాను తనమీద కోపంపోయి, సనువుగా మాట్లాడతా వుండీది. ఆ సనువుతో అప్పుడప్పుడు సరసవ్వూ ఆడీది. ఎంకన్న గాడు పట్నం పట్టుకుని ఏలాడతావుంటే, మనసిరిగిపోయి యింట్లో సీకట్లోనే ఒక్కత్తీ కూసుండిపోయాది. తన ఎటకా

రాలు చూసి అప్పుడప్పుడు మోజుపడీది కూడా! తన పెళ్ళాం పురిటికి పుట్టింటి కెళ్ళినప్పుడు ఎంతో యిదిగా మాటాడతా వుండీది. తన గుండెకాయి అప్పుడప్పుడు ఎగిసి పడతా వుండీది. అయినోడు తాగుబోతయి, వూరకుక్కలా పట్నంలో తిరుగుతా వుంటే, గుండె రాయిచేసుకుని, వున్న మోజులన్నీ సంపుకుని ఎండాకాలంలో రాదారి పడవలాగ బతుకుతన్నాది. ఎప్పుడూ కలకల్లాడీ మొకం యిప్పుడు జిడ్డు కారతన్నాది. ముచ్చటగా కట్టుకునీ సీర నల్లటి బొగ్గు మాసికిలు పడుంటాది. మూడు పూవులు, ఆరు కాయిలుగా వుందనుకునీ కాపరం రచ్చకెక్కడంతో, దొడ్లో మల్లెంట్టే పీకేసింది! ఎసకట్టూ అందరిళ్ళకీ ఎళ్ళడం మానుకున్నాది. మాట్లాడ్డవూ తగ్గించుకున్నాది. అమావోసి రేతిరో దీపం వెలిగించుకోడవంటేనే సిరాకయి పోయింది.

అల్లాటి రావులమ్మకి తన బిడ్డల మీద ఎంత కింత కనికారం? తను ఏ జనమలో చేసుకున్న పున్నెవో! అదికాని సల్లగా సూడాపోతే ఆళ్ళేవయిపోయివోరో? తన కంటంలో పేన వుండగానే తన బిడ్డలు, తను కన్న బిడ్డలు, చెట్టుకీ, పుట్టకీ కాకండాపోతే తన బతుకెందుకు, కాసనా?

అప్పుడాడు రావులమ్మకి చేతులెత్తి దణ్ణాలే పెడతాడు. మొన్న తొలమావోసినాడు, సింతల తోపులో తన్ని పావు కరిసి యిల యిలా తన్నుకుంటావుంటే అది ఎంత ఏడిసిందనీ! ఎన్ని దేవుళ్ళకి మొక్కుకున్నాదనీ! అసలే తల్లిలేని పిల్లలు! ఆళ్ళ గతేం కావాలి? పావులనరసయ్యంతటోడు, యీరబద్రయ్య ఒచ్చి మంత్ర వేస్తావుంటే, నోరు పెగిలి మా

టొచ్చేదాకా ఎయ్యి కళ్ళతో సూత్తావుండడం ఎంతమంది సూడ లేదు! గరువు సెరువు ఎనకాతల సింతలతోట సుబ్బారావు పుంతకాడున్న కస్సింతాకు పసరు తెచ్చి కట్టు కట్టలేదో? కాటు మాటడిపోయి తను మల్లా మామూలు మనిసి అయిందాకా రేతిరీ, పొగలూ సంటిపిల్లోణ్ణి కని పెట్టుగున్నట్టు చాకిరీ చేయ లేదో?

తన పిల్లల్నే కాదు, తన్ని కూడా అది తల్లిలాగే చూసు కుంది? ఈ రునం ఎన్ని జనవాలికి తీర్సగల్డు?

ఇల్లా గాలోసిత్తా, పలుపు పేన్తావున్న రవణయ్య దరి కొచ్చింది రావులమ్మ, సంటోణ్ణి బుజం మీా దడుకోబెట్టు కున్నాది.

"సెలపతిగారికి సూబించి అరుకు తేలేకపోయావా?"

"ఆరు బండిమీద సందిపూడెల్లారని సత్తిగాడు చెప్పాడు. అందుకని కావరపు సూరయగారికాడికి తీసికెల్లాను. ఏదో పొట్లాలిచ్చి తేనెతో నాకిచ్చమన్నారు."

"మరి నాకించావా?"

"రొండు సుట్లిచ్చాను. దగ్గుపోర పొల్లుకోస్తావుంటే అంతా కక్కేడు. లోనేంయివళ్ళేదు."

"ఓ పొట్లా విలాగియ్యి నే నాకిచ్చిసూత్తా!"

రవణయ్య లెగిసి, గూట్లోంచి మందుపొట్లావూ, తేని సీసాకాయీ రావులమ్మ కిచ్చాడు. సిన్న గరిట్లో పొడవేసి తేన్తో రంగిరించి, సంటోణ్ణి ఒళ్ళో కూకోబెట్టుకుని కొంచెం కొంచెం నాలిక్కి రాస్తన్నాది. ఆడు తియ్యతియ్యగా సప్పరిత్త న్నాడు.

రవణయ్య సుట్ట ముట్టించుకుని మంచంమీద సతికిల బడ్డాడు. ఆడి బుర్రలో ఏయేయో ఆలోసన్లు దొల్లిపోతా వున్నాయి.

"ఒకాడదది సచ్చిపోడంతో యిల్లు వొల్లకా డవుతా దనుకోలేదు రావీఁ!"

మొగం పైకెత్తి చూసి, మళ్లా పిల్లకి మందెడతా వున్నాది రావులమ్మ.

అప్పుడు గొంతు సయిరించుకున్నాది.

"ఏం సెబుతాం మావా! ఒక్క మనుషులే అన్న మాటేంటి? ఈ బూ పెపంచకవులో కనిపించీవన్నీ సిగురు కింతే! మనం పెట్టిపుట్టేనాటికి బగమంతుడు ఏయేయో మన కిత్తాడు. అరిసేతిలో వొయికుంటవేఁ సూబిత్తాడు. కాని, అప్పుడు మన కళ్ళకి పొల్లు కమ్మెత్తాయి. ఎదటున్నదాన్నే వున్నదున్నట్టు సూళ్ళేం! అయినా అయిమట్టుక్కి ఎన్నాళ్ళు నిలవఁడతాయి? మూన్నాళ్ళ పట్టపొగలు! ఒచ్చినయన్నీ ఒచ్చించోటికే పోతాయి. మనం వొంటిగాళ్ళ వఁయిపోతాం. మన సూపులు ముక్కలయి, గుండె బద్దలవుతాది. తల చెక్కలు చేసుగుంటాం! కానేం లాబం? మనకీ దానికీ బాకీ సెల్లిపోతే ఎంత మొత్తుకున్నా ఎనక్కిరాదు. ఆ సంగతి తెలుసు కోలేక మనం ఎప్పుడూ బాద పడతానేవుంటాం మావాఁ!

"మనం పాపిట్టోళ్ళం అవడం మూలానే సత్తెమ్మ తల్లి మన్ని యిదిలేసి ఎల్లిపోయింది. ఇక్కడితో దానికీ మనకీ సరి. ఇంక మనం మరిసిపోకపోతే, యీ బూమ్మీద బతకలేం మావాఁ!"

"బతకలేపోతే సావడం మంచిదికాదా?"

"ఆ బాదలో మనవల్లాగనుకుంటాం కాని, సావడాని కూడా పనికిమాలినోళ్ళం మావాఁ! మంచయినా, సెడు అయినా సెపుదల్చుకున్నదల్లా సెయగలిగితే మనం మనుసుల వఁసించుగుంటావాఁ? అయితే దేవొతలం, లేకపోతే రాకా సోళ్ళం! కష్టాలన్నీ కాపరం సేత్తా కూకుంటాయా? తల్లిపోయిన పిల్లలుగందా ఆళ్లని పెంచి పెద్దోళ్ళని చెయ్యడం నీ వంతు కాదా? ఏవున్నా, లేకపోయినా ఆళ్లని చూసుకునే నువ్వు బతకాలి! సచ్చిపోయినా సత్తెమత్త మనసెప్పుడూ యీళ్లనే కనిపెట్టుగునుంటాది! ఆళ్లకేలోటూ రాకుండా చూసుకోగలిగితే మనకదే పదివేలు!"

ఆ మాట యింటూంటే ఆడికళ్ళు సెమ్మగిలినాయి. జలజలా ముత్తాలు రాలిపడతన్నాయి.

"ఒద్దు మావాఁ! కళ్లు తడవనీయకు. సత్తెమ్మ మనసు కుసుటబడదు!"

"నీకు తెల్దు రావీఁ! నా మనసులో బాద నీకు తెల్దు. ఈళ్ళ నిలా పెంచడం నా తరం కాదు. సంటోడికింత కాయిలా చేసింది. నువ్వొచ్చి ఆడి పేనం కాపాడావు. మరోళ్ళొత్తారా? నీకు మట్టుకూ ఎప్పుడూ యీాలుంటాదా? నేనింక సెప్పలేను రావీఁ!"

"తప్పు మావాఁ! మగోడివి, ఏడాకోకూడదు. నిన్నూ, నన్నూ, యీాళ్ళనీ, అందర్నీ కాపాడే బగమంతు డున్నాడు లెగు మావాఁ!"

బోరుని ఏడిశాడాడు.

రావుఁలమ్మ యింటిమొకం పట్టీతలికి గుడిసిలన్నీ మినుకు మినుకు మంటా వున్నాయి. సెట్లమీంద పిట్టలు కిసకిస లాడ తన్నాయి. నాగులు సెర్లో నీళ్లు ఎనక్కి పరిగెడతన్నాయి. గురువుగారి గవుడుగేదె మేత నవఁల్డం మానేసి అరుస్తావున్నాది. చెరువు గట్టుమీంద రాయిసెట్టు ఆకులు గిలగిలా కొట్టుగుంటు న్నాయి. సుబ్బారాయుడు గుళ్లో గంటలు బయఁం బయంగా మోగుతన్నాయి. నిమ్మగడ్డోరి దొడ్డికాడ నీళ్ళగుంటలో కప్పలు అరుస్తావున్నాయి. నిదర గన్నేరు సెట్లు జుట్టిరగబోసు కున్న రాకాసుల్లా నిలుసున్నాయి. యఁనవండోరి యీాది ముందు పారావోళ్ళలా నిలుసున్న పోతుకుక్కలు రొండు రావుఁలమ్మని చూసి బొయ్యి మన్నాయి. గుండి బిగబట్టుకుని సెరసెరా కండిగి లోకి నడిసిపోయింది.

గుమ్మంకాడి కెల్లి తలికి, తలుపులు తెరిసెట్టి వుండడంతో రావుఁలమ్మ అదిరిపడ్డాది.

"దొంగోడేవ్!"

లోన కెడదారనుకున్నాది. బయివేఁసింది. సందేలప్పుడు లోనకి దూరి ఎప్పుడో దోసుకుపోతావుంటే సూత్తా ఎలా వూరు కుంటాది? మనసు నిబ్దొక్కుకుని పిల్లిలా లోనకి నడిసింది. సీకటి గుయ్యారం. మనిసి అలకిడి లేదు. సల్లగా గూటికాడి కెల్లి దీప బ్బుడ్డి తీసింది. అగ్గిపెట్టికోసం తడివింది. దొరక లేదు. ఇంతలోకే తన సిగకాడ ఎవురో అగ్గిపుల్ల గీశారు. సటుక్కు వెనక్కి తిరి గింది. ఆ ఎలుగులోకూడా ఎంకన్న మొగం రగతం కక్కుతు న్నాది. కళ్ళు రొండూ కొరకంచుల్లా మండుతున్నాయి. మొగం బిగుసుకుపోయింది. అక్కడక్కడ తెల్లటి పట్టీలున్నాయి. తలకి

పెద్ద కట్టున్నాది. సేతిలో బుడ్డి జారిపోయీాటంత వానుకు పుట్టింది దానికి. ఆడే బుడ్డి అందుకుని, గూట్లో పెట్టి ఎలిగించాడు.

సానాసేపటిక్కాని దాని నోరు పెగల్లేదు.

"ఎంతసేపయిం దొచ్చి?"

"ఏం?"

"అడక్కోకూడదా?"

"ఇంత రేతిరిదాకా ఎక్కడున్నావో నువ్వే సెప్పు!"

ఆళ్ళ వెనకాతల వో ఎకిలి నవ్వు యినిపించింది. రావులమ్మ ఎనక్కి తిరిగి చూసింది. సెరబయ్య! ఆ రోజు తన్ని మాయిచేసిన ముండాకొడుకు!

ఆడి నవ్వు దానికి సిరాకయింది.

"ఎవుడి దగ్గిరికెల్లావో సెప్పవే!" అంటా గదవాయించాడు ఎంకన్న.

మల్లా నవ్వాడు సెరబయ్య.

"ఇల్లాంటి సమయాలు నువ్వడక్కోకూడ దెంకన్నా!" ఆ మాటల్లో యిసవున్నాది.

రావులమ్మ సీదరించుకున్నాది. కళ్ళల్లో కోపం సూబించింది కాని ఏం లాబం? తను ఆడది! వుసూరు మంటా పక్కకి తిరిగింది.

"సెప్పవేం?"

"రవణయ్య యింటికి!"

"మల్లా యింటికొచ్చావేం మరి?"

రావులమ్మ కళ్ళు గిరగిరా తిరిగాయి.

"ఇంకా ఏడుత్తావంటే!"

"ఆళ్ళ సంటోడికి పేనం మీదకొత్తే సూద్దార నెల్లాను"

"నోర్మూయ్ డొక్క సీరేత్తాను. ఆడికొచ్చిందే, యిప్పుడు నీ పేనం మీదకే వొచ్చింది. కాసుకోయే!"

"నీ పాదాలమీద ఒట్టు! నే నేపాపవూ ఎరగను!"

"స్సీ? ఎదవ..." అంటా జుట్టుకు గుంజి యిసురుగా సెయ్యెత్తాడు ఎంకన్న.

"ఆగాగు ఎంకన్నా! ఏంటా ఎర్రిపని? ఆడదానిమీద సెయి జేసుకుంటావా? తప్పు కాదో?" అంటా ఆణ్ణి గుంజి ఎలప లికి లాక్కొచ్చాడు సెరబయ్య. ఇద్దరూ అరుగుమీద కూకు న్నారు.

"సూడు ఎంకన్నా! ఇలాంటి సిన్నసిన్నోటికి మనం కోప్పడకూడదు. రావులమ్మ సెప్పింది నిజవో అబద్దవో మన కెందుకు కానీ అంత యిసురుగా సెయ్యెత్తొచ్చా?"

"కళ్ళార చూశాక యింకా అబద్దా లేంటి సెర బయ్యా?"

"అది కాదు బెదరా! కొంచెం తమాయించుకో మరి! నే సెప్పేదంతా సుందిను. ఆఁ ఓ బీడీ కాలుత్తావేంటి?"

తీసుకున్నాడు ఎంకన్న. సెరబయ్య 'పుల్ల' గీశాడు. ఇద్దరూ కలిసి పొగ యిడుత్తావుంటే—

"ఇవాళ్లనించి నువ్వు యిల్లిడిసి వుంటే, అప్పుడప్పుడు పెత్తనాలు సెయ్యపోతే, ఒక్కత్తికీ ఏం తోస్తాది సెప్పు!"

"దానొళ్ళు సీరినా పాపం లేదు! ఆ దొంగసచ్చినోణ్ణి మరిగింది."

"అయన్నీ ఎందుకు ఎంకన్నా? ఎంత సెడ్డా మొగుడూ పెళ్ళాం గందా! పాత యన్నీ మరిసిపోయి మల్లా కలీడవే నాకు సంతోషం! బద్రయకూడా అదే అంటాడు!"

"సీ! దీంతోనా?"

"అల్లాగనకు బెదరో! నే సెప్పిన మాటిను. దాన్నేం అనకు. కొన్నాళ్ళు పోయాంక, మీ కాపరం ఎల్లాగా సక్కబడ తాది. అప్పటిదాకా నువ్విక్కడుండలేపోతే మల్లా బద్రయ్య కాడికెల్లిపో! నువ్వొచ్చినకాడినించీ ఆడి మనసు మనసులో వుండదు. దొంగెదవ లెవురో నిన్ను కొట్టినందుకు ఆడు సానా బాదపడ్డాడు. రాయమంద్రం మీద నువ్వు అలిగి ఆలమూరు వొచ్చేస్తావుంటే, ఎలాగయినా నిన్నొప్పించి మల్లా ఎనక్కి తీసుకు రమ్మని చెప్పి నీకూడా నన్ను పంపించాడు. ఆడికి కుడి సెయ్యిరిగినట్టయిపోయింది. నువ్వు నీ యాపారం మానేశాక, తాగి వోళ్ళంతా పిచ్చెక్కినట్టున్నారు. నువ్వు మల్లా వొచ్చెయి బెదరో! సెంద్రకాంతాన్ని మించిన సొగసులాళ్లు సానామం దున్నారక్కడ!"

"ఆడోళ్ళ పూసు యింకెప్పుడూ సెప్పకు సెరబయ్యా! కట్టుకున్న పెళ్ళాం యింకో ఎదవని మరిగింది. మనసుపడి దరికెడితే ఆ బోగందికూడా యిసిరికొట్టేసింది. బతుకంతా దాపోసిన పెళ్ళానికి యిసిపోసం లేదు, డబ్బెట్టే బోగందానికి లేదు. ఆ జాతే అంత! సీ!"

"పోన్లే బెదరో! ఆ వూసు మల్లా ఎత్తన్లే సరేనా? నీ పెళ్లావూ నువ్వూ యిక్కడ కీసులాడుకుంటే ఏం వొరుగు తాది సెప్పు! నీ యాపారం నువు సేసుకో. నీ డబ్బు నువ్వు గడించుకో. డబ్బులోనే గందా దేవుడున్నాడు బెదరో!"

ఆ మాటలు ఎంకన్న మనసుకి పట్టినాయి. సెరబయ్య సెప్పినట్టు సెయ్యడానికొప్పుగున్నాడు. రేతికి రేతి రే పట్నంవెళ్లి పోడానికి సెప్పుల్లో కాలెట్టుకు నున్నాడు. అనుగుమీంచి లెగి శాడు. ఆడూ లెగిశాడు.

"నారాయుడు బండి మాటాడితే రొండోజావు రేతిరికి రాయిమండీ ఎల్లిపోచ్చు" అన్నాడు ఎంకన్న.

"అంత తొందరేంటీ? రేపొద్దున్న లెగిసి పోకూడదో?"

"ఒద్దు సెరబయ్యా! యీ యింటో ఒక్క సెణవుండ లేను!"

"నీ కోపవంతా దానిమీద సూపిత్తావేం బెదరో?"

"దాన్నూసు ఎత్తద్దన్నీ కాడా సెబుతా?"

"ఈ ఒక్కటికి మన్నించు. నా వొళ్ళు పచ్చిపుండులాగు న్నాది. సత్తే కదల్లేను. ఇద్దరం కలిసి రేపెడదారి ఏం?"

"నువ్వుంటే వుండు. నే నెల్లిపోతా!"

"అదేం ఎంకన్నా? నువ్వు రేతిరికి రేతిరి పట్నవెల్లిపోతే నువ్వులేకండా నే నీ యింటో వుండడవా? తప్పుకాదో? అంతగా నీ కెల్లాలనివుంటే నువ్వెల్లిపో! జొన్నాడలో మావోడ్డో డున్నాడు. అక్కడి కెల్లిపోయి యీ రేతిరికి తొంగుంటా!"

"సీకట్లో ఎల్లా గెడతావ్ నువ్వు? వూరు రెలపల పుంతంతా మొగలి డొంకలే! బుసలు కొడతా తాసుపావులు తిరుగుతా వుంటాయి. పోన్లే, రేపే ఎడదారి."

"రైటో!" అన్నాడు సెరబయ్య. అని నవ్వుకున్నాడు.

ఇద్దరూ లోన కెళ్లి తలికి రొండు కంచాల్లో కూడెట్టింది రావుఁలమ్మ. దాని సేతొణ్ణావు తిండానికి ముందల గునిశాడు. తరాత సెరబయ్య మొగం చూసి కూతంత ఎంగిలిపడ్డాడు. ఇద్దరూ యీ దమగులమీదే నడుచ్చోలిశారు.

తొలికోడి కూతకే లెగిసి పందుప్పుల్లు యిరుసుకున్నాడు ఎంకన్న. నూతికాడే తానావుఁసేసి ముత్తాబై పోయాడు. అప్పటికింకా సెరబయ్య లెగలేదు. ఎంకన్నే వొచ్చి లెగ్గొట్టాడు. ఇంతట్లోకి రావుఁలమ్మ సెంబుకో గళాసులోనూ కాపీకాసి యిచ్చింది.

సెరబయ్య కూడా బట్టలేసుకుని గుమ్మంకాడి కొచ్చాడు. ఆడికన్న ముందే వొచ్చి ఎంకన్న యీనులో నిలుసున్నాడు.

రావుఁలమ్మ గోడకి సేర్లబడి సూత్తావున్నాది. సెరబయ్య ఎనక్కి తిరిగి నవ్వాడు.

"ఎల్లొత్తా రావుఁలమ్మా!"

గుణ్లలో నీళ్లు కుక్కుకున్నాది.

ఇద్దరూ బస్సుటాండు కాడికి నడుత్తన్నారు.

"కొత్తరకం బీడీలియి. సానా బాగున్నాయి. యీ కట్ట నువు కాల్సుకో ఎంకన్నా!" అన్నాడు సెరబయ్య.

"నీకో!"

"నా మాటకేంలే! నీ కుసాలుగా వుంటే నాకున్నట్టు కాదో?"

ఎంకన్న నవ్వాడు. ఇద్దరూ నడుత్తన్నారు.

"సరే గానీ, ఆ బండోడి యిల్లెక్కడా?

"దివానానికి ఎదరంగా ఏం ?"

"ఏం లేదో ? జొన్నాడ కేం తీసుగుంటాడో అని."

"ఎడతావా ?"

"అవు నెంకన్నా ! మావోణ్ణి చూసి శానాకాలవయింది. ఇంత దూర వెల్లాగా వచ్చానా మరి, వోసారి కెల్లొద్దారనుంది!"

"ఆపాటి బాగ్గేనికి బండెదుకో ? గట్టిగా నడిసేవోడికి కోసి డున్నాది."

"అయితే నడిసే ఎడతాలే' బస్సు టయింవయినట్టు న్నాది నువ్వింకెల్లిపో !"

ఎంకన్నా ఎల్లిపోయాడు. సెరబయ్య పక్కకి మల్లాడు.

బండి నారాయిడు యీమలోనే వున్నాడు. దూడకి మేతెడతన్నాడు. మాటాడదలుసుకున్న దంతా చెప్పేశాడు. బేరం కాయంవయింది. ఆయేల నారాయిడి పున్నెం పండింది!

వూరెలపల టూరింగు టాకీసులో సినేవాం యిడిశాక జనవంతా పలసబడిపోయారు. గంగరాజు కిల్లీకొట్టుకాడి ఓ బీడీ కట్ట కొనుక్కొని వూరెంపు మొగం పట్టాడు సెరబయ్య. నడేట్లో వున్న నావంలాగ వూరంతా నిదరలో వోలిపోయింది. కన్ను పొడుసుకున్నా కనిపించని సీకటి. బజారెంపుని రొండు కుక్కలేమో మొరుగుతన్నాయి. గట్టిగా దమ్ములాగి, పెద్ద పెద్ద అంగలేసుగుంటా ముందరికి నడిశాడు సెరబయ్య.

ఇంటిదరికెల్లి చూశాడు. సూర్లోంచి దీపం కనిపిస్తా వున్నాది. తలుపు తోశాడు. లోన గడుంది. గలగలా గొల్లెం కదిపాడు. ఎవరూ లెగలేదు. అప్పుడింక పిలిశాడు. పేరెట్టి పిలిశాడు. తెలుసుకునీలోగానే మళ్లీ పిలిశాడు.

ముందు తనోడే అనుకున్నాది. గొంతుకు మారినట్టూ పసిగట్టింది. సెప్పలేనంత బయమయినాది.

“నేనే రావులమ్మా! సెరబయ్యని.”

సెరబయ్యంటే దీని కొళ్ళుమంటే! దొంగసచ్చినోడు! కాని, తన మొగుడు కూడా వుంటాడు గందా! తిరుయ్యాపోతే ఎల్లాగో?

సోరవాకి తెట్టింది. సెరబయ్య తోసుకుని లోన కొచ్చాడు. ఆ దొక్కడే వొచ్చాడు. వొచ్చి, లోన గడెట్టాడు. దాంతో దానికి దడు కెక్కువయింది.

“అరిజెంటు పనోటుందని, ఆడు పొద్దున్నే ఎల్లిపోయాడు. సల్దికూడేలకి రాయివండీ సేసుకునుంటాడు. ఆడోలకం నిన్నే కనిపెట్టావుగా! పిచ్చి కోపంలో ఏటేటంటాడో ఆడికే తెల్దు. నిన్నన్నమాట్లకి ఆడే సిగ్గుపడి—నేనూ సివాల్లెట్టాలే! ఎల్లాగయినా నిన్ను బతివాలి పట్నం తీసుకురమ్మని నన్ను పంపించాడు.”

“ఎందుకు పంపిచ్చాడో?”

“నీ కోసం.”

“నే పట్నం రాను!”

“ఏం?”

“నా కిట్టవంలేదు. ముట్టెత్తుకునయినా వున్న వూళ్ళోనే బతుకుతా!”

“ఆడా వూరొదల్నంటాడు. నువ్వేమో రానంటావు. ఎల్లాగ సెప్పు రావులమ్మా?”

"మీ యాసాలన్నీ నాకు తెలుసు. అక్కడికి సత్తే రాను!"

"ఈపాటిదానికి నావడ వెందుకో? మొగుడుతో నీవు కాపరం సెయ్యవా?"

"అడగడానికి నువ్వెవరవ్? నా యిట్టం. ఆడికి నే కావాలంటే యిక్కడికే రమ్మను!"

"మరి యాపారవో?"

"యాపారవా? సెందరకాంతంతో యవ్వారవా?"

"రామ రామ! అలాంటోడు కాదు రావే!"

"నా కంతా తెలుసు. ఒచ్చిన దార్నే తిరిగెల్లు."

"నువ్వు కూడా రాకోడదో?"

"నీతోనా? స్సీ!"

నవ్వాడు సెరబయ్య. "ఏం? తప్పా?"

"తప్పో ఒప్పో నాకు తెలుసు. నువ్వింకెల్లు!"

"ఎల్లడాని కేం రావులమ్మా! సిటికిలో ఎల్లొచ్చు. నువ్వు లేకండా నే నెల్లా గెల్లను చెప్పు? పట్నంలో మజాలన్నీ నీకు తెలీవు."

"ఏంటీ?"

మల్లా నవ్వాడాడు.

బీడీ పీకి యిసిరేసి యింకా దగ్గిరి కెల్లాడు.

"నీ కేం బయవుం లేదు. నిన్ను తీసికెల్లి నీ వోడి కప్పగిత్తాను. అంతగా ఆడి కిట్టవు లేపోతే నే నెలాగా వుండనే వున్నా! ఇంత లేసి మొగోళ్ళని, నువ్వంటే మనుసు పడ్డోళ్ళని

పట్నవుంలో పెట్టుకుని... వయిసులో వున్నదానివి, నువ్వొక్కత్తే యిక్కడుండం బాగోలేదు రావే !"

"ఆట్టే వోక్కు పళ్ళు రాల్తాయి !"

"ఏం ?"

"నోర్ముయ్ !"

"మనసిప్పి మాటాడతావుంటే రోగుడంటావేంటే ఎర్రి మొగవా ? ఎయ్యి జనవాలికయినా నాలాటోడు దొరుకుతాడా ? నీ కబుర్లు సాలించి సెంగుమంటూ రాకోడదూ ?"

"నీలా ఎదవల్తో రాడానికి నేనేం సెంద్రకాంతా న్ననుకున్నావా ?"

"రావులమ్మ సెందరకాంత వెలాగవుతాదే ? సిలక సిలకే, మాలకాకి మాలకాకే !"

"ఆ డింటికి రానీ, నీ రోగవు కుదురుత్తా !"

పగలబడి నవ్వాడు.

"నా ముందల ఆడెవుడే ? ఏం సేత్తాడేంటి ?" నీ కోసం నన్ను పంపిచ్చింది ఆడు కాదో ?"

"స్సీ ! ఎదవా ! ముంపు ఎలపలికి నడుత్తావా ? నలుగుర్ని పిలిసి గెంటించమన్నావా ?"

మళ్లా నవ్వాడు. సొగసుగా నవ్వాడు.

"నీ కోపంలో సిత్రవయిన ఎలుగున్నాదే రావే!"

"ఎల్తావా ఎల్లవా?"

"ఇంత దూరవొచ్చింది ఎనక్కెల్లిపోడానికా? ఓ సెర్రి దానా!"

"ఆ వోగుడే మానమంటున్నాను!'

"ఓ రబ్బో! నీ సూపుల్లోంచి సిత్రాలు సూడగల్నే! నీ రాత బాగోక ఆడు కట్టుకున్నాడు కానీ, అసలు నువ్వు రాణి వోసం సెయ్యదగ్గ దానివి కాదంటే? నీ ముచ్చట్లు తీరసడానికే నేనొచ్చా! రా, రాయివంద్రం పోదారి."

"బుద్ది లేదో?"

"నా బుద్ది నీ మొగుడికి కెరువిచ్చా!"

"సచ్చేవు!"

"మాటల్తో ఏల మించిపోతన్నాది. బండోడు కాసు కూకున్నాడు. నీకోసం వుకుంపేట్లో పెద్ద బంగాలా తీసుకున్నా. పదిమంది నవుకరోళ్ళున్నారు. సేతినిండా డబ్బు! ఇంకేం కావాలే?"

"కాళ్ళిరగ్గొడతాను."

"ఓసోస్! యిన్ని నీతులు సెప్పేదానియి, ఆ యేల ఎన్నెట్లో తెల్లసీర కట్టుకుని, తల్లో మల్లెపూ లెట్టుకుని, ముత్తాబుగా తయారయ్యింది ఆ రవణయగాడి కోసం కాదంటే?"

ఊసి పుచ్చుకు లెంపకాయ కొట్టిందది. కొట్టిన సెయ్యో సటుక్కుని పట్టుకు లాగాడు సెరబయ్య. ఇదిలించుకోబోయింది. లాబవులేదు. సివాలెత్తింది. ఆడూ రెచ్చిపోయాడు. అది రక్కింది. కరిసింది. ఆడి రగతం కళ్ళ చూసింది. అది కాళి కామ్మవోరే అయింది.

ఆడు మొగోడు. మొగోడితనం సూబించాడు. సేతు లెనక్కి యిరగట్టాడు. నోట్లో గుడ్డలు కుక్కాడు.

బండోడు లోనకొచ్చాడు. ఇద్దరూ కలిసి సాయంపట్టి రావులమ్మని బండిలో కుదేశారు. రెండెంపులా తెప్ప కట్టారు. సెరబయ్య కూడా లోన కూకున్నాడు. బండి మేలుబండిగా నడుస్తావున్నాది.

తగ్గినట్టే తగ్గి రవణయ్య కొడుక్కి జరం మల్లా ఎక్కువయింది. "ఆవాసం" కూడా ఎక్కువయింది. గొంతుకు గురగుర లాడతన్నాది. ఆ డోళ్ళంతా వోతం కమ్మేసింది. అ సంటి గుడ్డు సావు బతుకుల నడవ కొట్టుమిట్టాడతన్నాడు.

రవణయ్యకేం తోసలేదు. ఆణ్ణి బుజాన్నేసుకు, కాలు కాలిన పిల్లిలా తిరిగాడు. ఏం అంతుబట్టలేదు. ఎంటనే పక్కింటి ఎంకట్రాజుని తెగ్గొట్టుకొచ్చాడు. నాడి సూబించాడు. ఎంకట్రాజు పెళ్ళవూ లెగిసొచ్చింది. సిటికిలో మొగుడు కుపాయవు సెప్పినాది. రవణయనీ, పిల్లల్ని వోకిట్లోకి పొమ్మన్నాది. ఎంకట్రాజు పిల్లోణ్ణి తీసుకుని తలకిందలగా తిప్పి నాలుగునాళ్లు ఎగరేసి పట్టుకున్నాడు. సంటోడు కేసుమన్నాడు. వూపిరందింది. సటుక్కుని రవణయ్య లోనకొచ్చాడు. సంటోణ్ణి తీసుకుని ఎత్తుకున్నాడు. ఎంకట్రాజు సుట్టంటించి నుదుటుమీద వో తెట్టాడు. గొల్లుని ఏడిసాడు సంటోడు. రవణయ్య నూళ్ళైపోయాడు.

అప్పటిక్కాని రవణయ్య గుండె కుదుటుకోలేదు. ఆ రేతిరంతా ఎవురేనా సాయవుంటే బాగుంటాదని, రావులమ్మ కాళ్ళట్టుకునయినా తీసుకొద్దా రనుకున్నాడు. ఆడోళ్ళకి తెలిసినట్టు, ఈ జబ్బులు తనకేం తెలుసు మరి? పిల్లల్ని ఎంకట్రాజుకి పెళ్ళానికి అప్పసెప్పి రావులమ్మకోసం బయల్లెల్లాడు.

ఇల్లు బార్లా తెరుసుకున్నాది. లోన అది లేదు, ఆడికి దడుప్టింది ఇరిగిన గాజుపెంకులూ, కాల్సి పారేసిన బీడీ పీకీ, తెగిపడిన ఎంట్రుకలూ కన్పించాయి! సుట్టూతా నలుగుర్నీ లెగ్గొట్టి అడిగాడు. ఆళ్లు నిదర్లో వున్నారేవో మాకేం తెల్దు అన్నారు. ఏదో బండి సప్పుడయితే యిన్నావన్నారు. నలుగురూ నాలుగు కఱ్ఱలుచ్చుకుని లెగిసొచ్చారు.

వూరెలపల బండి కనిపించింది. లగెత్తుకెల్లి సుట్టేశారు. సప్పుడు మింగిన సీకట్లో ఆళ్ళ కఱ్ఱలు బరబరలాడినాయి. బండిలో వోళ్ళని ఎలపలికి లాగి కొట్టారు. బండోణ్ణి సితక బాడిచారు. సెరబయ్య ఎనక పాపం రావులమ్మకీ దెబ్బలు తగిలాయి ఆడు కాలికి బుద్దిసెప్పి పొలాల కష్టబడ్డాడు. మిగిలినోళ్ళు ఎనక తరవబోతావుంటే రవణయ్య వద్దన్నాడు. అందరూ కలిసి రావులమ్మని ఆ బండిలోనే ఎక్కించి వూళ్లో కొచ్చారు. సాపంతా రగతంతో తడిసి ముద్దయింది.

డాక్టరు సెలపతిగారు నిదరలో వుంటే లెగ్గొట్టారు. రగతవంతా దూదితో తుడిసి కట్టుకట్టారు. సూదితో మందు లెక్కించారు.

"పేనాని కేవీ ముప్పురాదు గదాండీ?..." రవణయ్య అడిగాడు.

"ఫరవాలేదు! ఇంజక్షనిచ్చాగా! అయినా ఎక్స్‌రే తియ్యడానికి నాదగ్గిరేం సామాను లేదు. తెల్లారేలోగా రాజిమండ్రీ తీసుకెళ్ళి, దీన్నిముందు గవర్నమెంటు హాస్పిటల్‌లో చేర్పించండి. డాక్టరుగారికి నేను ఉత్తరం యిస్తాను."

ఉత్తరంముక్క తీసుకున్నాడు రవణయ్య. రొండ్రోజులు దాకా కొంచెం పిల్లల్ని సూత్తావుండమని ఎంకట్రాజుకి కవురు చేసి, నారాయిడు బండిలోనే ఎక్కించి రావులమ్మని రాయవంద్రానికి తీసికెళ్లాడు.

మండపేటొంతినకాడ కొచ్చీతలికి ఏదో లారీ కాలీగా ఎల్తావుండడం కనిపించింది. రవణయ్య ఆపమన్నాడు. రొండు రూపాయిలు ఆడి సేతులో పెట్టి, ఆళ్ళని రాజవంద్రం చేరేసి పున్నెం కట్టుకోమన్నాడు. లారీ సర్రుని దూసుకుపోయింది.

# 14

ఆ యేల సీరామ నవిమి. బద్రాసెలవులో యిసకేత్తే రాలకుండా వుంటారు జనం. పై దేసెవుంచి కూడా ఎంత మందో వొత్తారు. రావదాసు చేయించిన సింతాకు పతకవూ, పచ్చాల పతకవూ, యింకా ఏయేయో పెట్టి సక్కగా దేవుళ్ళని ముత్తాబు సేత్తారు. ఆయేల్టి తీంతం సూడ్డానికి కళ్ళు కాయిలు కాసీలా కూకుంటారు. తిరపతి ఎంకన్నా' బద్రాద్రి రావయ్యా తెలుగోళ్ళ పెద్దదేవుళ్ళు!

ఏటేటా ముసలోడు బద్రాసెలం తీరతాని కెడతా వుండీవోడు. కానీ యిప్పుడు వొంట్లో సత్తువ తగ్గి యీ యేడు ఎల్లడం మానుకున్నాడు. ఎల్లినా ఎల్లాపోయినా ఆ రావయ తండ్రీ యీణ్ణి ఎతుక్కుంటూ వొత్తాడు. ఆడే యీడు, యీడే ఆడు!

కాతర్ కూత్రా రాయివంద్రవోళ్ళకూడా రావుడి మీద బత్తి వున్నాదంట! అందుకే ఏడా దేడాదీ రావులో

పెళ్ళి సేయిత్తా వుంటారు. ఊరు మొత్తంమీద పది పదేను పందిళ్లు లెగుస్తా వుంటాయి. రోజు రోజూ బజిన్లూ, బాగో తాలూ సేయిత్తా వుంటారు. ఆ ఏడురోజులూ అరికతలూ, పురానాలూ, పాటకసేరీలూ, తోలుబొమ్మలాటూ వొ ఏంటేటి, రకరకాలయి పెట్టిత్తారు. ఊరు వూరంతా గాకాలెట్టి అరుస్తా వుంటారు. దీపాల్లో తోరనాలు కడతారు. మొత్తం మీద కన్నులు వొయికుంటవుగానే చెయ్యాలని సూత్తారు.

పందిళ్ళల్లో ఎప్పుడూ జనం కిటకిట్లాడత్తా వుంటారు. రంగు రంగుల దీపాలు సూత్తా మురిసిపోయీ గుంటోళ్ళూ, మేళంలో సొగసు కత్తెల్ని సూత్తావుండే మీసాల మొగోళ్లూ, ఆడంగుల్లో కూకుని ఎదటున్న బాగోతవు మరిసిపోయి, నచ్చినోడింపు సూత్తావున్న పడుసు పిల్లలూ, ఒకరేంటి ? ఎన్నో రకాల మనుసు లొత్తారు. పాపం! ఆళ్ళలో వొకరికీ దేవుడు సంగతి గురుతుండదు. పల్లెంలో డబ్బులెక్కెట్టుకునే పూజా రోడికి, దేవుడి దగ్గరదీపం కొండెక్కిపోడం కనిపించదు. బాగో తాలూ, మేళాలూ కట్టేవోళ్ళు పొట్టకూటికోసవొత్తారు. ఏ రే యీవలేని మొగోళ్ళు జనాన్ని సూడ్డానికొత్తారు. ఆటిడుపు కోసం ఆడోళ్ళొస్తారు! అక్కడున్నంతసేపూ ఆళ్ళవొళ్ళు ఆళ్లే మరిసిపోతారు. రూపాయి రూపాయి సందా ఏసీవోళ్ళకన్న, తవకేం ఎయ్యకపోయినా, పోగుచేసిన డబ్బుల్లో కరుసులు పోను, మిగిలింది పంచుకు తినీవోళ్లు పెద్ద బత్తులు! దరవడబ్బే తాలవుం మొల్లో పెట్టుకున్నోడు ఆళ్ళకి నాయకుడు. ఏ మురవండోళ్ళ మేళవేనా పెట్టించిన్నాడు, సిలుకుసొక్కాలు తొడుక్కుని ఎరు వుంగరా లెట్టుకుని, కారాకిల్లీలు నవుల్తా, యిటూ

అటూ అడాయిడిగా తిరుగుతా నలుగుర్నీ గదవాయిస్తా వున్నారంటే, ఆళ్ళు చేసే పెజాసేవ చూసి వోచ్చే ఎలచ్చన్లలో ఓడగొళ్ళన్లా, వోట్లెలుచురో? ఆళ్ళకి ఆళ్ళమ్మలు. ఆయిద్దెలన్నీ వుగ్గుతో కలిపి పెట్టాయి కనకే ఆళ్ళింత గొప్పోళ్ళయిపోయారు. లేపోతే, రావయ్యగాడు ఒక్క బిగిని వూళ్ళో అయిదారో ఓట్లు లేపగల్డా? కంటోలు సరుకులు దొంగసాటుని అమ్మి డబ్బు చేసుకున్న వోడోడూ, సరకారుపన్లో పెద్ద నౌకరీ చేస్తా బల్లకింద చెయ్యెట్టే అలవాటున్న వోడోడూ, యింకా కంటాక్టుపని చేసీనోళ్లూ, దొంగ వాకీళ్ళూ, నీళ్ళ మందలిచ్చే డాకటర్లూ,—యింకా సెప్పాలంటే సిగ్గుగానీ!—యిల్లాంటోళ్ళు కూడా నిరవోకం ఎలగబెడతావుంటారు. ఇంకో తమాసా ఏంటంటే—పెద్ద బత్తుడున్నాడేం, ఎవుడు?—ఆ వొటేలోడు! ఆడు సందాలిచ్చిన పందిల్లకాడే వొచ్చిపోయీవోళ్ళ కోసమని కాఫీ దుకానాలు పెడతాడు. ఏడ్రోజులు మొత్తవ్వాఁ కలిపితే, దరమండిబ్బీల్లో పడే డబ్బులుకంటె ఆడి గల్లా పెట్టిల్లోకే ఎక్కువ పడతాయి. యింకా సెప్పకపోతే! పాపమ్మనా ఎదాన్న పడేదుర్రారు నా కెందుకు బాబో!

ముసలోడికి గెంజి పోసిచ్చి, తనింత తాగింది సీతమ్మ. బద్రయ్యగాడు ఆ యేల్లా కూడు తిండానికే రాలేదు. ముసలయ్య బల్లమీద కూకుని కాలు గోక్కుంటావుంటే, యిల్లు సదునుకోని సెయి తుడుసుకొచ్చింది.

ఈ సారి బద్రాసెల వెల్లలేకపోయినందుకు ముసలయ్య సానా బాదపడ్డాడు. అంతదూర వెళ్ళలేకపోయినా, పక్కబారిట్లో వున్న పందిల్లేనా సూద్దారనుకున్నాడు. ఈ యేల సీత

మస్త్రని కూడా తీసికెల్లి సూబించాల! బల్లమీంచి లేగిసి, సీతమ్మని పిలిసి, తలుపు గొళ్లెవెట్టి ఎలపలికొచ్చాడు.

బద్రయ కాయేల పెద్ద పండుగ. పద్రోజులు దాకా ఆడి యాపారం మా జోరుగా సాగుతాది. కాసులూ, వోరాలూ కలిసిపడ్డట్టు! ఇక్కడేపారం ఎంకన్న చూసుగుంటాడు. ఎలపల్లి తను పురమాయించుకోవాల. ఎందుకేనా మంచిది పది మందిని మట్టుక్కి తన సేతులో వుంచుకోవాలి. ఏవోఁ, ఎప్పుడేం అవసరవొత్తాదో ఏం చెప్పగలం? అందులోకే ఆడిది దిన దిన గండం, ఎయ్యేల్లావిస్సూ! అదుమట్టవుఁ కలిసొచ్చిందంటే చిటికిలో రోజు మారిపోదో?

"ఇంకా సెరబయ్య రాలేదేవోఁ?"

సరిగా ఆ రేత్తిరే, పెద్ద జమీందారుడు సొమ్ముల్తో సావఁల్కొటెడతన్నాడంట! ఇత్తడి దుకానం మారువోడీవాడు కూడా ఆయాలే బేంకునించి యిరవయ్యేలు విడిపించుకు తెచ్చుకున్నాడంట. బట్టలకొట్టు సావుకార్లు అందరికి పంపాలని సరిగా అప్పుడే సరుకెక్కిస్తారంట. సీరావఁనవమి ఎగ్ట్రా పోగ్రాం మూడో ఆట సినేవాఁకి సుట్టుపక్కలూళ్ళ నించి సానా మంది ఆనోల్లే వొత్తారంట! తొల్రోజు కనక, పందిళ్లలో కూడా జనవుఁ ఎల్లాగా కిక్కిరిసే వుంటారు గందా! ఇంక చూసుకో నాసామిరంగా, ఈయ్యన్నీ ఆడిసొన్నే! రొండు సేతుల్తోటి ఏరుకోవాలే కానీ, బుర్రలో సురుకున్న వోడికి సెయ్యని సేద్దానిక సెరువంత పంట కాదో?

ఇంతకే ఎంకన్నగాడి పెళ్ళాం యీ రేతిరికే రాడవ్వ కూడా గొప్ప సొన్నే! రాపుఁలమ్మ వొంటిది బిగుతు సెద్రకాం తాని కొత్తాదనే?

అల్లాగనుకుంటా వుండగానే బంగారయ్యొచ్చాడు. కొబ్బరి కాయల బత్తాల కెసక్కెల్లి యిద్దరూ గుసగుస లాడు కుంటున్నారు. బద్రయ్యో సిగిరొట్టు అంటించుకొని బంగారయ్య కోటిచ్చాడు. గుప్పుని పొగొదిలి అప్పుడడిగాడు.

"పందిట్లోకి ఎవుర్ని మాటాడావ్ ?"

"రావుఁడిగాడి జట్టోళ్ళని."

"వూరెలపు జమీందారుకా రద్దగొట్టడానికి ?"

"ఎంకట్రాయుడు మటా!"

"గుండోరి యీదికో ?"

"సూరయ్యగాడు."

"బట్టల మూటల బళ్ళమీదకి ?"

"సువాఁని సాయెబు లేడో ?"

"సెబాస్ బంగారం! నువ్వు యిట్టుగాడి అయ్యమ్మ మొగుడువు!"

అంటా బంగారయ్య యీపు చరిసి ఎడవఁ సేత్తో పది నోటు తీసి బంగారయ్య సేతిలో పెట్టాడు.

"ఇప్పుడే ఎందుకు బద్రయ్యో ?"

"ఇదేం కమీషను కాదు లేవో! తొలి బగుమతీ!"

"నీకాడే వుణ్ణియిరాదో ?"

"పరవాలేదహే! ఎందుకేనా అవుసర వొత్తాది. వుంచుకో."

బంగారయ్య నవ్వుకున్నాడు.

"ఆళ్ళంతా ఎన్నింటికొత్తావన్నారు ?"

"కూడు తినగానే ముందు నీ కాళ్ళకాడ వోల్రో? యీ పాటికి దరిదాపుల్లో వుంటారు."

"ఒరి వోడి తస్సాదియ్యా! అయితే యీ యేల మన పంట పండిందన్నమాటే! సూడు బంగారయ్యా! ఆళ్లు తెచ్చిన సొమ్ముల్లో సెరిసగం ఆళ్ళకే ఇచ్చేద్దారి. మిగిలిందాంట్లో నీది పావలా వాటా! అది కూడా నాకే వొదిలావంటే అడిగినంత కమీషనిత్తా!"

బంగారయ్య మళ్లా నవ్వుకున్నాడు. "నీ సిత్తంవొచ్చినట్టే కానియి గురో! నీకాడ బేరవాడతానా?"

బద్రయ్య, పెదా లెనకెనకే నవ్వుకున్నాడు.

బత్తాలాట్లు తప్పించుకుని సుట్టు తిరిగి యిద్దరూ వొంటే లెంపుకి వొత్తా వున్నారు.

"సెందరకాంత వింకా రాలేదేం బద్రయ్యా?"

"ఏంరో? నా కంట నీకే వుసారుగా వున్నాదే! యీ యేల కాంతమ్మీద మనుసయిందేంటిరా?"

"చెబితే నువు సంపెంపవో?"

"హాహ్హాహ్హా! ఎర్రి మొగవాఁ!"

ఇద్దరూ చెయ్యీ చెయ్యీ పట్టుకుని వొంటేల్లోకి ఎల్లిపోయారు.

ముసలోడూ, సీతమ్మా గబగబా నడుసుకొస్తన్నారు. ఆడంత వొడిగా నడుస్తావుంటే సీతమ్మ కాళ్ళు తేలిపోతన్నాయి. సంకలో కర్ర అందిం పట్టుకుని వూతంగా అడుగుతీసి అడుగేస్తా వుంటే—ఆ నడకలో సుకుకూ వున్నాది. అంగ సారడంలో కోపవూఁ కనిపిస్తన్నాది! గుప్పిడితో కర్ర బిగించడంలో పట్టుదలా వున్నాది!

తాత బేగే బేగే నడిసిపోతన్నాడు. సీతమ్మ వున్నట్టే మరిసి ఏదో ఆలోసి తన్నాడు. ఇద్దరూ సిన్నాంజినేయి సామి గుడికాడి కొచ్చారు. మొన్న వూరదలికి కొట్టుకొచ్చిన సివ లింగానికి కట్టిన పందిరి వున్నాది. పందిరి పక్కనే యిద్దరు పోలీ పోళ్లు సిమెంటు కట్ట కానుకుని బీడీలు కాలుస్తా వూసులాడు కుంటున్నారు. ముసలయ్య ఎనకాతల సీతమ్మని సూడ్డవుతోనే ఎకిలిగా నవ్వాలనిపించిం దాళ్లకి. నవ్వారు. ఆ నవ్వులు సీతమ్మ కాళ్లో ముల్లుల్లా గుచ్చుకున్నాయి. ముసలయ్యనీ బాధపెట్టి నాయి. ఆళ్ల దగ్గిరికెళ్లాడు. కళ్ళాళ్లో కళ్లెట్టి గుచ్చాడు. దాంతో ఆళ్లు నీళ్ళు కారి పోయారు.

"దారినిపోయీవోళ్లని సూత్తా ఎక్కిరించడవుఁ తప్ప మీకేరే పనేంలేదా బాబుల్లారా ?"

"లేకేం తాతా! సచ్చినంతున్నాది!" ఓ డన్నాడు. రొండోవోడు అందుకున్నాడప్పుడు. "సీరావఁనవమి పందిళ్ల దరవఁవాఁని సేతుల్నిండా పనే తాతా!" అంటా సీతమ్మొప్పు గుచ్చి గుచ్చి సూశాడు.

"ఏటేటా సీరాం నయిమికి పట్నవులో ఎన్ని దొంగ తనాలు జరుగుతన్నాయి? ఎన్నిళ్ళు దోసుకుంటన్నారు? ఆళ్లల్లో వొక్కడవనన్నా పట్ట గలిగారంట్రా? పైగా పందిళ్ళలో నిరవోక వెలగ బెడతావంటా! సెప్పుకోడానికి మీకు సిగ్గు లేదో ?"

ఓ డు యిరగబడి నవ్వాడు. రొండోవోడు కూడా నవ్వ బోయి, తాత మొగవుఁసూసి దడుసుకుని ఆగిపోయాడు.

"దొంగోళ్ళలో వొకోడికి మమ్మల్ని మించిన సురు కుంటాది. కన్ను మూసి తెరిసీలోగా అల్లంతదూరంలో మాయి

వయిపోతారు. అనుకున్న ఎంటనే అల్లాంటోళ్ళని పట్టుకోడానికి మాకు మట్టుకు యీలవుతాదా సెప్పు? మేవేం దేవుళ్ళవా? ఎవుడి రోజు మూడితే ఆడెల్లాగా దొరికిపోతాడు. ఈపాటి దానికి మమ్మల్ని తిట్టుకోవడ మెందుకో? అంతా మా సేతుల్లో వున్నాది కనక నా?"

"అందుకని సేతులు కట్టుకు కూకుంటా రంట్రా?"

మొదటోడు మల్లా నవ్వాడు.

"అలా గెంపు కూసుకుంటాం తాతా? మా డూటీ మేం సెయ్యవా? మొన్ని మద్దే మా యాపీసుకి కొత్త సర్కిలొచ్చాడు. ఆడిపేరు సెబుతే ఎలాటి గజదొంగోడికయినా గజ గజే! నాసావిరంగా, ఆడు యిజిలేత్తే పదిమైళ్ళదాకా యినిపిస్తాది. ఊరెలపల దాల్లు కాసీవోళ్ళున్నారు. పందిళ్ళలో మెల్లు కత్తిరించీ వోళ్ళున్నారు. కేటిరికి కేటిరి యినప్పెట్టెలు బద్దలు కొట్టీవోళ్ళున్నారు. ఆళ్ళల్లో యీయేల ఎంతమంది జోన్లో పడతారో నువ్వే సూద్దూగాని! ఈదీదికీ జోడు పోలీసు లున్నారు. ఊరికి నాలుగు పక్కలా మావోళ్ళ లారీలు పారా వున్నాయి. పందిరి పందిరికీ పదేసిమంది మా రేసాల్లో వున్నారు. ఈ ఏడ్రో జులూం సబిన్సిపెట్రుగ్గూ, సర్కిల్లూ మోటారు సైకిళ్ళమీద సెకింగు సేత్తా వుంటారు. అప్పుడప్పుడు డియెస్పీ కార్లో తిరుగుతా వుంటాడు. ఇల్లాంటి బందోబస్తుండగా ఆళ్ళు తప్పించుకోగలరనే?"

"ఏం తాతో! నోటికొచ్చినట్టు వాగుతన్నావే. యాఁ! ఎవ్వారం ముదరకండానే. మరిమరి యాదగా ముందుకి నడూ!" అన్నాడు బక్కపలాసటోడు.

"నీకున్న సేవ నాకు తెలీదంట్రా? తింగిలో తిమ్మిరాజువే మళ్లీ!"

"నోర్మూయ్!"

"ముసలోడి మీదెందుకు పడతావేంటిరా ముకుం దవ్?"

"ఈసిల్లా మాటాడొచ్చేంట మరి?"

ముసలయ్య పగలబడి నవ్వాడు.

బక్కటోడు గుర్రుమని సూశాడు.

"పోన్లే ముకుందవ్! యీడన్నంతలోనే మన పరువు పోతాదేంటి? ఆ పిల్ల దాని మొగం చూసయినా యీ ఏళ్టి కూరుకో!"

సీతమ్మ సురసురా చూసింది. పళ్ళు పటపట్లాడించినాది.

ఇద్దరూ కలిసి చెరచెరా నడుసుకుంటూ ఎల్లిపోయారు. పోలీసోళ్ళు బీడీ లంటించుకుని, సొగసుగా నవ్వుకుంటూ యీల పాట పాడతా సైకిళ్లెక్కెళ్ళిపోయారు.

# 15

పలాసటి సేతులికి పొడుగాటి రయికేసుకొని, నిండా గాజులు నింపుకొని, మొకానికి రంగు పులుంకుని, సన్నంగా తలుకుబొట్టెట్టుకుని, నడుంమీంచి దిగజారతావున్న పచ్చటి సిలుకు పరికినీ ఏసుగుని, సిత్రంగా కళ్ళుతిప్పతా, సీనేవాంపిల్లలా గుంపు నడాని కొచ్చింది సెంక్రాంతం.

ఓ బొజ్జ గసపయ్య పెదాలు సప్పరించుకున్నాడు. ఇంకో సీటుకాడు మీసం తడుంకున్నాడు. మరో పొట్టి బుడతగాడు

మిరి మిర్రి చూశాడు. ఇంకో బక్కసనోడు జబ్బలు చరుసు కున్నాడు. అందంలో కోతికి సినతమ్ముడు, అద్దంకోసం యిటూ అటూ ఎతుకులాడాడు. ఇంకోడి గొంతుకులో సినేమా పాట లేయో గురగుర్లాడాయి. సికిలికళ్ళోడు సోగ్గా మొగం సిట్లించు కున్నాడు. ఇంకో గుడ్డికళ్ళోడు కాంతం కాలిగజ్జిల సప్పుడిని దాని అందాన్ని మనస్సులో తెలుసుకుంటా నొసలు కది లిస్తున్నాడు.

బద్రయ్య అరుగుమీదొరిగి, వొత్తిగిలి తొంగున్నాడు. ఎంకన్న వోటేలు గుమ్మంమీద చెయ్యేసుకు నిలుసున్నాడు. బంగారయ్య అందరికన్నా ముందరికెళ్లి, కాంతం సేతి యిసరు నొచ్చే గాలి లోన తగల్డవుకోసం సిలుకుసొక్కా బొత్తావు లిప్పుకొని ఉంగరాలు సోగ్గా సవుదుకున్నాడు.

గలగలా గోదారి సాగిపోతన్నాది. అద్దరి నున్న చెట్లు బూతాల్లా కనిపిస్తన్నాయి. బిడ్జిమీద రేలుబండి గజ్జిలోయించు గుంటా కొవ్వూరేపుకి ఎల్లిపోతన్నాది.

కాంతంకూడా వొచ్చిన పక్కవోయింపోళ్ళు డోలక్కూ, పిడేలూ, సొన్నాయీ, అరవణీ—అన్నీ మెళ్ళో ఏసుగుని సరుదుకున్నారు.

కాంతం కాలు కదిపింది.

అందరి గుండెలూ జల్లుమన్నాయి!

సెయి తిప్పింది.

ఆళ్ళ మనసులు దాని గుప్పిట్లో సిక్కుకున్నాయి!

కళ్ళు మెదిపింది.

అందరి కనుపాపల్లోనూ అదే మెరిసింది!

వొళ్ళిరుసుకున్నాది.

ఆళ్ళ నరాల్లో మొగతనం పరవళ్ళు తొక్కింది!

పెదాలు కదిపింది.

అందరి పెదాలూ అదే కదిపినట్టున్నాది!

అడుగుతీసి అడుగేత్తావుంటే వొకడి గుండిలిమీంచి మరోడిమీదికి దూకతావున్నట్టే అయినాది!

అది వొక్కతే కాంతం.

అదే ఆళ్ళందర్నీ కలిపి ముద్దచేసి వొకే బొమ్మగా పొదివి పట్టుకున్నాది!

అది గొంతెత్తి పాడతావుంటే ఆ వొంకరల్లో వొదిగి పోయా రాళ్ళు!

"బద్రయ్యా సెరబయ్యా బంగారయ్యా
ముగ్గురూ కలిశారు ముంచేరయా
—నిన్ను ముంచేరయా!
ఎంకన్నా! ఓ ఎంకన్నా!—"

అని పాడతా ఆడి దరికెళ్ళి బుగ్గమీద సిటికేసి సొగసుగా చెయ్యొట్టుకున్నాది. ఆడు యిదిలించుకున్నాడు. ఉసూరవని సూత్తా మల్లా తిరిగొచ్చింది.

పాటకి సరిబడ్డ ఆటా, ఆటకి తగిన సూపూ, సూపుకి తోడు వూపూ, వూపులో గొప్ప సోకూ, ఓలమ్మో! దానాటే కోటొరాల మూట!

పా టెనక పాటా, దా నెనక మరోటీ అల్లా వొకో డొకోటి పాడించుగుంటా ఉన్నాడు. ఆళ్ళలో వోడు మనుసుపడీ అడిగాడు. "సోగ్గాడేలమ్మో, సోగ్గాడే!" అంటా పాడిన పాటకి ఎవుడిమటు కాడే, తన్ను చూసే పాడతన్నా దనుకున్నాడు.

అప్పుడప్పుడు చేతి గడారవుఁ సూత్తానే వున్నాడు బద్రయ్య. ఆశికూ్కడా దా నాట ముచ్చటే అయినాది కానీ, యీ వుసాయిలో ములిగిపోతే తను పన్నిన వాలంతా టపుక్కు మనపోతే యింకేఁవన్నా వుందా ? కన్నుగీటి బంగారయ్యని ఎనక్కి లాగాడు.

"నే సెప్పిన శైవుఁ గుడుసిన్నాదా ?"

"ఏంపకు లేదన్నా ? పదకొండు కాదో ?"

"ఆఁ, అదే అడుగుతున్నా ! సరింగా పదకొండూ కొట్ట తలికి మీరంతా వుళ్ళో పడాల. తెలిసిందా ? తాగి తందనా లాడతా వుంటాని కీల్లేను. ఎవ్వారం కాని బెడిసికొట్టిందో, ఆళ్ళ మక్కి లిరగదంతాను కబడదార్ !"

"నాకు తెలీదేంటి బద్రయ్యా ? నువ్వు లోనకి పోయి తొంగో ! తొలికోడి కూసీలోపుని కడవాళ్ళో కాసులు తెచ్చి నీ కాళ్ళకాడ కుమ్మరించాపోతే నాకు మారుపేరెట్టు తెలిసిందా ? ఆఁ !"

"సెబాస్ బంగారం ! నీ మాట నీవు నిలబెట్టుకున్నావంటే నిలువెత్తు బంగారం నీకు కట్నం సదెయించనో ?" అంటా బళ్ళని ఆ డీపు చరిసాడు బద్రయ్య.

"కాంతం గజ్జికట్టి శానాకాలఁపయింది గందాని, యీయేల యీళ్ళంతా యిరగబడిపోతన్నారు ! కూతంత తవాఁయించుకోనీ బద్రయ్యా ! కాంతాన్ని పంపేసి, ఆళ్ళని నాతో లెగదీసుకపోతా !"

"సరే, నీ యిట్టం ! కాని, ఆళ్ళమట్టుకు తప్పతాగి వాళ్ళు మరిసిపోకండా చూసుకో ! సుతిమించి రాగాని పడింది దంటే కుతుకి తెరిగిపోగలవు !"

"అదంతా నా కొడిలెయిమన్నాగా !"

"ఇంతకీ రావాలిసినోళ్ళంతా వచ్చినట్టేనా ?"

"లేపోతే బత్కగ్గలనే ?"

"సెబాస్ బంగారం!" నోరెంబగా పెట్టి మళ్లా నవ్వాడు బద్రయ్య. ముసిముసిగా మురిసిపోయాడు బంగారయ్య.

కాంతం యింకా ఆటాడతానే వున్నాది. ఒకోడి చెయ్యట్టుగుంటానే వున్నాది. మరోడి గెడ్డం తడుంతాది. ఇంకోడి జుట్టుట్టుకు లాగుతాది. ఏరేవోడి జేబు నెలుకుతాది!

ఒకోడికి ముద్దిస్తాది. మరోడికి చెయ్యిస్తాది. ఇంకోడి చెంపంటిస్తాది. ఏరేవోణ్ణి గజ్జలు సరదమంటాది!

ఒకోణ్ణి మావంటాది. మరోణ్ణి బావంటాది. ఇంకోణ్ణి బాబు అంటాది. ఏరేవోణ్ణి తాతా అని పిలుస్తాది.

ఒకోడి నరాలు వుబ్బుకొస్తాయి. మరోడికి, యింటో కాసుకూకున్న పెళ్ళాం గురుతుకొచ్చి వొళ్ళు పులకలెత్తు తాది. ఇంకోడికి, కరనం కాంతయ్యతో లెగిసిపోయిన పడుసుది గురుతుకొస్తాది. పేరు మోసిన ఆడదే అయినా, తాలూకా సేరీ ఎంకయపంతులు పెళ్ళాం కొంగట్టుకున్నందుకు, నెత్తిమీద దీపవెట్టి వూరంతా తిప్పించిన సంగతి, వోడనుకున్నా గురు తొస్తన్నాది ఏరోవోడికి!

ఒక్క సెంద్రకాంతాన్ని చూసి ఒకో డొకో రకంగా యిదయిపోయాడు.

బంగారయ్య వొకోడి దరికీ ఎల్లి సెవులో ఏదో వూస్తా వుంటే ఒకడెనక మరోడు సల్లగా లోనకెళ్ళి ఎంకన్న సేతి మీదుగా సెరుకో గళాసుడు యేసుగుని, బుట్టలో అంటిపళ్ళు

తీసుగుని, ఎలపలకొచ్చి మల్లా కాంతం సుట్టూ మూగుతా ఉన్నారు. కాంత వాఁడతన్న ఆటకీ, ఆ నిసాలో అందరూ దరు వేత్తావుంటే ఒకోడు బరితెగించి సుట్టూతా గంతులేత్తన్నాడు.

డోలకోఁడు దబ బదబా కొడతన్నాడు. పిడేలోడి వేళ్ళు కళ్ళకఁనిపించనంత సురాగ్గా కదిలిపోతన్నాయి. ఆరవంణీ బొం బోంయి బోంయ్యి మంటన్నాది. కాంతం కాలి గజ్జెలు గలగలగల్లాడతన్నాయి. ఎవుడి మట్టుకాఁడే ఏదే లోకంలో ఉన్నట్టే అయిపోయారు!

అయిపోతారంటే పెద్ద వురువుఁరివింది.

"ఆపండి!"

కొండిరిగి మీద పడినట్టున్నాది. ముసలయ్య అరుపు పిడుగుపాటే అయింది!

"ఆటాపండి!"

కాంతం కాళ్ళు నిలుసుండిపోయాయి. మిగిలినోళ్ళంతా అదిరి చూశారు. దాని పెదాలు బయంతో వనికిపోతన్నాయి. మిగిలినోళ్ళు కోపంతో రుసరుసమన్నారు.

పైనించిపడ్డ సందన బొమ్మలాగయింది సెంద్రకాంతం!

తాతా, సీతమ్మా గుంపులో కొచ్చారు.

అప్పుడు అక్కఁడ ఆళ్ళనీ, నడవ ఆటకత్తెనీ శానా సోద్దెంగా చూసింది సీతమ్మ. తాత కళ్ళు సింతనిప్పులు చెరిగాయి.

"ఏంటి సేత్తన్నార్రా యిక్కఁడా?" అందర్నీ కలిపి నిద్దిశాడు ముసలయ్య.

"కనిపించడవుఁలా?" అన్నాడో ఆసామీ.

"యేం సెయడవేంటి ముసలోడా?" అన్నా డింకోడు.

"బోజనవుఁ సేత్తన్నాం!" అన్నాడో బొంతగటిపండు మొగవోఁడు.

"సెంద్రకాంతవుఁ సూత్తానంటే మేవంతా డాన్ను సేత్తన్నాం!" మరోడు.

"నువ్వు గూడా ఓ గళాసేసుగుంటే నీకూ అంటిపెల్లెడతా వోఁచ్!" హీ హీ మంటూ నవ్వాడు ఏరోవోడు. ఆణ్ణి అంటుకుని తక్కినోళ్ళూ నవ్వారు.

తాతకి కోపవాఁగలేదు.

"నోరుముయ్!"

"ఎందుకో?" అన్నాడోడు సల్లగా.

ఇంత గొడవయినా బద్రయుదొర గద్దిమీంచి దిగలేదు. సోగ్గా వాత్తిగిలి తొంగున్న వోడల్లా గబుక్కున లెగిసి కూకున్నాడు.

"సింతసెట్టు సిగురు సూడూ,
సిన్నదాని సొగసు సూడూ!" అంటూ పక్కోడికి కన్ను గీటాడు మరోడు.

ముసలయ్య వొళ్ళు మండింది.

"ఏంటిరా కూస్తన్నావ్?" అంటూ కర్రెత్తబోయాడు. సటుక్కుని సీతమ్మ పట్టుకున్నాది.

"పొండి! అందరూ బయటికి నడండి!"

"ఏం?" అన్నాడు యింకోడు.

"ఏవాఁ? ఏవోఁ సెప్పాలంట్రా? దొంగసచ్చినోడా!"

మిగిలినోళ్ళంతా కడుపుబ్బిపోయేలా నవ్వారు.

"ఎల్లమంటే మీకాకాదో? ఇదేవన్నా మీ తాతగారిల్లనుకున్నారంట్రా?"

"ఎబ్బే! నీది" అంటా సాగదీశాడు ఏరేవోడు.

అవున్రా! ఈ గుడిసి నాది! కాదనేవోడెవడ్రా?

"ఏయ్, ముసలోడా! ఇందాకన్నించీ వూ పేడుతున్నావ్! యాం! కుంటోడివని దయ తలుస్తావుంటే యీ వాగుడేంటంట? సూత్తారేం? ఎత్తండ్రా కర్రా!"

పదిమందీ ముసలయ్యమీదికి యిరుసుకు పడ్డారు.

"తాతా!" గిలగిల్లాడింది సీతమ్మ.

కాంతం గుండె సివసివలాడినాది!

"ఆగండ్రా! ఏంటా గొడవా?" తువ్వాలుగుడ్డ దులిపి భుజంమీదేసుకొచ్చాడు బద్రయ్య.

ఆళ్ళ సేతుల్లో కర్రలు బిగిసిపోయాయి. గుంపులోకొచ్చి తాతను సూత్తా అలాగే నిలుసుండిపోయాడు.

ఆణ్ణి సూడ్డవుతోటే అరికాలిమంట నెత్తికెక్కింది ముసలయ్యకి.

కాంతం గుండె కుతకుటబడ్డాది.

"కూడా ఉండినువ్వు సేయిత్తన్న పనేనే యిది." తాత అరిగాడు.

"ఏం చేశారూ?"

"ఏంటా? కళ్ళు మూసుకుపోయా యేంటి? ఈళ్ళందర్నీ చేరదీసి తయ్యితక్క లాడిత్తా ఉన్నది నువు కాదో?"

"నలుగురూ బతిలాడితే సెంద్రకాంతం మేళవుం పెట్టించాను. తప్పా?"

"కాదో? నా ఎదటల్లా తిరిగి మాటాడ్డానికి దమ్మెలా గొచ్చిందంట?"

"ఆళ్ళ ముచ్చటకోసం పెట్టించానంతే!"

"ముచ్చట! పడ్డాని కాళ్ళెవర్రా?"

"నా జట్టోళ్ళు!"

"చెప్పకోడాని కూ్కడా సిగ్గు లేదో?"

"ఎందుకో? నన్ను నమ్ముకున్నోళ్లాళ్ళు!"

"నమ్ముకున్నోళ్ళా? దేనికిరా? నగలు కత్తిరించడానికీ, యిళ్లు దోసుకోడానికీ, దార్లు కాయడానికీ, కూనీలు సెయ్యడానికీ! అవునా?"

"ఆళ్ళేం అలాంటోళ్ళు కారు!"

"నోర్ముయ్! నాకాడ నిజవుఁ దాద్దావనుకున్నావంట్రా? సీరావఁనవమి పందిళ్ళల్లో ఆడోళ్ళమెళ్లు కత్తిరించడానికి రావుఁడిగాడి జట్టును పిలిపించింది నువు కాదో? జమీందారు కారడ్డగొట్టడానికి ఎంకట్రాయుణ్ణి మాటాడించించింది నువు కాదో? గుండోరీములో మకానాలు దోసుకోడానికి సూరయ్యగాణ్ణి రప్పించింది నువుకాదో? బట్టల మూటల బళ్ళమీద సరుకు ఉతకలెత్తడానికి సువాఁని సాయేబుకి కవురంపించింది కూడా నువు కాదంట్రా?"

రావుఁడుగాడు మొగం దాసుకున్నాడు.

ఎంకట్రాయుడు ఎవక్కి జంకాడు.

సూరయ్యగాడు సుర సుర చూశాడు.

14]

సువాంనీ సాయేబుకి 'అల్లా' గురుతుకొచ్చాడు.

బద్రయ్య కుదేలయిపోయాడు!

"మాటాడవేరా? నే సెప్పింది అబద్దమనీ దమ్ముందా నీకూ?"

బద్రయ్య తలొంచుకున్నాడు!

ఆళ్ళంతా రెప్ప ల్లోల్సకండా యిద్దరొంకా సూత్తా వుండి పోయారు.

"సెప్పవేం?"

నోరు మెదపలేదు బద్రయ్య!

ఆళ్ళల్లో ఆళ్లు గుస గుస లాడుకున్నారు.

బద్రయ్య గుట్టంతా ముసలయ్య కెలా సిక్కిందో ఎవ్వడికీ తెలీలేదు!

"అన్నం పున్నెం ఎరగనోళ్ళని దోసుకుంటా ఉంటే సూత్తా వూరుకుంటా ననుకున్నావంట్రా? పేనాలు తోడేత్తాను. జాగ్రత్త! పసువుగా బతకడం చేతకాక వూళ్లోవోళ్ళ పొట్టలు కొట్టి మీ జేబులు నింపుకుందా రనుకున్నరంట్రా? మనుసులు కారో? వొణ్ణం తింటవుం లేదో? స్సీ! బురదలో పొర్లే పందులు నయం మీకన్నా!"

గుంపులో వోళ్ళకి వుక్కురోస వచ్చింది. సల్లగా బద్రయ్య కాలు గోకాడోడు. ఆడు తలెత్తాడు. తన వోళ్లు తన్ని నమ్ముకునోళ్ళ కళ్లు నిప్పులు చెరగడం చూశాడు. ఇంక కోపం పట్టలేకపోయాడు. పేనాలికి తెగించయినా ఆళ్ళ పరువు

నిలబెట్టా లనుకున్నాడు. ముసలయ్యని టకీవఁని టూకాయిం చాడు: "నన్నే వేఁసా అనుకాని, యీళ్ళ వూసెంచు కెత్తుతావ్?"

"ఎత్తితే ఏం సేత్తావురా?"

ఆమాట యిండవుఁతోనే ఆళ్ళంతా ముసలోడి మీందికి వురకబోయూరు. బద్రయ్య సెయ్యడ్డం పెట్టాడు.

"నువ్ సెప్పినట్టు, యీ బూమ్మీంద అన్నాయవుఁ సెయకుండా బతుకుతున్నవోణ్ణి వక్కఁణ్ని సూబిత్తావా ముసలయ్యా! లచ్చలికి లచ్చలు గడిచ్చి, మేడలూ, మిద్దెలూ కట్టినోళ్ళంతా నీతిగా ఉన్నవోళ్ళేనా? పొలంమీంద సిత్తు అనీ, యింటి మీంద అద్దె అనీ, యాపారవుఁలో లాబవనీ, నవుకరీలో నమ్మకవఁనీ, ఆడదాన్తో ముచ్చటనీ రకరకాల పేర్లెట్టి, తడిగుడ్డల్తో గొంతు కోసేవోళ్ళంతా పరువుగల వోళ్ళేనా? పైకి సెప్పేదో మాట, లోన చేసే దింకోటే! పొగలంతా పెద్దమనిసి, సీకట్లో ఎదవన్న ఎదవ! ఆళ్లు బుద్దిగా బతకరు. ఇంకోళ్ళని బతకనీయరు! ఏవం టావు ముసలయ్యా? మాటాడవేం? ఆళ్ళకి తెలిసిం దొక్కటే యిద్దె. ఇంకోళ్ళ కష్టవుఁమీంద ఆళ్లు కులకడవేఁ తెలివి. బక్క టోళ్లనీ, నోరు లేనోళ్ళనీ తవాఁరి క్కావలసినట్టు వోడుకుని పీల్సి పిప్పి సెయడం ఆళ్ళకి సర్దా! తిరగబడీ బలం లేనోళ్లు ఆళ్ళ అడుగులికి మడుగు లొత్తుతారు. మే వఁలాటోళ్ళం కాం! మాకు బలం వుంది. బుర్రుంది. మా కన్నాయవుఁ సేత్తా వుంటే సేతులు కట్టుక్కూకో లేం! మోసం చేసేటోళ్ళని మోసం తోటే దెబ్బ తీత్తాం! మా గొప్ప మేవూఁ నిలబెట్టుకుంటాం.

నయాన్నీ బయాన్నీ మాకునచ్చింది మేము గుంజి లాక్కుంటాం. ఆ పనికి అడ్డ వచ్చినోళ్లందర్నీ ఆ లోకానికే పంపేత్తాం! తెలిసిందా? ఇప్పుడు చెప్పు ముసలయ్యా పరువుగా ఉన్నవోళ్లు మేవాఁ ఆళ్ళా?"

"అయితే బతకడానికి యింకే దారీ లేదా?"

"బలుసాకుక్కూడా పిరవయిపోయింది తాతో?" అన్నాడో కొంటిగాడు.

"అయ్యా ఎనకట్రోజులు తాతా! ఇప్పుడు కాలం మారినాది. ఉన్నవోళ్ళు సత్తే కాని యిదల్సరు. లేనోళ్ళకి ఏడ్డం తప్ప ఏరేపని సేతకాదు. అవునా?"

"ఏవంటా?" అన్నా డింకోడు.

"ఆ దేవంటే మనకేంటే హే! నడండి! రావెఁ, ఎంకట్రాయుడూ, ఒరేయ్ సూరిగా! పదండెహే! ఓరి సాయేబూ, లెగవేం?" అంటూ అరిశాడు బంగారయ్య. ఎవుడి కర్రలాడు తీసుకుని కదిలారు. కత్తులూ మెరిసినాయి. గుంపు గుంపంతా వొక్కసారి నడిసింది. బద్రయ్య కూడా ఆళ్ళెనకాలే ఉన్నాడు.

ముసలయ్యకి మూరిసొచ్చినంత పనయింది.

సీతమ్మ రాయిలా నిలుసున్నాది.

కాంతం కళ్ళప్పగించి సూత్తన్నాది.

ముసలయ్య బుర్ర సుళ్ళు తిరిగింది. గుండె దడెక్కువయింది. సెరసెరా పరిగెత్తి బద్రయ్య నట్టుగున్నాడు.

"ఏం?" కళ్ళకొనసల్లోంచి చూశాడాడు.

"వొద్దు బద్రయ్యా! ఎల్లొద్దు. నా మాటిను. ఎక్కడికక్కడ పోలీసోళ్ళు కాపలా ఉన్నారు."

బద్రయ్య గట్టిగా నవ్వాడు.

"మే వంత పిరికోళ్ళవనుకున్నావాఁ ముసలయ్యా? పోలీసోళ్ళ కళ్ళలో దుమ్ము కొట్టడం మాకు సేతవును!"

ముసలయ్య వొదల్లేదు.

"మాకు బయవేంటీ? నీ పిల్లని నువ్వు చూసుగుంటా ఉంటే సాల్లే!"

"వద్దు బాబూ! నే సెప్పిన మాటిను. తలుసు కున్నంతా నువ్వు సెయ్యగలవని నాకు తెలుసు. నువ్వు చేసీ పనికి ఎంతమంది ఏడుస్తారో అనేదే నా బాధ! నిన్ను బతివాఁలుకుంటాను. ఈయాల్టికి అల్లాంటి యేం తలపెట్టకు. నువ్వనీది నాకు తెలీదనుకుంటావా బద్రయ్యా? దీంటో నీ తప్పేం లేదు! బూమ్మీద పడ్డ పెతీవోడూ ఒకోడొకో దార్ని పోతాడు. అయినా ఆడి మూలాన్ని ఎవుడికో వొకడికి కట్టవుఁ కలక్క మానదు. నేనూ కాదన్ను! కాని ఏంసేత్తావ్? ఇది శానామంది సూడను. ఒకడు ఎదవపని చేసి డబ్బు గడిత్తే ఆణ్ణి చూసి మనవూఁ అదే సేత్తే ఆడితో పాటు మనం కూడా నీసెపోళ్ళ వఁయిపోవూఁ? మన మనసుల్ని మనం సంపుకున్నట్టు కాదూ?"

"ఓ మూల కడుపుమాడి సత్తావుంటే మనసెవుడిక్కావాలి."

"అదే బాబూ కిటుకు! అది తెలీకే అందరూ చెడ్డపన్లు సేత్తాఉంటారు. దొంగ సొమ్ముతో దొరఁవిపించుకునీ వోడికన్నా

దోసిడితో జోలి నింపుకునీ నోడు గొప్పోడు కాదా బద్రయ్యా? గొప్పతన వెప్పుడూ డబ్బు గడించటవుంలో లేదు బాబూ! కరుసు సెయ్యకండా నిలవెయ్యడంలోనూ లేదు, అది తెచ్చు కునీ నిజాయితీలో ఉన్నాది!"

"ఆ నిజాయితీ అందరికీ వుండొద్దో?"

"ఎందు కుండదో? రోజు లెప్పుడూ యిల్లాగే వుంటయ్యా బద్రయ్యా? రోజుల్తోబాటు ఆళ్ళూ మారక తప్పదు. బాబూ! అబద్దం, మోసం, అన్నాయం యియ్యన్నీ ఎప్పుడూ నిలబడే వుండీయంటావా? పదును కత్తికూ-డా తుప్పట్టీ రోజు రాదా బద్రయ్యా?"

"నాకు నమ్మకవుం లేదు!"

నవ్వాడు ముసలయ్య.

"ఎర్రోడా! సిగురికి నిలిసే దెప్పుడూ నిజవేంరా! సూరీడు ఎలుగు నిజం. సెందురుడి సలవ నిజం. మనిసి మంచితనవుం నిజం! తలుపు గడెట్టుకుని సీకటి కొట్లో కూకుంటే ఎలుగు కని పిస్తాదా? ఒంటినిండా దుప్పటి కప్పుకుని యాసంకాలంలో మిద్ది గదిలో తొంగుంటే ఎన్నిల తెలుస్తాదా? ఎదటున్న వోడల్లా కుళ్ళేదవే అనుకుని సూత్తే మనుసుల మంచితనం యిద్దరి నడవాం గాలి కెగిరిపోదో? ఏ మంటావు బద్రయ్యా? అల్లా జరక్కుండా ఎవడిమట్టుకాడు మనసులోకి నీసుకంపు రాకుండా ఎప్పటి కప్పుడు తుడుసుకోవాలి. అప్పుడు మనకి అంతా ఎలుగే! ఎప్పుడూ ఎన్నిలే! అందరూ మంచోళ్ళే!"

"అల్లా గెప్పటికీ జరగదు ముసలయ్యా !"

"కాదు బాబూ! తప్పకండా జరుగుతాది. దానికోసం ఎవుడిమట్టుక్కి వాడు చూసుకోవాలి. సిలగ్గా సిలగ్గా ఎన్న తేరినట్టే పెతీవోడి మంచితనవూఁ తప్పకుండా ఎలపలి కొస్తాది. ఇది ముమ్మాటికీ నిజం. కొత్తగా నుయ్యి తవ్వినప్పుడు బురద నీళ్ళు పడవా బద్రయ్యా? మన మంచితనాన్నే చేదజేసి, వోపిగ్గా బురద తోడేత్తే సిగురికి తేటనీరు తేరదా? చెప్పు! నేలమీద పడ్డవోడికల్లా మంచితనాన్ని దేవుడు గుండిల్లో పెట్టకుండా ఉండడు. బాబూ! అది తెచ్చుకునీ నేరుపు మన్లో ఉండాలి. కాదంటావా బద్రయ్యా?"

బద్రయ్య మాటాళ్లేదు. తలొంచుకున్నాడు. మిగిలినోళ్ళంతా ఆళ్ళ సేతుల్లో వున్న కర్రల్లాగే నిలుసుండిపోయారు.

"మనుసుల మంచితనం కుళ్ళిపోతే పగ అవుతాది బద్రయ్యా! ఒక్కమాట సెబుతావా? ఎదటోళ్లు చెట్టపన్లు సేత్తన్నారని తెలుసుకునీ, ఆటెని మన దరికి రానీకండా, ఆళ్ళ నీసాన్ని ఆళ్ళకి తెలీసెప్పడవు మేలా, ఆళ్ళల్లా మనవూఁ సెడిపోడం గొప్పా? నువ్వు చేసిన దొంగతనాలకి ఎంతమంది తిట్టుకున్నారో యిన్నావా? నువ్వు చేసీ కూనీలకి ఎంతమంది ఇసురు తగుల్తాదో తెలుసుకున్నావా? తొమ్మిదినెల్లూ నిన్ను మోసి, కని, పెంచి, ఎన్నో కట్టాలుపడ్డ నీ తల్లి—యిప్పుడింకా నువు చేసీ పన్లు సూత్తే ఎంత ఏడుస్తాదో ఎప్పుడేనా ఆలోసించుకున్నావా? చెప్పు బద్రయ్యా? చెప్పు!"

అమ్మ పూసెత్తేతలికి బద్రయ్య కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఎవురికీ కనిపించకండా పక్కకి తిప్పుకున్నాడు.

ముసలయ్య పక్కకి తిరిగాడు. "నీ పేరేంటి తల్లీ!"

"సెంద్రకాంతం."

"ఇంకా దరికిరా అమ్మా! నీ పేరు సెంద్రకాంతవాఁ? కాదు తల్లీ, కాదు! నీ పేరు సెంద్రకాంతం కాదు!"

అందరూ కళ్ళప్పసెప్పి సూత్తన్నారు.

"అయ్యే కళ్ళు, అదే ముక్కు, సిన్ని నోరు, అదే మొకం, అంతా అదే! నువ్వు కాంతం కావు తల్లీ, కాంతం కాదు!"

"నాలాటిదాన్ని ఎక్కడేనా చూశావా తాతా?"

"ఎక్కడో కాదమ్మా యిక్కడే, యిప్పుడే, నువ్వే!"

కాంతం తికమికలాడినాది. సీతమ్మ కేం తెల్డవ్వఁలేదు.

"కన్నవోళ్ళు బతికుండగానే నీ కెంత గతట్టిందే తల్లీ!" అంటూ కాంతం బుజంమీదికి వొలిపోయాడు.

"సిన్నప్పన్నించీ నన్ను కలావతే పెంచింది. మాయమ్మా, అయ్యా సచ్చిపోయారు."

"కాదమ్మా, కాదు! నీ అయ్య యింకా బతికేవున్నాడు సిట్టీ!"

"నా పేరు సిట్టి కాదు, కాంతం."

ముసలోడు వొలవొలా ఏడిశాడు. ఆడికి పిచ్చెక్కిందేవోఁ అనుకున్నా రందరూ. ముసలితనం రాడవ్వఁతో ఆడి మనసు అలాగయిపోయినాదేవో అనుకున్నాది కాంతం.

"ఏడవకు తాతా! దీని కేం బయవ్వులేదు. నేనున్నాను. దాని బతుకు నే సక్కబరుస్తాను" అంటా తిరిగాడు బద్రయ్య.

అప్పుడు ఆడి కళ్ళనించి వడ్డ నీళ్ళతో ఎయ్యి జనవాల పాపాలు తుడిసి పెట్టుకుపోయాయి.

ముసలయ్య మొగం వెత్తాడు.

"నువ్వింత మంచోడి వనుకోలేదు బద్రయ్యా!" అంటా ఆణ్ని గట్టిగా కౌగలించుకున్నాడు. బద్రాద్రి రావుడికి మనస్సు లోనే దణ్ణా లెట్టుకున్నాడు.

కాంతానిక్కూడా కళ్ళంట నీళ్లొచ్చినాయి. సీతమ్మ తన సెంగుతో తుడిసింది. మిగిలినోళ్ళు ఎనక్కి తప్పుకున్నారు.

# 16

మూసిన కన్ను తెరవలేదు రావులమ్మ. దాన్నలా సూత్తావుంటే పుట్టెడు దుక్కవు కలిగినాది రవణయ్యకి. ఎంకన్నమీద కోపవ్వూ రగిల్నాది. పళ్ళు పటపటలాడించాడు. కళ్లు అగ్గిబరాటా లయినాయి. ఆణ్ణి సూత్తేనే కత్తితో పొడి సెయ్యా లనుకున్నాడు.

లారీ వొచ్చి పడవా ర్లేవుకాడ ఆగింది. ఇద్దరు మను సులు సేతులు మీదకెత్తుకుని వొటేలుకాడికి దింపుకొచ్చారు. రావులమ్మని అరుగుమీద పడుకోబెట్టారు.

సీతమ్మా, ముసలయ్యా, సెందరకాంతం, బద్రయ్యా దాపు కొచ్చి నిలుసున్నారు. తక్కినోళ్ళు కూడా సుట్టూతా మూగారు.

సెంద్రకాంతాన్ని చూసి మొకం పక్కకి తిప్పుకున్నాడు రవణయ్య. సీతమ్మ రావులమ్మమీందికి వోలి కొంగుతో యిసుకుతున్నాది.

"ఎవరుబాబూ యీ మనిసి ?"

"ఎవురా ? ఓ దొంగసచ్చినోడి పెళ్ళాం! ఏడాడు? ఎక్కడున్నాడు?"

"ఎవురు బాబూ ?"

ఆడి పేరు నోటితో సెప్పడానికూడా రవణయ్యకి యిట్టవులేదు. సుట్టూతా సురుగ్గా కలీచూసి వోట్ళోకి సొర బడ్డాడు. సారాకుండకాడ ఎంకన్న కనిపించాడు. సటుక్కుని ఆడి జుట్టట్టుకుని ఎలపలికి లాక్కొచ్చాడు.

"ఇడుగో! యీడు!" అంటా టపటపా యీ దవడా ఆ దవడా వోయించాడు.

ఎంకన్న తిరగబడ్డాడు. ఎంటనే బద్రయ్య సొరబడి ఇద్దర్నీ సెరికో ఎంపుకీ తోశాడు.

"వొదలెండెహే! నన్నట్టుగోకండి. యీయేల యీడి సావో నా సావో తేలాల!"

"తప్పుబాబూ! అల్లాటి మాటనకూడదు."

"ఏవంట! ఈడు చేసేపనికి వూరికే పేనాలు తీత్తేసాల్దు. ముక్కలు చెక్కలుచేసి కాకులికీ గద్దలికీ ఏసినా పాప వుందా?"

"తప్పు నాయనా, తప్పు!"

"ఏంటాతప్పనే అడగతన్నా! ఏపార వేపారవని వూళ్ళో నవుకిరీ మానుకుని పట్నానికి లెగిసొచ్చి, అలోవని

పెళ్ళాన్ని ఏడిపించడవుఁ తప్పు కాదో? కనిపించిన ఆడదానెం టల్లా పడి, బరితెగించి తిరగడం తప్పు కాదో? దొంగ ఎదవ లందరితోటీ జట్టుకలిపి సీకట్లో సారా యాపారం చెయ్యడం తప్పు కాదో? చెప్పు ముసలోడా! ఇప్పుడు తప్పెవుడిదో నువ్వే చెప్పు!"

"నిజవేఁ బాబూ! ఆడు చేసిన పని తప్పే!"

"అవునా? అలాటప్పుడు కాళ్ళిరగ్గొట్టా అంటావా?"

"కాళ్ళిరగ్గొడితే బుద్ది మారతాదా బాబూ?"

"మారదేఁ? నడినెత్తి కడ్డంగా పెడితే, అదెందుకు మారదో నేనూ సూత్తా!"

ఆ మాటల్తో ఎంకన్నకి ఉక్కురోసం వొచ్చింది.

"రారా! మొగోడివయితే యీ పాలి రా!"

"స్సీ ఎదవా! నోరు ముయ్! నీలాంటోడితో మాటాడ్డం కూడా సిగ్గుచేటు! నీలాగ పెళ్ళాన్ని పుసుక్కోటినోడు యీ బూమ్మీదెవడూ పుట్టడు!"

"నా పెళ్ళాం వూసు నీకెందుకూ? నే నేం చేసుగుంటే నేం, అడగడానికి నువ్వెవుడవ్?"

"ఎవణ్ణా? నీ నెత్తిమీద జేజెమ్మన్నా! అసలు నీలాంటోడికి పెళ్ళిసేసినోళ్ళది బుద్దితక్కువ. ఎయ్యి జనఁవాలు జపం చేసినా నీలా ఎదవకి రావుఁలమ్మలాటి ఆడది దొరుకుతాదంట్రా? కాకిముక్కుకి దొండపండు కాదంట్రా? మనసుపడి పెళ్ళి చేసుకున్నాది. తన సుకాన్నంతా యిడులుకుని నీకోసవేఁ

బతికింది. అల్లాంటిదా న్నేడిపించి ను వ్వేం పొంకుందా వఁను కున్నావురా ? రేపు నీ వొళ్ళు పుచ్చిపోయి, మంచంవట్టి, కాటిక్కాళ్లు సాసుక్కూకుంటే నీకు సాకిరీచేసే దెవుత్తిరా ? బోగందొస్తాదా ? నా పెళ్ళాం సచ్చిపోవడంతో నేనెంత గిలగిల్లాడుతన్నానో ఎప్పుడన్నా కళ్లెట్టుకు సూశావంట్రా ? సంటోళ్లు ఎంత గిజగిజలాడిపోతున్నారో ఏయేలయినా తెలుసు కున్నావురా ? నీలాటి సచ్చుసన్నాసి, దాని కాళ్లొత్తడాని క్కూడా పనికిరాండ్రా ఎంకన్నా !"

"నీలాటి మావుండగా దానికి నే నెందుకో ?"

"ఏంటీ ? ఏంటిరా పేల్తున్నావ్ ?" అంటా లగెత్తికెల్లి స్నెల్లుని లెంపకాయి కొట్టాడు. రొండుసేతుల్తోటీ పీకి పిసకబో తంటే, ముసలయ్యొల్లి రవఁణయ్యని ఎనక్కి లాక్కొచ్చాడు. ఎంకన్నని బద్రయ్య తీసికెల్లాడు.

రవఁణయ్య బుజంమీంద చెయ్యేసి పక్కకి నడిపించాడు ముసలయ్య.

"నీ పెళ్ళాఁవెప్పుడు పోయింది బాబూ ?"

"నాలుగు నెల్లయినాది."

"పిల్లా ?"

"ఉన్నారు."

"ఆళ్ళని కనిపెట్టుకుండడానికి ఎవుళ్ళూ లేరా ?"

"నేను బతికున్నా సచ్చినోళ్ళల్లోనే జవఁ తాతా !"

"ఏం సేత్తాం బాబూ ! బూమ్మీంద పడ్డవోడికల్లా సావు తప్పేది కాదు నాయినా ! కూతంత ముందో ఎనకో పెతీవోడూ

బూడిదయిపోవోడే! పుట్టడం, సావడం ఏదీ మన సేతుల్లో లేదు. పేనాలు తీసుకుందారని పెద్ద పలుపుతో వురోసుకున్నా అందరూ సచ్చిపోతారా? అంతా ఆ బగమంతుడి దయా; ఈ పెపంచకవుంలో రోజురోజూ వొచ్చీ బాదలికి తట్టుకోలేక సావులు కోరుకుంటాం. అదీ మన తప్పు కాదు. కాని ఎవుడి కాడు సచ్చిపోతావుంటే లోకవంతా ఏమయిపోవాలి బాబూ? బతుకుమీద ఏ ఆసీ లేపోయినా వున్నవోళ్ళని చూసయినా మనకి బతక్క తప్పదు. పప్పూ వొణ్ణవూ సెయిజారిందని గెంజితాగడం మానేత్తావా?"

రవణయ్య మాటాడలేదు.

*　　*　　*

కొండమీదున్న సుక్కల రవ్వలు తలుకు లొత్తు తన్నాయి. రాదారీ లాంచీ సప్పుడేదో దూరాన్నించి వినిపిస్తా వున్నాది. గాలి అలికిడికి సిన్న కెరటాలు వొకోపాలి దొల్లు కుంటూ వొచ్చి గట్టుమీద సెదిరి పడతన్నాయి. వొడ్డునున్న రాయిసెట్టు ఆకులు కదుల్తా వున్నాయి. చెట్టుమీదున్న పిట్ట గూళ్ళ వుయ్యాల్లూగుతన్నాయి.

రవణయ్య మనసు రకరకాలుగా పరిగెడతన్నాది.

గుమ్మంకాడ నిలుసున్న సీతమ్మని ముసలయ్య చూశాడు. రెప్పలోల్చకుండా చూశాడు. శానాసేపే సూసాడు.

సీతమ్మ దరి కొచ్చింది. దాని సేతులో గళా సున్నాది.

"సల్ల తీసుకో తాతా!"

ఆ మాటనీదాకా ముసలయ్య యీ లోకవుఁలో లేడు. రమణయ్య బాద సూత్తావుంటే ఆడి మనసు మనసులో లేదు. ఒంటిగాడయిపోయిన రమణయ్య, పిల్లల్ని పెంచి పెద్ద సెయ్యాలిసిన రమణయ్య, బతుకు బరువు మొయ్యలేక అనగారి పోతున్న రమణయ్య—యిల్లాంటి రమణయ్యలు ఆడి కళ్ళ ముందల ఎంతమందో కనిపిచ్చారు! పుట్టినకాడినించీ సచ్చే లోపల, చేసుకున్నదాని మేరకి ఎప్పుడూ ఏదో బాద రాకుండా బతగ్గలిగే అదురుట్టవుఁ అంతమందికీ దొరకదు. పురిటిగదిలో సంటిబిడ్డ కేరుమంటాది. వొల్లకాట్లో పీనుగు కట్టె సుయ్యి మంటాది. ఈ రెండింటికీ నడాన్న మనిసి! ఎన్నో మనసులూ, బాదలూ, కోపాలూ, సుకాలూ, పగలూ—అన్నీ కూడబలుక్కుని మనిసిని గుప్పిట్లో పెట్టుకుంటాయి! సరదాపుడితే ఆడికి పట్టపగ్గాలుండవు. ఏది పుట్టినా నిల్దొక్కుకోలేదు. అయినా అన్నీ తన సేతుల్లోనే వున్నాయనుకుంటాడు. ఆ నమ్మకవుఁతోనే ఏవేవో పన్లు ఎందుకెందుకో సేత్తాడు. సిగురికి అయి ఎలాగో తేల్తాయి! అప్పుడు తన్ని చూసి తనే దడుసుకుంటాడు. నాలిక్కొరుక్కుంటాడు. పళ్ళు బిగిత్తాడు. జుట్టు పీక్కుంటాడు. కానేం లాబం? అప్పటికే అంతా సెయిదాటిపోతాది!

సీతమ్మ మనుసుల్లో పుట్టవోలిసింది కాదు! ఎన్నలాటి ఎన్నెల గుండె. తుపాన్లో వొరికంకిలా కదలాడిపోతాది. గాల్లో దూదిలా ఎగిరిపోతాది. అన్నం పున్నం అసలే తెలీదు. దానికిద్దరే సుట్టాలున్నారు. గోదారితల్లి! తాతా! ఆ యీడు

క్కావలసిన సర్దాలు దానికి లేవు. ఏ సరుకూ కావాలని కోరు కోదు. ఇచ్చినా తీసుకోవాలని తెలీదు. అల్లాటిదానికి అప్పుడే దేవుడు యిన్ని అనబాలెందుకు పెట్టాలో? తప్పుడుపన్లు చేసే వోడికి ఎప్పటికోప్పటికి దండింపు తప్పదు. మరి ఏ పాపం ఎరగ నోళ్ళకూ్కాడా ఎందుకీ బాదలు? ఏం టీ మాయంతా? దేవు డింత కటికోడేం?

రవణయ్య పక్కకి చూశాడు. సీతమ్మ బుర్రొంచు కున్నాది.

"సల్ల తాగవా తాతా?"

అప్పటికిక్కానీ ముసలయ్య నేలమీద నిల్దొక్కుకోలేదు. రవణయ్యా, సీతమ్మా ఎదర కనిపించారు. యిద్దర్నీ యిడిడిగా చూశాడు.కలిపీ సూశాడు. ఆడి పెదాలు తడిగా కదిల్నాయి.

"వొద్దు తల్లీ! నా కింకేయీ వొద్దు..."

రవణయ్య సీతమ్మొంపు మల్లా సూశాడు. అది తలెత్త లేదు.

ముసలయ్య రవణయ్యొంపు చూశాడు. ఆడి కళ్ళల్లో మెరుపు మెరిసింది.

ఎనక్కి తిరిగింది సీతమ్మ. ముసలయ్య పిలిశాడు.

"సూడమ్మా! పాపం ఎంతో దూరంనించొచ్చాడు. సానా అలిసిపోయాడు. ఆ గళాసు ఈ బాబుకియ్యి. నీ సేత్తో యిచ్చిందానికి కోటి జనవాల దాగం తీరతాది!"

రవణయ్య గళాసందుకున్నాడు.

సీతమ్మ పయిట సవుదుకున్నాది.

"అంతా నీ సలవ తాతా!" రవణయ్య నోట్లోంచి మాటలు రాలేకపోయాయి.

"నాదేవుంది బాబూ! అందర్నీ సల్లగా సూసీవోడు ఆ రావయ తండున్నాడు. ఆయన్ని నమ్ముకునోళ్ళ కెప్పుడూ అన్నాయం జరగదు. ఎవుర్ని ఎక్కడ కలుపుతాడో, యెక్కడిడదీత్తాడో ఎవ్వరూ సెప్పలేరు." ఆ మాటంటావుంటే ముసలయ్య గొంతుకులో ఏదో అడ్డడిపోయింది. కళ్ళు నీళ్లు సిమ్మాయి. సేతులు వొనికిపోయాయి.

సీతమ్మ లోనికెళ్లింది. పోతా, రవణయ్యోంపు చూసింది.

రాయిసెట్టు నెత్తి మీదకి పాక్కొచ్చాడు సెందురుడు. వొంటేలవతల కొబ్బరి కాయల బత్తాలెనక జనం సందడెక్కువయింది. ముసలయ్య లగెత్తుకొచ్చి పడ్డాడు.

బద్రయ్య ముటావోళ్ళు కల్లుకుండ సుట్టూ సేరి గొడవ సేత్తన్నారు. వొకడికంట మరోడు యిరుసుకు పడతా, కుండ కాలీ సెయిడవుం కోసం కొట్టుగుంటున్నారు.

ముసలయ్యకి కోప వాగిందికాదు. ఆళ్ళని తిట్టాడు. గట్టిగా అరిశాడు, ఆళ్ళసిపించుకోలేదు. దొరికనోళ్ణల్లా బనీనట్టుకు లాగి యీా దవోడా ఆ దవోడా వోయించాడు. ఒకోడు తిరగబడ్డాడు. మరోడు పక్కకెల్లీవోడు. మల్లీ అందరూ కలిసి కుండ మీాద పడీవోరు.

ఎనకాతల రైలుపట్టాలకాడ యీాలినిపించింది! ముసలయ్యకి దడుకుట్టింది. కానేం సేత్తాడు?

పోలీసోళ్ళు దాపు కొచ్చారు. అక్కడి కుండక్కడే యిడి లేసి అందరూ కాళ్ళకి బుద్ధి సెప్పారు. ఇద్దరు ముగ్గుర్ని పోలీ సోళ్ళు తరివారు. అంకలా! ఓ పోలీసోడు పాపం బోర్లా బొక్కలా పడ్డాడు. ఇంక చేసేదేం లేక ముసలయ్య మీదివసుకు పడ్డారు.

"ఎవురాళ్ళు?" బక్కటోడు డడిగాడు.

"నా వోళ్ళే!"

"ఏడిశావ్! ఎన్నాళ్ళనించీ యాపారం?"

"నీ తెలివి తెల్లారిన కాణ్ణించీ!"

"నోరుముయ్! సితకబొడగలం."

"నీ సి తం!"

క్ర్రెత్తిపోయాడు బక్కపలాసటోడు. ముసలయ్య సెద లేదు. రొండోవోడు కన్నుగీటాడు.

ముసలయ్య నవ్వాడు. ఆ నవ్వులో కిటుకు ఆళ్ళ కెవురికీ తెలీలేదు. పాపం!

"ఇనుగో సూడు ముసలోడా! మాతో వుత్తిపున్నాన్ని పేసీ పెట్టుకోకు. గుట్టు సప్పుడు కాకపోతేం నీకేం బయం లేదు. లేపోతే యీ యేల నీ సావు మూడతాది!"

మల్లా నవ్వాడు ముసలయ్య.

"ఎర్రినాయన్లారా! నే నెనకే సచ్చిపోయాను. నాతో ఎందుకీ గోడవ? మీ పనేదో మీరు చేసుకోండి!"

బక్కటోడికి సిర్రెత్తుకొచ్చింది. గట్టిగా రొండుసాట్లు యీలూదాడు.

వొళ్ళోంచి సెంద్రకాంతం ఎలపలికొొచ్చింది.

పోలీసోళ్ళ కళ్ళు తలుక్కుమన్నాయి!

ఎనకాతలే బద్రయ్యా వొచ్చాడు.

బక్కపలాసటోడు మొకం సిట్లించుకున్నాడు!

గుడిసిలోంచి సీతమ్మకూడా లగెత్తుకొచ్చింది. పక్క నించి రవణయ్యా కలిశాడు. ఎనకాతల ఎంకన్నా వొచ్చాడు!

అంతమందిని సూడ్డవుతో పోలీసోళ్ళకి అనుర్టింది. బక్కటోడు మల్లా యీలేశాడు.

సిటికిలో ముగ్గురు పోలీసోళ్ళు దిగొచ్చారు.

ఎనకాతలే సర్కిలు మోటారొచ్చి గట్టుమీా దాగింది ! ఆణ్ణిచూసి బక్కటోడు, పక్కవోడూ బెరుకు బెరుగ్గా సలావు లెట్టారు.

సర్కిలినస్పెట్టరు, దగ్గిరుండి ముసలయ్య సేతులికి బేడీలు వేయించాడు. బక్కటోడు కల్లుకుండ తీసుకు పట్టుకున్నాడు.

బద్రయ్యా, రవణయ్యా, ఎంకన్నా అక్కడున్నారన్న మాటేకాని సొరవసేసి ఎదట కెల్లలేకపోయారు!

సీతమ్మ వొలవొలా ఏడిసింది. రవణయ్య గుండి సెరు వయింది. బద్రయ్య ఆడి కాళ్ళట్టుకు యిదల్లేదు.

"వొద్దు తాతా! నువెక్కడికీ ఎల్లొద్దు. నువ్వు లేకపోతే మేం సచ్చిపోతాం!"

"నే నెక్కడికెల్తా బద్రయ్యా! ఎప్పుడూ మీా మనసుల్లో ఉండనో?"

సీతమ్మ ముద్దలా పడిపోయింది. తెలివి తప్పిందనుకున్నాడు రవణయ్య.

అప్పటిదాకా గోదారొంక సూత్తన్న ఎంకన్న కొంచెం కదిలాడు.

"మా తాత నెందుకు పట్టుకున్నారు బాబూ?" బద్రయ్య అడిగాడు.

"ఎందుకా? దొంగతనంగా సారా యాపారం చేస్తున్నందుకు!"

"ఆడు కాదండయ్యా! ఈ యాపారన్రు నాది! కావాలంటే నన్ను తీసుకెల్లండి;"

ముసలయ్య నవ్వాడు.

"వుట్టిదిబాబూ! ఆళ్ళమాటలు నమ్మకండి. ఈ యాపారమంతా నాదే! యీళ్ళు నా పిల్లలు, నన్నిడిసుండలేక అల్లాగంటున్నారు. ఆళ్ళ మాట లినకండి. మనదార్ని మనం వెల్దాం, రండి!"

బద్రయ్య యిదల్లేదు. రెండు కన్రలొచ్చి ఆణ్ణి వెనక్కి తోశాయి.

ఎంకన్న ఎనక్కి తిరిగాడు. ముసలయ్య ఏదో సెబుదారని నోరిప్పాడు. మాటలు రాలేదు. ముందుకి రాబోయాడు. పోలీసోళ్లు ఎనక్కి లాగేశారు. ఎంకన్న అలాగే సూత్తా నిలుసుండి పోయాడు. ముసలయ్య సంతోసంగా ఆళ్ళతో ఎల్లిపోయాడు!

ఎంకన్న మనస్సు పీకింది. ముసలయ్య ఎందు కబద్దవుఁ సెప్పాడు? తను చేసిన తప్పుడు పనికి ఆడెందుకు జెయిలు కెళ్ళాడు? తనమీాద అంత కనికార మెందుకు సూబించాడు? అసలు తనికీ, ఆడికీ సుట్టరిక వేంటి? ఎంకన్న గిలగిల్లాడి పోయాడు!

ఆళ్ళంతా లోన కెళ్ళిపోయారు. ఎల్లా లేదు. ఏమో బొమ్మలు కదిల్నట్టే కదిలారు. కొండమీాంచి పడతన్న ఎన్నిల సెట్టు గుబుల్లో నిలిసిపోయింది!

గదిలో దీపం సన్నగావెలుఁగుతోంది. ఎంకన్న యీాఎంపు నించి ఆ ఎంపుకి వొత్తిగిలాడు.

రావుఁలమ్మ వుండుండి మూాలుఁగుతన్నాది. నిదర్లో ఏడుత్తాంది. ఉసూరని ఊపిరిదుల్తన్నాది.

గట్టుమీాద ఆవు అరిసింది. పిచ్చికుక్క మొరిగింది. పడవమీాద పల్లోడెవురో రాగం తీస్తన్నాడు.

ఎంకన్నకి మల్లా కునుకట్టలేదు. బల్లమీాద దొల్లుతున్నాడు.

రావుఁలమ్మకి తెలివొచ్చింది. మూాలు గెక్కువయింది. ఎంకన్న తల తిప్పి చూాశాడు. నెత్తిని కట్టు, సెదిరిన జుట్టు, కయిఁలిపోయిన మొగవుఁ తోటకూార కాడల్లా కనుపిత్తన్న సేతులూ! దాన్ని అప్పుడే ఆడు సరింగా చూాశాడు.

అయినా ఆడి మనసు మారలేదు. గోడమీాదున్న బొమ్మని చూాసినట్టే చూాశాడు.

రావుఁలమ్మ గొంతు కెండిపోయింది. చుట్టూతా చూసింది. గోడ మూల నీళ్ళకుండ కనిపించింది. గళాసు లేదు. మంచంమీద లెగిసి కూకున్నాది. కిటికీకాడ నిలుసుని ఎలపలికి సూత్తావున్న ఎంకన్న కనిపిచ్చాడు. ఆణ్ని చూసి వొనికి పోయిందది. గుండె దబదబా కొట్టుకున్నాది.

ఏదో అందారనిపిస్తోంది. నోరు పెగల్దు. గొంతుకు తడారి పోయింది. మాట రాదు. మంచవుఁమీంచి లెగిసి నిల బడపోయింది. కాళ్ళు కదల్లెదు. ఎనక్కే తూలిపోయింది.

"ఆడిల్లా గెందుకయిపోయాడు? మొన్న మొన్నటి దాకా తన్ని కన్నురెప్పలో దాసుకుని మురిసిపోయివోడల్లా ఎందుకింత మారిపోయాడు? దీనికంతకీ కారనవుఁ తనే! తనే, తనే! పట్నవెల్లి అంటికాయఁలు అమ్మకు రమ్మందెవరు? సుక్కల సీరలూ, రంగుల రయికలూ తెమ్మం దెవరూ? ఆడు ముచ్చటపడి తెచ్చిన కోక కట్టుకోకండా సీదరించుకు తోసేసిం దెవరూ? పట్నంలో ఆడు బోగంకొంపలసుట్టూ తిరుగతావుంటే ఆడి మనుసు తిప్పకోలేక సెడా మడా తిట్టిం దెవరూ? అయినో డల్లాగయిపోయినా పిల్లలకోసవఁని రవఁణయ్య మావఁమీద మోజు పడిం దెవరూ? సిగురికి అన్ని సర్దాలూ సంపుకుని సీకటి కొట్లో దాగున్న దెవరూ? మొగోడి మనుసు తెలుసుకోలేక, తన సుకాన్నీ, మొగుడి సుకాన్నీ నీళ్ళ కొదిలిం దెవరూ? యీ టన్నింటికీ కారనం ఎవరు? ఎవరు?"

రావుఁలమ్మ మల్లా లెగిసింది. నెమ్మలంగా గోడట్టుకుని మూల కెల్లింది. కుండమీద మూకుడు తీసి నీళ్ళు తీసుకోబో

యింది. సేతులు పట్టు తప్పినాయి. కళ్లు సీకట్లు కమ్మినాయి. తల తిరిగిపోయింది. అంతెత్తు మనిసీ రావుఁలమ్మ నేలమీద బోర్లా పడిపోయింది.

గిరుక్కుని ఎనక్కితిరిగాడు ఎంకన్న. ఆడి గుండి సివుక్కుమన్నాది. దాపు కెళ్లాడు. మూకుట్లోకి సీళ్లొంచి, మొకం మీద కొట్టాడు. రొండు సుక్కలు నోట్లో కూడా పోశాడు.

ఆడి బుర్రలో ఏమేమో సుర్రుగ్గా తిరిగిపోతన్నాయి!

బాలయ్యగారూ, సత్తెన్నాయ్యనగారూ, రవ్వాణయ్యా, బద్రయ్యా, సెరబయ్యా, సెందరకాంతం, సీతమ్మా, సిగురికి ముసలయ్యా, ఇప్పుడు రావుఁలమ్మా, ఎవురీళ్ళంతా? ఈళ్ళందరికీ తనెవుడు? ఈ పెంపంచంలో మంచేంటి? సుకవేంటి? కనికారవేంటి? ముసలయ్యకీ తనకీ సుట్టరికవేంటి? రావుఁలమ్మ తన్ని దేనికి నమ్ముకున్నాది? ఏంటి, ఏంటి, ఏంటిదంతా?

రావుఁలమ్మ కళ్లెత్తి చూసింది. ఆడి కాళ్ళమీదకి వొరిగి వొలవొలా ఏడ్చింది.

"ఏడుత్తా వెంపుకూ? లెగు!" ఆ మాటలు ఎంకన్న గొంతుకులోంచి ఆగాగి వొచ్చినాయి.

మొట్టమొదటిసారిగా ఎంకన్న కళ్లు సెమ్మరించాయి. దాని సేతుల్పట్టుకు తడివాడు. సల్లగా కలవకాడల్లాగున్నాయి. కళ్ళల్లో వూపిరి తగ్గింది. ఆడు గిజగిజలాడి పోయాడు.

"వొద్దు రావేఁ నువ్వు సావడానికీల్లేదు. నేను సావనియ్యను. ఎంత డబ్బయినా కరుసుపెట్టి నిన్ను బతికించుగుంటాను! రావేఁ! నిన్ను కళ్ళల్లో దాసుకుని కనిపెట్టుగుంటాను!"

దాన్ని గుండి కొత్తుగున్నాడు!

ఎలపల్నించి యేలపాట యినిపిస్తున్నాది.

చెట్టుమీద పిట్టలు కిస కిస మన్నాయి.

రావులమ్మ పెదాల్లో ఏమో మాటలు కదలాడినాయి.

పాకి పాకి, గోదారిపై కొచ్చి నీళ్ళమీద పడ్డ ఎన్నెల్లో గోదారి గట్టంతా ఎలిగిపోతన్నాది!



నవభారత్ ప్రచురణ

''ఎన్నాళ్ళు మనకోలె సుకములంటి
కంటనీరెట్టింది జంట నా యెంకి!

*    *

యెనక జల్మంలోన
యెవరమో నంటి,
సిగ్గొచ్చి నవ్వింది
సిలక నా యెంకి!

*    *

ముందు మనకీ జల్మ
ముందోలె యంటి,
తెల్ల తెల్లబోయింది
పిల్ల నా యెంకి!

*    *

ఎన్నాళ్ళు మనకోలె యీ సుకము లంటి
కంట నీరెట్టింది జంట నా యెంకి!''





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA119B119 |
| పుస్తకం పేరు | వెలుగూ వెన్నెలా గోదారీ |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 225 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసేవది | APS001 |
| పేజీలు విడదీసేవది | APS002 |
| స్కాన్ చేసేవది | PLKSQL01 |
| పరీక్ష చేసేవది | ROHITH |
| పేజీలు సరిచూసేవది | |
| బైండింగు చేసేవది | |
| ప్యాకింగు చేసేవది | |
| పరిస్థితి | good |